శ్రీరస్తు.

శ్రీ మేధా దక్షిణామూర్తి సద్గురు పరబ్రహ్మణేనమః.

శ్రీ మద్వినోద కథాకల్పన గ్రంథాంతర్గత,
మదనమాలినీ మానపాలుర చరిత్రాత్మక

# సతీశృంగారవతి.

గ్రంథకర్త:

నెమ్మాని వేంకటరామశర్మ,
దగ్గుబాడు.

బెజవాడ
వాణీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది.

1929.

ఓం శ్రీ కనకదుర్గాంబాయైనమః.

ఈ నాటకమును జాలవఱకుఁ జదివితిని. ఇందులోనికథ వినోద కథాకల్పవల్లి ననుసరించి వ్రాయఁబడినది. పేరునుబట్టియు కథననుసరించియు నిదిశృంగార రసప్రధానమైన నాటకమయ్యును ఆశృంగారము కేవలముపచ్చిబూతులఁ బుంగవలెఁగాక సరసమై నీతులకుతావై యలరారుచున్నది. వీరికవిత్వము ధారాళమై రసవంతమై శ్రోతలకానందముఁగొల్పుచున్నది. వీరు పిన్నలయ్యు నింతరసవంతముగా నాటకాదుల రచించి సద్యశమునకుఁ బాత్రులై భాషాపోషకు వన్నెఁదెచ్చుచున్నందులకు వంద్యులు. వీరిట్లే ననేకగ్రంథరాజముల రచించుటకుఁ బరమేశ్వరుఁడాయురారోగ్య సౌభాగ్యముల నొసఁగుఁగాక.

బెజవాడ,
15—6—29.

ఇట్లు
ప్రతాప వేంకటేశ్వరశాస్త్రి,
శతావధాని.

శ్రీరస్తు.

# కృతిప్రశంస, గురుకృతజ్ఞత.



"కావ్యాంతే నాటకం రమ్య" మను శబ్దార్థమును బట్టి పండితులగు వారు కావ్యములు రచించు మీఁద రచించు నాటకములు తప్ప తక్కిన నాటకంబు లొప్పిదంబులు కావు సరిగదా తత్కృతికర్తలగు వారికి సైత మాకృత్యము గొప్ప తప్పిదంబుల నొనగూర్చుచున్నదని పండితులగు వారు శాసించుచున్నారు. కావ్యమనఁగా శ్రావ్యప్రబంధ మనియు నాట మనఁగా దృశ్యప్రబంధమనియు నభిప్రాయము. అట్టిచో నట్టిశ్రావ్యప్రబంధ మొక్కటేని రచించి యిప్పటికవులు దృశ్యప్రబంధంబులు రచించుచున్నారా? అనునది పెక్కురులయందు ముఖ్యముగ నున్నది. చూడం జూడ గ్యముగనే యేమి శూన్యముగనే యున్నదని పలువురు నుడువుచున్నారు. కాని యవి సార్థారమ్యతఁ జెందకుండునని మాత్రము సాహసించి కొన్నిటియందుఁ జెప్పఁబూనరు. ఎందుచే? కావ్యంబులను శ్రావ్య ప్రబంధంబులను రచించు మీఁద నే రచింపఁ బడినవి కాకున్నను, తదీయ శ్రావ్యప్రబంధాద్యనేక గ్రంథార్థానుభవముఁ గల్గు బిమ్మట నీదృశ్యప్రబంధంబులు రచింపబడినవగుటంబట్టి. ఐనను కవితాలోకభూషణులగు బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు తమ విచిత్రపాదుకాపట్టాభిషేకం బను నాటకంబునందు బహిరంగపరచి చూపించిన క్రమాలంకార లక్షణంబుఁ జూడఁగా దానికదియే లక్ష్యలక్షితంబుగాని తదన్యాంధ్రనాటకంబులందేదియుఁ దదీయలక్షణలక్ష్యమై యొప్పారనేరదని చెప్పవచ్చు. భాషాసముద్రంబున సర్వగ్రంథార్థాందోళనాతరంగంబులతో నోలలాడుచు బ్రహ్మాండ పురాణాదిమహాసత్ప్రబంధరత్నంబులను గీర్వాణవుంగనుండి వెలిఁ దీసి యాంధ్రభాషామృదుపదంబులతో సమకూర్చి సరస సరళభావంబున మెఱుఁగెక్కించి ప్రపంచమునం దంతకును దత్ప్రకాశంబు

నకుఁ జౌరవఁ గల్గించిన యామహాకవి ప్రయత్నమునం బొకసర్వలక్షణలక్షితంబగు నాంధ్రనాటకరాజంబు వెలువడుట యంతయతిశయోక్తిగాదు. ఐనను అట్టి సలక్షణములతోఁ గూడుకొనకున్నంతమాత్రమునే బ్ర. చి. లక్ష్మీనృసింహము పంతులుగారు, బ. లక్ష్మీ కాంతము పంతులుగారు పా. లక్ష్మీనృసింహారావు పంతులుగారు మున్నగువారి యాంధ్రనాటకరాజములన్నియు నవలక్షణనాటకములనఁ బరఁగెనా? లేదు. లేక సర్వజనమనోరంజకములై యొప్పారె ననుటలో నిస్సంశయముగనై ప్రకాశించుచున్నవి. ఎందుచే? ఆ గ్రంథములయందుఁ బాండిత్య ప్రకర్షణయు భావప్రకటనయుఁ బాత్రపోషణయు సమకూరుటంబట్టి. ఇట్టి సర పండితపామరజనశ్లాఘనీయులగు బ్ర. శ్రీ. వే. వేంకటరాయాదిమహాపండిత కవుల నాటకగ్రంథములందే భావాదిలోపంబులను నిరూపించి వారల నల్పప్రాయులుగ భావించి పెక్కురులు నిందించుటయుఁ బెక్కురు లానందపరవశంబునఁ గీర్తించుటయు నెల్లయు నా చెవులతో నేను వింటి. వినియు స్వల్పజ్ఞుడనగు నాచే రచింపంబడెడు నానాటకమెట్లుండునో యను సంశయాత్మకమున నాయుద్యమము నేనెట్లు మానుకొందు? ఇప్పటి కెనిమిది వత్సరములక్రిందట నొకచోట వినోదకథాకల్పవల్లియను గ్రంథముఁ జూచుటకై నాకు లభింపగా నీచరిత్రమందు జూచి దీని యందనురాగబద్ధుడనై యీమూలకంబుగా నాయభిప్రాయంబులఁ గొన్నింటి బహిరంగపరుపనెంచి శూన్యకవితాలక్షణజ్ఞుండ నగుటచే పిశుపాటి నారాయణశాస్త్రిగారియొద్దఁ దొలితొల్తఁ గవితాలక్షణముఁ గొంతాక కొంతయైనను వలనువడు నప్పుడెల్ల దరిఁజేరుచు గ్రహించుచు రచనావిధానమునకుం గడంగి అప్పటికప్పు డుదయించు నూతనభావోద్రేకములచే సంవత్సరమునకు రెండు చిత్తుప్రతులుగను ఒకసాపుప్రతిగను బూర్తిచేయుచు బ్రదర్శన ప్రకటనములకు నాటకసంఘాధ్యక్షులఁ జేరుచు గ్రంథవిమర్శనమునకుం బండితులం జేరుచు.

గీ॥ పోఁబోడిచి చూచిన యె • మూలనైన
నొక్కయక్షరంబును లేని • బక్కవిధవ

లెల్ల రిప్పుడు కవులెపో • యింకనాట
కములు వ్రాయుట యందు ల • క్ష్యంబె లేదు.

యనెడు భావమున ననాదరించు వారి యాంతరంగికాభిప్రాయముల నెఱుంగుచుఁ దత్పరిశోధనాధికారముల సైతము నేనేయొంది పరిశోధించుకొనుచు న శకంతకుంగ చున్న లోకాదిస్వానుభవార్థంబు లందం దుఁ జేర్చుచునెట్టకేలకు గతవ రాంతమగు నప్పటికి పదియంకములతోను ఇనూ్నటయేబది పేజీలతోను గ్రాలునట్లొనర్చి స్వకీయముగా ముద్రింపించుకొనుటకై గుంటూరుపురమున కేగి యచ్చట నాకపూర్వఁబాంధవుండునై పాతగుంటూరుమునిసిపల్‌స్కూల్ టీచరుగానున్న బ్ర. శ్రీ. కానులనాటి వేంకటసుబ్బయ శాస్త్రులవారిచే నింతగ్రంథము ప్రదర్శనీయముగాదని హెచ్చరిక నొంది మగుడ సంగ్రహముగా వ్రాయనుద్యమించి వారింటనే భోజనాదిసత్కారముల గాంచుచు నెప్పటికప్పుడు వారిచే పరిశోధించుకొనుచు నంతలో గార్యాంతర సందర్భమున స్వగ్రామమగు దగ్గుపాడే తెంచి మఱల గలిగిన నూతనాభిప్రాయములచే గథావిధానమును బద్యములను నూతనాంశముల నొప్పారఁజేసి యెట్టి కవియు నెన్ని గ్రంథములు రచించియు నొందని శ్రమయు, నొక్క దీనియందే యొందినవాఁడనై నేఁడు బహిరంగపఱుపక నేమని యెట్లు విరమించుకొందు? అట్లు మానుకొనక మఱల బండిత పరిశోధనకిడనగుఁ గాలయాపనమునకు ముఖ్య బంధుమిత్రాదులోర్వమిచే నిట్లే ముద్రణమున కిడ నిశ్చయించితి. అందుచే నిందుఁగల లోపములు రసగ్రహణ పారీణులగు బండితులు పాటింపరనియుఁ బాటించి నిరూపించినను నాకుఁదెలిపి ద్వితీయముద్రణమున సరిచేయించి నాయందాదరభావముంచి తమ యౌదార్యముఁ బ్రకటించుకొనెదరనియు నమ్ముచు నాకు బ్రప్రథమమందు అనఁగా కడు బా మందు ప్రణవాది శబ్దార్థబోధనా గురువగు నుభయ భాషా కవితాసామ సర్వశాస్త్ర పురాణార్థసంవేదిత భక్తిపారవశ్యాంతర్బహిరాయాత ప్రకాశిత శ్రీ, వేదాంత పండిత కురవి వేంకట నృసింహ శాస్త్రిగారిని, కవితామార్గదర్శియగుఁ జీరాల పేరాల వనవాస కృష్ణాప్రభావ భజగోవింద రత్నత్రయీ తులా కావేరీ మహాత్మ్య

శ్రీ మదధ్యాత్మరామాయణ మహా పురాణ ప్రబంధాంధ్ర గ్రంథ కర్తృత్వాలంకృత ఉభయభాషా కవితా సామ్రాజ్య పండిత శ్రీ పిసుపాటి నారాయణ శాస్త్రులవారికిని ముఖ్యమహోత్సాహ కారకులగు నుభయ భాషా కవితా రచనాయుత దైవజ్ఞార్ధ్యద్యుక్తాష్టావధాన శ్రీ కానులనాటి వేంకటసుబ్బయ్య జోసులుగారికిని వందన శతమాచరించుచుఁ బండితుల మన్ననఁ గోరుచు నింతటితో నీప్రశంస విరమించుచుంటి.

ఇట్లు

విన్నవించునది,

గ్రంథకర్త,

నేమాని వేంకట రామశర్మ.



గ్రంథకర్త

శ్రీరస్తు.

శ్రీ మేధాదక్షిణామూర్తి సద్గురు పరబ్రహ్మణేనమః.

# సతీశృంగారవతి.



ఇది

వినోద కథాకల్పవల్లీ గ్రంథాంతర్గత మదనమాలినీ మానపాలుర చరిత్రాత్మకమగు నవరసగర్భిత నాటకము. ఈ నాటకగ్రంథమందు గ్రహింపఁదగు ముఖ్యవిషయానుక్రమణిక.

(1) మానపాలుఁడు— ఇతఁడు సహజస్థైర్య ధైర్య గాంభీర్యాది సకల గుణోపేతుఁడగు కథానాయకుఁడు ఈతనిహృదయము అద్దమువలె నిర్మలమైనది యగుటచే ఎప్పుడెట్టి విషయంబునఁ దనకుఁ బ్రసక్తి కల్గుచుండునో అప్పుడట్టి విషయంబుకు సమన్వయంబుగ హేతునిరూపణ చేయుచు లోనగుచుండుటయు సహజముగాఁగలవాఁడు. ఇట్లెంతగాఁదాఁ బరిశుద్ధాత్ముఁడయ్యు సర్వసంగుఁడైచుండుటచే నెన్ని కష్టసుఖంబులకు లోను గావలసివచ్చునో అట్టివిషయంబున కీతఁడాదర్శకుఁడు.

(2) మదనమాలిని— ఈమె కథానాయిక. సహజరూప లావణ్యోపేతయగు విద్యత్ప్రౌఢయౌటచేఁ దానెంత సిద్ధసంకల్పయయ్యుఁ దన సంకల్పము దుస్సంలితము జేయక యెట్లుగాఁ దనసతీత్వముఁగాపాడుకొనుచు సర్వశృంగార సుఖంబులఁ దాననుభవించుచుఁ దననాథు ననుభవింపఁ జేయుచుఁ దానోట నుడువకనే తనయందు దుండగమూనిన తననాథునకుబు చెప్పినదో అట్టి సచ్చాతుర్యమున కీమెయాదర్శిని.

(3) ఆనందుఁడు— ఇతఁడు కథానాయకుని యాబాల్య స్నేహితుఁడగు వేదాంతపండితుఁడు. ఈతని వలన ఐహికాముష్మిక ధర రహస్యము లెట్టివియో సాత్వికమగు నిశ్చలోద్రేక చిత్తంబునం దెట్టి మ..మ యున్నదో బోధపడును.

(4) మదనవతి—ఈమె కథానాయికకు తోఁబుట్టువు. ఈమెవలనఁ తోఁబుట్టుప్రేమవిధానము మొదలగు సద్విషయంబులు చక్కగా బోధపడును.

(5) చెలి— ఈచెలి కథానాయిక కాబాల్యపు వేడుకచెలి. ఈ చెలి గొప్పవారి స్నేహంబువలన నెట్టి తెలివితేటలు గల్గునది తెలుసుకొనుట కాదర్శిని.

(6) బలపాలమహారాజు—వీరు కథానాయకుని తండ్రిగారు. వీరి వలన ముముక్షుకామియగుట కెప్పుడగునో అది చక్కగ బోధపడును.

(7) మంత్రి —వీరివలన రాజభక్తిగలమంత్రి రాజకీయవిధానమును రాజగువాఁడే పరాయత్తచిత్తంబున భంగము గావింపఁ దలంచునప్పుడు తదంగకారణమును విమర్శనపూర్వకముగ నూహించి స్వార్థత్యాగమునకైనను లోనై తచ్చిత్తంబును మఱల్పఁ బ్రయత్నింపక దనుసారియో యగుచోఁ దదుపేక్షచే, రాజునకెట్టి సంకటములు తట ంచునో అట్టి విషయం బెఱుంగనగు.

(8) దొంగ—వీనివలన ననుభవములేని పనియందుఁ బ్రవేశించుచో నెంత ధైర్యవంతునకైనను తనధైర్యము మూ తమమగు ధైర మైమధ్యమధ్య నెట్టి ప్రాణాపాయకరమగుఁ బొరపాట్లు తట ంచునో తె యనగు.

(9) శాస్త్రి, వీరివలన సాధారణముగా లోకమునందలి శాస్త్రి కటి పారిస్వభావము బోధపడును.

(10) మొత్తము గ్రంథమునందు దృఢమనోయుతుల సంకల్పసిద్ధి యట్టిదని తాత్పర్యమగు. శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

☞ ఈ గ్రంథము వలయువారు ఈదిగువఅడ్రస్సునకు వ్రాసి తెప్పించుకొననగు.

శ్రీ బ్ర॥ శ్రీ॥ నిమ్మాని వేంకటరామశర్మ, దగ్గుబాడు,

బాపట్ల తాలూకా (గుంటూరుజిల్లా).

# కథావిషయ సంగ్రహము

ప్రథమాంకము.

వసు మానసనగరములో బలపాల మహారాజు సభయందు నానందుని ప్రస్తావ వశంబున బలపాలుఁడును, బలపాల సుతుండగు మానపాలుఁడును రాజ్యాది సర్వైహిక విరాగులై యాసభ విడిపోవుట. కథానాయకుఁడగు నామానపాలుని యాబాల మిత్రుండైన ఆయానందుఁడు మఱల మానపాలుని సర్వానురాగు నొనర్పఁగలనని మంత్రికి ధైర్యము జెప్పి నగరబాహ్యారామమువైపున కేగుచున్న మానపాలుని వెంబడించును. బలపాలమిత్రుండును సౌధచందనపురాధిపుండునగు విజయదత్త మహారాజు వయోముగ్ధలును విద్వత్ప్రౌఢలు నవివాహితలు నగుఁదనకుమార్తెలను సకల విద్యాపారంగతలను జేయుటకై వారితో మృగయా వినోదము సేయుచు నటవికేతెంచఁగా విధివశంబున నొక మృగేంద్రము విజయదత్తుని ప్రథమ పుత్రికయగు మదనమాలినీ చేతినుండి తప్పించుకొని పరుగులిడుచు నీవసుమానసనగర బాహ్యారామముఁజొచ్చి యచ్చటవధి పడును. అంతటఁ దన్నుకాపాడుకొనుచుఁ గూడ వచ్చియున్న తండ్రిచే నావనవృత్తాంతమారసి ప్రస్తావసందర్భమున తన్నానగరాధిపతి కుమారుఁడగు మానపాలునకిచ్చు జనకుని నిశ్చయము జనకుచే నెఱింగి తమకు గల్గిన మార్గాయాసోపశమనార్థమై తన చెల్లెలతోను చెలికత్తెతోను తత్ప్రదేశమునందు చాటువేది లయందు శయనింపఁబోవును. విజయదత్తుఁడు మానపాలుని రాక గుర్తించి యేమెఱుంగనివానివలె నట నొకవేదిపై నుపవిష్టుఁడై యుండును. మానపాలుఁడు నగరబాహ్యారామము జొచ్చుచు నచ్చట మృగేంద్రమును వధించునప్పటి మదనమాలిని సౌరు గాంచి యందుకు ముగ్ధుఁడై మగుడ డెల్వొందింది విజయదత్తుని సమీపించిచూచి వీరెవరు? ని యోచించునంతలో ఆనందుని ప్రవేశము. అంతట మానపాలానందుల సంభాషణము. మానపాలుని పునరనురాగ జనము. మదనమాలినీ మానపాలుర వర. వరణ. నిశ్చయము. మానపాలుని వివాహ రాజ్యాభిషేచన నిశ్చయము.

## ద్వితీయాంకము.

కథానాయకుఁడగు మానపాలుని వివాహరాజాభిషేచనములైన నెలదినంబులకుఁ మదనమాలినీ మానపాలుర తొలి, నయేకాంతము, తదుపరి మానపాలుఁడొంటిగానై యుండి తాను లేనిసమయంబునఁ గల్గు నాయిక పురాణకాలక్షేప సత్ప్రవర్తనముఁ జెలిచేనెఱింగి తదీయసౌందర విద్యా వివేకములఁగూర్చి తర్కించుకొనుచున్నంతలో నచ్చటకా౦దు నాగమము. మానపాలానందుల మదనమాలినీ యంతఃపుర గమనము అంతట నంతఃపురంబున నాయికచే శ్రీమద్రామాయణమహా పురాణ కాలక్షేపము. మానపాలానందుల ప్రవేశము. మానపాలుని రామాయణ కథానాయికా నాయక పాత్ర విమర్శనము. మదన మాలిని స్త్రీసామర్థ్యోచ్చారణము. మానపాలుని పౌరుషరోష ప్రకటనము. ఆనందునూ ధనము. మానపాలుని యానందతిరస్కారమూ మదనమాలినీ గృహబంధము. తద్విచారము. మదనమాలినీ నిశ్చయ విషయప్రతిజ్ఞ.

---

## తృతీయాంకము.

కథానాయిక చెల్లెలగు మదనవతి లిఖితపూర్వక మదనమాలినీ యభిప్రాయమారసి తదుక్తంబుగ జననీజనకులయనుజ్ఞవడసి రత్నవర్తకమణి మంతుఁడను కృత్రిమనామముతోఁదగు ప్రయాణముతో వనుమానసనగర మునేరి యచ్చట రత్నవ్యాపారమొనర్చుచు వివిధ దానాది సత్కార్య ములతో గొప్పకీర్తిఁబడసి తన సచ్ఛీలత్వమునకు మెచ్చి. మానపాలుఁ డు తన్ను స్నేహించుటకును, ఆమానపాలునికి తన్నెఱుకసేయుటకును తనరత్నములపెట్టె నొకదొంగ యపహరించినట్లు నొకదొంగను నియమింపఁగా ఆదొంగ యాపెట్టెతోఁ దదాజ్ఞానువర్తియై యొక భటునకుపట్టు వడి. మానపాలుఁడు సభఁ దీఱియుండఁగా నచ్చటకు చేరును? అంతట నప్పుడు మంత్రిచేఁద సంబంధమగు విమర్శనము. శాస్త్రియానందులచే మణిమంతుని వివేకాది హెచ్చరిక. రాజాజ్ఞచే మణిమంతుని సభాప్రవేశ

ము. మణిమంతుని వినయప్రదర్శనము, మానపాలు నౌదార్య ప్రకటనము. దొంగవిడుదల. సభముగింపు. పిమ్మట మదనమాలినీ యంతఃపురమునందు భూగర్భమునుండి మణిమంతుని ప్రవేశము. మదనమాలినీ చెలికత్తెల విస్మయము మణిమంతునికథ. మదనమాలినీ మనోగతి. చెలిచే మణిమంత మదనమాలినుల ప్రతిరూప చిత్రలేఖనము. మణిమంతుని నిష్క్రమణము. మదనమాలినీ చెలికత్తెల భావికార్యాలోచన రహస్యము. మానపాలాగమనము. చెలివిచిత్రప్రదర్శనము. మానపాలుని నిష్క్రమణము. మదనమాలిని సంభ్రమము. చెలికృత్యము. రంగము ముగింపు మానపాలుని యాలోచనము. మానపాలాజ్ఞచే మంత్రియాగమనము. మంత్రిమానపాలుర సంభాషణము. మానపాలుని కృతనిశ్చయము.

---

## చతుర్థాంకము.

మానపాలుని కపట బ్రాహ్మణవేషము. కృతనిశ్చయాను సరణ సంచరణ క్రమాలోచనము. తదను వర్తిత్వము. కథానాయికకు చెలీ మణిమంతులచే మానపాలుని వర్తమాన పరిస్థితి నివేదనము. కథానాయికయగు మదనమాలినీ వనప్రయాణము కపటబ్రాహ్మణుని యుద్యానవనప్రవేశము కపటబ్రాహ్మణునితో నీచదాసీనేపథ్యంబున నున్న చెలీసంభాషణము. రత్నవర్తకమణిమంతుని భార్య నేపథ్యంబున శృంగారదేవీప్రవేశము. శృంగారదేవీ కపటబ్రాహ్మణుల సంయోగసంభాషణము కపట బ్రాహ్మణుని నిబ్బరము శృంగారదేవీ ప్రణయదుండగము. శృంగారదేవి లీసదనంబున, కపటబ్రాహ్మణుని మనోగతి శృంగారదేవి శృంగారము అంతలో నచ్చుటకు మణిమంతునాగమనము. శృంగారదేవిచే గపటబ్రాహ్మణగోపనము. మణిమంతప్రవేశము శృంగారదేవీ మణిమంతుల ప్రయాణనిశ్చయము. మణిమంతు నిష్క్రమణము. కపటబ్రాహ్మణుని యవమాన విచారము. శృంగారదేవీ పటబ్రా ణుల పరస్పర ప్రేమ సంభాషణము. కపట బ్రాహ్మణుని నిజనామ బ..రంగప్రకటనము. శృంగారదేవీ కృత్రిమ విస్మయము. కపటబ్రాహ్మణుని నిష్క్రమణము.

---

## —*పంచమాంకమందు.*—

మానపాలుఁడు తనకొనఁగూడిన పరనారియగు శృంగారదేవీ ప్రయాణమునకు మొదట చింతించి అంతకు వేయురెట్లులు పరనారీ సంగమదోషంబునకుఁ బరితప్తహృదయుఁడౌచు మదనమాలినీ యంతః పురమునఁ జేరియచ్చట చెలి మదనమాలినులుగానరామి విభ్రాంతుఁడై పరిపరివిధంబుల నాలోచించుచుఁ దుదకు తాకొనర్చు దుష్కృతంబులకు సహింపక యనువులు విడిచెనేమోయని చింతించి తచ్చింతనమునకు లోనై యొళ్లెఱుఁగని తనమునఁ బడిపోవ నున్నంతలో శృంగారదేవీ నేపథ్యంబు ననున్న మదనమాలినీ దేవియంతలో భూగర్భమునుండి బైలువెడలి భర్తపరితాపంబు గాంచి యత్యాతురముగ నాతనికి ముప్పుఁగలుగకుండున ట్లొనర్చి మహాపతివ్రతయగుటచే భర్తకుఁగల్గు వ్యథసహింపలేక పరితప్త హృదయయై యంతలోనాతఁడు తెలివొందుచుండుటఁ జూచి సంతసమ్ము నమఱల కృత్రిమకార క్రమమునకుఁ గడంగి చాటుఁజేరి యాతనికి మఱల స్త్రీచెడు స్వభావముఁజక్కఁగ హెచ్చరికఁజేయును. అంతట మానపాలు డు తెలివొందిలేచు పిమ్మట జఱుఁగు విచిత్ర కథయంతయు కథాభాగంబునందే జూడనగు.

శ్రీ ర స్తు.

# ఇందువచ్చు పాత్రములు

## పురుషులు

1 బలపాలుఁడు—కథానాయకునితండ్రి.

2 మానపాలుఁడు—కథానాయకుఁడు.

3 ఆనందుఁడు—కథానాయకుని యాబాల్యమిత్రుఁడు. బ్రాహ్మణుఁడు

4 విజయదత్తుఁడు—కథానాయకితండ్రి.

5 మణిమంతుఁడు—కథానాయకి చెల్లెలగు మదనవతీ రత్నవర్తక ఛద్మరూపము.

6 కపటబ్రాహ్మణుఁడు—కథానాయకుని ఛద్మవేషము.

7 మంత్రి.—

8 శాస్త్రి.— లోనగువారు.

9 భటుఁడు—

## స్త్రీలు

10 మదనమాలిని—కథానాయిక.

11 శృంగారదేవి—కథానాయిక ఛద్మనామము.

12 చెలి—కథానాయిక బాల్యపు వేడుకచెలి.

13 మదనవతి—కథానాయిక చెల్లెలు.



శ్రీమత్ వినోదకథాకల్పవల్లీగ్రంథాంతర్గతంబగు

మదన మాలినీ మానపాలుర చరిత్రాత్మక

# సతీ శృంగారవతి.

శ్రీరస్తు.

శ్రీ మేధాదక్షిణామూర్తి సద్గురు పరబ్రహ్మణేనమః.

శ్రీ మహాగణాధిపవిఘ్నేశ్వరాయనమః.

శ్రీ శారదాంబాయైనమః.

## "నాంది"

( శార్దూలవిక్రీడితావృత్తము. )

శ్రీమంతంబుగ సర్వవస్తు సమతు • ష్టింజెంది యొప్పారు నీ
వామార్గంబుఁ దలంప క్కటమిలా • హంభావము న్జెంది యి
ప్రేమార్గంబున నుండనయెఁ ననీ, సం • హేలించి హేళించుచున్
వామాంశంబు గ్రహించు ంభుసతి సం • వాదంబు మేలిచ్చుత్రన్.





శ్రీరస్తు.

# సతీశృంగారవతి.

## ప్రథమాంకము.

ప్రదేశము. బలపాలుని కోర్టు.

(బలపాలమహారాజు, మం , శాస్త్రి, అవధానులు, లోనగు వారు ఉచితాసీనులై యుందురు.)

బల—(శాస్త్రినిజూచి) స్వామీ!

చం॥ కుటిలులు నీతిదూరులును • గొంచెపుబుద్ధుల య వాదులున్
గటకట! నా కాథములు( • గర్మవిహీనులు వేదదూషులున్
విటులును మోసగాండ్రు లవి • వేకులు మత్తులు నన్నవిక్రయుల్
నటకులు నాదిపాపపు జ • నంబులు ముక్తిని యెట్టులొందుటల్?॥

శాస్త్రి—రాజేంద్రా! సకలధర్మస్వరూపులగు భవాదృశ రాజశేఖరు
కి విచార మొక యతిశయోక్తిగాదు. ఐనను దుష్టశిక్షణ శి
ప పాలనా దక్షుండవు ధర్మాధర్మవిచక్షణుండవు నా యశీలు
డవు బరమశాంతమయుండవు నూత్మ్నగ్రహాణుండవు విగతవి
యుండవు శమితశాత్రవుండవు జండశాసనుండవు నగు నీకి
యాలోచనము ని సందేహము వొడముట నాకు మికి
లాశ్చర్యముగ నున్న-.

బల—(మంత్రినిజూచి) ఇదేమి?

మంత్రి—ఔను. తమరాజ్యము సురక్షితమైనదౌటచే మీ విచార మనవసరమని వారి యభిప్రాయము.

బల—(సాక్షేపముగ) నీకు నదియే పిచ్చియా?

ఉ॥ ఎట్టి నరుండుగాని భువి • నెంతయు నేనుదలంచినట్టి యా
కట్టడికార భాగములఁ • గ్రాలకయుండునె యెందుఁజూచినన్
బుట్టినదా_ యైహికపు • భోగములందుట కెట్టివాఁడుఁ దా
నెట్టి యఘంబుఁ గార్యముల • నేనియు, జేయుచునుండు నెప్పుడున్॥

భటు— (ప్రవేశించి) మహాప్రభూ! ద్వారమునందు యువరాజుగారు వేచియున్నారు.

బల—(భటునిజూచి) శీఘ్రముగ లోనఁ బ్రవేశపెట్టుము.

భటు—చిత్తము. (నిష్క్రమించి మానపాలానందులతోఁ బ్రవేశించును)

మాన—(బలపాలునిజూచి తండ్రీ! వందనము.

బల—(ఆనందునిజూచి సుస్మితముగ) ఓహో! ఆనందా! నీవుగూడ మంచి సమయమునకేవచ్చితివిసుమా! (మానపాలునిజూచి) కుమారా! మీరిర్వు రాయాసనములపై నుపవిష్టులుగండు.

మాన, ఆనం—(ఉపవిష్టులగుదురు.)

బల—శాస్త్రిగారూ! నాకీప్రపంచమున నందరిలోను మిక్కిలిగా నచ్చినవాఁ డీ యానందుఁ డొక్కఁడు.

ఉ॥ బాలుఁడెయయ్యు సర్వవిధ • పాండితినొప్పుచునుండు భూసురుం
డై లలిఁజెందు నీఘనుఁడు • నంతియెకాని యొకప్పుడైనఁ దా
నేలలిదుష్టులన్ గనుల • నేనియుఁ గాంచఁడు సర్వకాల భూ
పాల సుధీప్రజాలహిత • భావిత సంచరణంబె చేసెడున్॥

ఆనం—(లేచి మహాప్రభూ! ఒక్కమనవి.

బల—ఏమది?

ఆనం—

ఉ॥ ఏలలి దుష్టులన్ గనుల • నేనియుఁగాంచఁడు సర్వకాల భూ
పాలసుధీప్రజాలహిత • భావితసంచరణంబె చేసెడం
చీలలినన్నిటన్ పొగడు • టెంతయుఁగూడదు నిక్కమెంచ భూ
పాలసుధీ ప్రజాలహిత • భావితసంచరణంబు గూడునే

బల—(ఆశ్చర్యముగ కూడదా? యేమి?

ఆనం—కూడదు.

బల—ఎందుచే?

ఆనం—

ఉ॥ చాలుగ రాజ్యపాలనము • సంగతినొప్పెడు దుష్టశిష్టభే
దాల నెఱుంగలేక నృప • ధాములు నాగమశాస్త్రమర్మ ధ
ర్మాల నెఱుంగలేక యభి • మానపురస్కృ యనొందు యిక్కలిన్
జేలతనాన వీఁగుచును • స్వేచ్ఛగనొప్పెడిఁ బండితాహ్వయుల్॥

బల—(శాస్త్రినిజూచి) ఏమిశాస్త్రిగారూ? ఈ యానందుని నుడువులందు మీయభిప్రాయమేమి?

శాస్త్రి—(బలపాలునితో) ఏమోలెండు! పిల్లతనముగనుక మనము వాని క్షమించవలెను.

ఆనం—శాస్త్రిగారూ! ఏమితపాపనర్చితినని మీచే నేనుక్షమింపబడవలె?

శాస్త్రి—(ఆనందుతో) నాయనా!

గీ॥ దుష్టశిష్టభేద మెఱుంగు • దొడ్డప్రభులు
నఖిలధర్మంబెఱుఁగు పండి • తాహ్వయులును
బుడమినెందున లేనట్లె • నుడివితీవు
సభలనెప్పుడు నిట్లాఁడ • జనదువత్స!

ఆనం—శాస్త్రిగారూ! మీరుసైతమట్లు వాక్రుచ్చుచో నేఁజేయున దేమి? నాతత్వమేమో మీకుబాగుగాఁ దెలియదు.

చం॥ ధనమును దేహదా ... మును • ధాత్రియుఁ గావ్యపరిశ్రమాదులున్
ఘనమగు నింద్రభోగమును • గల్గినమాత్రనె సౌ ఖ్యంబె? స
న్మననమునను ముక్తిమార్గమెదొ • మానగు దాని గ్రహింపలేని యా
మనుజుని జన్మమేల! యభి • మానము భోగమునేల? తాల్పనే ?

బల—(మందస్మితానందమున) బలే యానందా!

ఉ॥ ఎయ్యది నామనోగతిని • యెప్పుడుఁ దర్కముఁ జేయుచుండునో
యయది నీవనోగతిని • యట్లె చిటుక్కున శ్రావ్యపద్ధతిన్
జయ్యన బైట వెడలిం • సంతసమేయయెఁ గాని నీవు నా
కయ్యనఁ దవ్విధంబెటుల • నొప్పునొ నొప్పుగఁ జెప్పుమెప్పుడే?

ఆనం——బలపాలమహారాజేంద్రా! ఇదొక పెద్దసమస్యయా? "సర్వసంగ వర్జితంబగు నిశ్చలచిత్తంబునకనుండుట" అనునదే అదిగాక ముక్తికి వేరొండు భావములేదు. తన్మహిమఁ దొల్లిఁ జెప్పెద వినుండు.

గీ॥ సర్వరూప సర్వాధార • సర్వ విషయ
సంగసర్వనిస్సంగ స • ర్వాంగమహాచు
నామరూప రాహిత్యమై • సర్వవిధిని
యొలిఁ జెల్వొందు ముక్తి కాం• తాలలామ॥

అట్టిముక్తినొందు విధానమేమన! అనిత్యమగు దారాసుతాది బంధువర్గముతోను, అజ్ఞానాపాదితమగుఁ గామాద్యరిషడ్వర్గంబులతోను, హేయమగు నానామూత్ర శుక్లరుధిర ప్రథితంబగు దేహంబులోను, అపారంబగు సంసార పారావారంబునంబడి కొట్టుకొనుచుండు నీజీవుండు ముక్తిసోపాన మధిరోహింప నగు మార్గ మానర సంగవర్జితంబగు నిశ్చలచిత్తంబుగాక మఱొండు లేదు. చూడుడు

సీ॥ ఏదికల్గినదైన • వేదోక్తకర్మలఁ
బాములేములకోర్చి • వడయఁగలమొ?
యేదిక నదైన • యే దేవుభక్తితో,
స్మరియించి యాదేవు • నరయఁగలమొ?
యేదికల్గినదైన • యిహాపర వస్తుభే
దములెల్ల గ్రహియించి • తనరఁగలమొ?
యేదికల్గినదైన • యిచ్ఛచే సకల కా
ర్యములందు నిపుణత్వ • మందఁగలమొ?
గీ॥ యటి సర్వసాధక దివ్య మ • హాద్భుతా
శక్తి కలదైన మానస • శక్తినెల్ల
సర్వసంగవర్జిత మెపుడు • సలుపగలమొ?
యప్డె యోమహాప్రభు! ముక్తి • నందగలము॥

అంతియేకాని, యెవఁడైనను

ఉ॥ మానస శుద్ధిలేక పలు • మారులు జన్నము లాచరించినన్
వేసకువేలు తీ ముల • వేకువఁ దప్పకమున్గియుంసినన్

దానములెన్ని చేసినను • స్థైర్యత వేదపురాణశాస్త్రసం
ధాన విధాన కృత్యుఁడయి • నఁ ముగితబ్బదు దవ్వోయగా నిఁకఁ ॥
బల—(మొగము చిట్లించి) అట్టివానికి ముక్తింకనుదవ్వే యగునా ?
ఆనం—ఔను. ఇట్టి వన్నియుఁ గర్మకాండమున చేరును. ఆకర్మఫలాంశ
ము వేరు.
గీ॥ కర్మయనఁగ దుష్కర్మ స • త్కర్మమనుచు
ద్వివిధమైయొప్పు నదివానఁ • బెక్కు సులభ
సాధ్యమాచు దుష్కర్మక • ష్టంబు నొసఁగుఁ
గష్ట లభ్యమై యిడును స • త్కర్మసుఖము.
ఒక్కకర మేమేమి ? భక్తితత్వము నింతియే-
ఆ. ర్మభక్తి కృతులఁ • గడ తేరఁ జెప్పెండు
వాని ఫలములందు • వడయఁగాని
ధనము నిల్వసేయఁ • దలఁచు వాఁడు నిబద్ధ
దానకంకణమునఁ • దనరునట్లు.
ఇంతకును వేయు నేల ?
ఆ॥ దేనఁగాని నరుఁడు • రచిత్తమొందకే
సఫలతొందలేఁడు • గతినెపుడు
నట్టి సు రహ్యాది • నతుల నితా నంద
మైన ముక్తిఁజేర్చు • నతఁడె జ్ఞాని.
బల—ఆనందా ! నీవునుడువుచున్నదంతయు వాస్తవమే యగుఁగాక.
గీ॥ చిత్తమెపుడు ని లతను • జేరియుండు
ఎప్పుడే దేనియో దాని • నెంచుచుండి
సర్వసంగమై తికమక • సలుపుఁగాక
మహిని యదిచలింపకనుండు • మా మున్నె ?
ఆనం—(కొంచెమాలోచన నభినయించి) దిమాత్రమొక పెద్దస
స్యయే. ఐనను దీనికి నొకమార్గమున్నది.
బల—అదేమి ?
ఆనం—శ్రద్ధగా వినుఁడు.

మ॥ రథసారథ్యము జేయు సారథివలెన్ • రాణించుఁ జిత్తంబు నూ ?
రథ మీ దేహము నింద్రియాదులరయన్ • రథ ంబులో నంత నా
పృథు మోక్షాహ్వయ దేశమేగుటకు నీ • విజ్ఞా మార్గంబునం
దధిరోహించి గ్రహింపనౌ రిపు సమూ • హంబెల్ల రజ్జుక్రియన్.

బల—(కొంచెమాలోచించి మహాసంతోషమున) బలే! యానందా! నిజముగా నానందాను సంధాయకుండగుఁ బరమార్థవేదియున నీకేగాక మఱొకరికి చెల్లునా? నీహేతు వాద భూయిష్ఠమగు మార్గమే ముఖ్యమగు ముక్తిమార్గమనుట నిస్సందిగ్ధము. ఆనందా! నాకుమిక్కిలి సంతసము గల్గుచున్నది. సంతసమైనది. ఇదే నానమస్కారము గొనుము. (అనుచు లేఁచి నమస్కరించును)

ఆనం—శుద్ధని లచిత్తోభవ! (అనుచుఁ జేతులెత్తి దీవించును,)

బల—(లేఁచి) నిజముగా నాకుగావలసిన దేమి? ఐహిక సుఖానుసంధాన గార్యంబులన్నింటి నాచరించితి, తత్ఫలంబునంతయు ననుభవించితి, కొమరుండన్ననో రాజ్యపదవి కర్హుఁడై యొప్పుచుండె. ఇఁక నీతుచ్ఛమగు రాజ్యభరంబు నేవహింపనేల? (మానపాలునిజూఁచి) కుమారా!

ఉ॥ చేసితి నెన్నొజన్నములఁ • జేర్చితి నీతిఁ బ్రజావళిన్ గడున్
భాసురలీలఁ బ్రోఁచితిని • పావనమూర్తుల, జారచోరులన్
గాసిలఁజేసితిన్ రిపుల • గర్వమడంచితి లోకమంతటన్
నాసరియేరు లేనటుల • నావలె నీవిఁక రాజ్యమేలుమా!

నాయనా! నాముద్దుకుమారా! నీవును సమస్త ధర్మాధర్మముల నెఱింగినవాఁడవే, నేఁజెప్పఁదగిన విశేషాంశమేమియు లేదు. ఐనను నాకడసారివలు కొక్కటి యాలకింపుము.

ఉ॥ ప్రోచుము సర్వపౌరులను • బొల్పుగ బిడ్డలువోలె నెప్పుడున్
గాచుము పేదసాదులను • గంటికిఱెప్పయువోలె నింకసం
కోచమువీడి దీనిగను? • గొప్పగు రత్నకిరీటమిద్దిచేఁ
జాచుము దీనినీకిడెదఁ • జాచుము జాగొనరించనేటికిన్॥

మాన—(లేఁచి) తండ్రీ! నాదొక చిన్నమనవి,

శా॥ మాయామేయజగంబు మిథ్యయనిసం • భావించి సంసారమ
గ్న్యాయుస్తంబగునట్లు మానసముఁ జే • యంబోక నిస్సంగతన్
ధే యంబా పరమాత్మరూపుఁగనని • ర్దేశించి కామాదులన్
యాత్మక్రియచే జయింతు జనకా • భద్రప్రముక్తిన్ గనన్.
(మహావినయముగ) తండ్రీ !
మ॥ రమే! సంసృతి భోగభాగ్యములు ని • ! రాజ్యము స్సర్వముల్
రమే ? యెప్పుడో యుద్బుదంబువలె నా • శీమాంతమై పోవు నీ
రమాసహ్యాకరంబునైన తనువుల్ • బాటింపఁగానౌనె ! సు
స్థిరమై శాశ్వతసౌఖ్యదాయియగు ము • క్తింజెంద కేవాఁడునున్॥
ఏమితండ్రీ ? వేయేల ?
శా॥ ఈరాజ్యంపుఁ బదంబు నాకిఁకెఁ గదున్ • హేయంబయెన్ గానమీ
రీరాజ్యంబును నేరికైన నొసఁగుం • డీ ! యడ్డురానెప్పుడున్
స్వారాజ్యంబె ! యిదెట్టు లన్యుకిడుదున్ • భావ్యంబు కాదందురా !
మీరేయేలుకొనుండు ? నేనిదియె సం • ప్రీతి న్నటోపోయెదన్.
(అనుచు (నిష్క్రమించును.)

బల—(సభికులను గలయఁజూచుచు)
ఉ॥ చూచితిరా మదీయసుతుఁ • జోద్యపుఁ బ్రక్రియ ? నేనుమాత్రముల్
వాఁచితినేమి తుచ్ఛముగు • బాలనసేయఁగ ? మీరలిప్పుడే
తోఁచిన భంగినెవ్వరినొ • దొడ్డ ప్రభున్నియమించుకొన్డు నే
వేచినదెల్ల దీనికిదొ • వేయని కేటికి ? నేనుఁ బోయెదన్॥
అనుచు (నిష్క్రమించును.)
మంత్రి—(ఆ| ముగలేచి విభ్రాంతుఁడై దిక్కులు పరికించుచు నానందుని
జూచి పండ్లు పటపటలాడఁగ)
శా॥ ఔరా ? యేమివిచిత్ర నాటకమయెన్ • యానంద! నీనుంచి ? యే
పీరాగ్రేసరుఁ జేతకానిపని నీ • వేదాంతపుంబిచ్చి చే
నౌరా ! యెంతటి సర్వనాశమమరెన్ • హా ! యెంతకష్టంబు ! నీ
కేరున్ నీ తనష్ట బోధవినన్నై • యెచ్చోటఁ గన్పింపరో ?
ఆనం—అమా శేఖరా ! కొంచెము శాంతివహింపుము.

గీ॥ ఏడా ప్రస్తావవశమున • నిట్లు జరిగె
దీనికై కారణంబు నేఁ • గానుకాను
వారినుదుట నట్టుల బ్రహ్మ • వ్రాలు వ్రాసె
బ్రహ్మవ్రాలుఁ దప్పింప నె • వ్వారితరము ?

ఉ॥ ఐనఁ బ్రసూతియందుఁగల • యాపెవిరాగము బోధనాదులం
దై నమనోవిరక్తి తన • కైన యొకానొక యాత్మబంధు తాఁ
బ్రాణము వీడుచో నతని • మట్టిని జేసెడు పూర్వమందుః దా
నూనెడు దుఃఖముఁగన్ బిదప • నొందెడు తత్త్వము సు రంబయో ?

మంత్రి—ఇప్పటివారి పరిస్థితిని జూడఁగా సు రమని యే తోఁచుచున్నది.

ఆనం—మంత్రివ - ! సమస్తానుభవవేత్తలగు మహారాజుగారి విషయము మాత్రము జెప్పలేనుగాని

ఉ॥ కాయమునందు దట్టమగుఁ • గండలుఁ జిక్కని చీము నెత్తురుల్
పాయక శత్రువర్గమునఁ • బాల్పడి యౌవనరాజ్యభద్రుఁడౌ
నీ యువరాజుమాత్రమిఁక • నేను పదంపడి సంస్మృతేచ్ఛగాఁ
జేయఁగలాఁడ నమ్ముమిఁకఁ • జేరుచునుంటిని వానినిప్పుడే॥

(అనుచు నిష్క్రమించును.)

మంత్రి—(నిట్టూర్పునిగుడ్చుచు జనాంతికముగ) ఔరా! ఈరోజు నీసభాలి నెంతవిచిత్రనాటకము గాంచనయ్యె?

(నేపథ్యంబున ఘంటానాదము ధ్వనించును.)

(ఆలకించి) అదుగో! గంటయైనది. సభ్యులారా! మనమిఁక సెలవు గైకొనవచ్చును. అయ్యో? యెంత వెఱ్ఱివాఁడను! మన మిప్పు డెవరియొద్ద సెలవుగైకొనవలెను? నేనిఁక దీనికై చింతింపరాదు. ఏగడియ నేదికానున్నదో నిజముగా నాగడియ నది గాకమానదు. (శాస్త్రితో) స్వామీ! ఇఁకనెందుకులెండు! మనమందర మును లేచి వెళ్లుదమురండు. ఎవ్వరికిలేని విచారము మన కేల? మనకుమాత్ర మీ భోగములు శాశ్వతమా? ఈరాజ్యమెట్లైన నేమి? ఈరాజ్య పదమెట్లైననేమి? మన కేమి? మజల యున

రాజు రాజ్యేచ్ఛుఁడై పట్టాభిషిక్తుఁడయ్యెనా మనవనిలో మన ముందుము. లేనిచో వారిమార్గమే మనమాము. రండు.

(అనుచు నిష్క్రమించును.)

శాస్త్రి—(లేఁచి) అబ్బా! ఈకాలపుఁ బిల్లలు పిల్లలుకాదు. చిచ్చుల పిడుగులు.

(అనుచు నిష్క్రమించును.)

(అంతలో నవనికజారగా వెలుపల)

ఆనం—(ప్రవేశించి) నేనింతలో నింతదూరము వచ్చెనని దలంచలేదు. (ప్రక్కకుమఱలి) ఎవరచ్చట?

భటు—(ప్రవేశించి) దేనికానందయ్యగారూ?

ఆనం—మనయువరాజిప్పు డెచ్చటనున్నాఁడు?

భటు—దేనిక్లో యొంటిగా సశ్వారూఢుడై నగరబాహ్యారామముపై పున కువెళ్లెను. అదిమాత్రముచూచితిని అంతేగాని యిపుడెచటనుండు నో తెలియదు.

ఆనం—ఇఁకచాలును. (తనలో) ఈతఁడు తనమనోవిరామమునకై యచ్చ టకు చేరియుండును. మంచిది నేనును శీఘ్రము నచ్చట చేరెదఁగాఁక!

(అనుచు నిష్క్రమించును)

(అవనికలేవఁగా నగర బాహ్యారామము)

(మదనమాల ధనురాణధారిణియై కమృగేంద్రమును దరుము కొనివచ్చుచుండును. అంతలో నేపథ్యంబునఁ దండ్రియగు విజయ దత్తుఁడు)

"అమ్మాయీ గుఱితప్పినచో నా కూర మృగేంద్రము పై బడును. సమీపములోనున్నది. జాగ్రతగా బాణమువిడువుము."

మదనమాలిని—(బాణమువిడచి గిరుక్కున వెనుకకు మరలును

విజయ—(అత్యాతురముగఁ బ్రవేశించుచు ఏమమ్మా గిరుక్కున వెన కకు మఱలుచుంటివి యది గుఱితప్పి పైఁబడ నున్నదా యేమి

మదనమాలిని—(చిరునగవున) లేదు నాన్నా! అదొకబాణముననే నేలఁ గూలినది.

విజయ—మఱి దేనికి భయము నభినయించితివి?

మదనమాలిని—భయముగాదు, ఎవఁడో యొక మనుజుఁ డీప్రాంతమున కళ్వారూఢుఁడై వచ్చుచున్నట్లు పొడకట్టినది.

విజయ—ఓహో! అటులయిన వెనుకకు మఱలుదమా?

మదనమాలిని—కొంచెము సేదఁదీర్చుకొని వెళ్ళిన బాగుండునని తోఁచుచున్నది, (దిక్కులు పరికించుచు) ఆహా! ఈవనమెంత రామణీయకమున నున్నది? నాన్నా! ఈవనమెవ్వరిదో తెలియునా?

విజయ—(బుజ్జగించుచు) అమ్మా! తెలియునుగాని చెప్పినచో సిగ్గుపడెదవేమోయని సంశయించుచున్నాను.

మదనమాలిని—నాన్నా! సిగ్గుపడునంతటి కారణము గలవారిదా యీవనము?

విజయ—ఔనమ్మా!

గీ॥ ఏనినుతు నోచితినిగాంచి • యేను హృదిని
సంతసించి నిన్నిడఁగ, ని • శ్చయుఁడనైతి
నట్టి బలపాల రాసుతుం • డైన మాన
పాలు నేకాంత బహిరంగ • వనము పుత్రి!

మదనమాలిని—(బెదఱున దిక్కులు పరికించుచుండును

చెలి—(ఆత్రముగఁ బ్రవేశించి) మహాప్రభూ! ఈవన మీావను మానవగరాధినేతయగు బలపాలమహారాజుగారి కుమారుఁడగు మానపాల యువరాజుగారి యేకాంత నగర బాహ్యారామమట.

విజయ—ఔను. ఐననేమి?

చెలి—ఆ యువరాజుగా రిప్పుడీవనమున నేకాంతమునకై వచ్చుచుండిరట.

విజయ—(మొగము చిట్లించి) ఇప్పుడేమి యేకాంతము?

చెలి—ఏమో? ఇప్పుడిచటెవ్వరు నుండరాదని భటుఁడొకఁడు కేకలు వేయుచున్నాఁడు.

మదనమాలిని—(చెలినిజూచి) చెలీ! వేసిన వేయనిమ్ము. విషయము విషమించినచో యుద్ధమునకు సైతము సన్నిద్ధులమేగదా! భయపడెదవేమి?

విజయ—(వారించి) అమ్మా! చిన్నదానవు నీకేమియుఁదెలియదు. కొంచెమూరకుండుము. (చెలితో) మదనవతియేది?

చెలి—ఆమెయు వచ్చుచున్నది కాని మనమేదో మృగయావినోదాము బయలుదేరిన మనసౌధచందనపురమెచ్చట! ఈవసుమానగరమెచ్చట! ఈపాదుసింహాము మనలనిచ్చట కెందుకీడ్చెనదో తెలియకున్నది. అమా! నీకేమియు నిది కించగా లేదా?

మదనమాలిని—నీకంటెను మిక్కిలి నే యున్నది.

విజయ—దేనికమ్మా మీకీచింత.

మదనమాలిని—నాన్నా! సర్వజ్ఞుడవయ్యు దేనికందువేమి?

గీ॥ ఎంతో పుత్రికావాత్సల్య • మెసఁగి యుంట
మీరలిట్లు మమ్ముఁ వెంటఁ • బెట్టుకొనుచు
వచ్చితిరకాని తగునొకో • వధువులిట్లు
వచ్చుచో నప్రతిష్ట పా • ల్పడఁగవలదె.

విజయ—ఇదియా నీసందేహము? కుమారీ!

ఉ॥ స్త్రీయెపుడైన నెచ్చటను • స్వేచ్ఛగ వర్తిలఁ దొప్పదైన శా
స్త్రీయము లౌక్యముల్ గనఁగ • నిట్టులఁ జిన్నటనాటఁగన్నలన్
బాయక పెద్దయైనపుడు • భర్తను, వృద్ధతనంబు వచ్చుచో
స్వీయసుతాది దాసులను • జేరి చరించుట ముఖ్యధర్మమౌ॥

అమ్మా! అందుచే మీకా సంశయ మనవసరము. (ముందునకు దృష్టినిగుడ్చి) అదుగో! యెవరో వచ్చుచున్నట్లలికిడి యగుచున్నది. మీరావొదలచాటునుండు వేదికలపై మేల్మొసుంగులతో శయనించి సేదఁదీర్చుకొనుచుండుఁడు. పొండు.

మదనమాలిని—చిత్తము. (అనుచుఁ బోఁబోఁగా)

విజయ—ఇదుగో మదనవతిని సైతముఁ గలుపుకొని మీముప్వురు నొకచోనుండుఁడు.

మదనమాలిని—చిత్తము. (చెలినిజూచి) రావే, (అనుచు నిష్క్రమింతురు).

విజయ—(తనలో) నిజముగా నాకుమారికలగు నీమదనమాలినీ మదనవతులను సకలవిద్యాపారంగతలనుచేయు నుద్దేశముతో నిట్లు

వెంటఁబెట్టుకొని పైనమైతిఁగాని యిట్లుజరుగు ననుకొనలేదు. కానిమ్ము. ఆవచ్చువాఁడే మానపాలుఁడేమో యెదురేఁగి వాని తో ముచ్చటించెదఁగాక (నాలుగడుగులువైఁచి) ఛీఛీ! నాకై నేను పలుకరించు నోఁ బలుచదనముగాదా, నేనా వేదికపై నేమెఱుంగన ట్లుపవిష్టుండ నయ్యెదగాక, అనుచు నచట నొక వేదికపై నుపవిష్టుఁడగును)

మాన—(ప్రవేశించుచు)

ఉ॥ అమ్మకచెల్ల! యెవ్వతెయొ • యాఁడుది యొక్క-శరంబుచే గం
దము ను వెంటనంటెట ధ • రణ బడ వైచె భళీ! యదెవ్వతె
మ్మ యదేది యిప్డిచటఁ • జోద్యతనంత నద శ మయోఁ జి
త్రమ్మగు దానిసౌరు నహ • దానివిలాస విహా ..మిరా

ఔరా! అదియొక బాలికామణివలె నున్నది. కానిమ్ము? అదే మణియైన విరాగునకు నాకేమిపని? ఛీ! ఇఁకనే దానిమఱువవలెను. (కనులు మూసుకొని) ఎట్లు మఱవఁగలి? అది, అదృశ్యమగుచు నన్నొక చూఁపుచూచినది. ఆచూపు నాకొక తూపువై బాధించుచున్నది. చిత్తమా! ఏమినీకీమతి విభ్రమము! నిశ్చంసంధాన విధానముననుండ నియమించిన నీ వీభంగినుండఁదగునా? జాగ్రత్త!

ఉ. జాలరిచూపుచున్న యెఱ • చాన్పన లోకమునందు భామినీ
జాల మనేకచర్యలుగ • జాతురి మీరఁగఁ జూచునంతనే
బేలవునాచు మీనగతి • బేలుపుఁజానలఁగోరుదేని నీ
వాలయమై చెంగఁగల • నెప్పుడె చింతలకెల్లఁ జిత్తమా!

చిత్తమా! ఇంకనైనను జ్ఞానదృష్టిని రమించుచుండుము. నీయేకాంత ...ఱమునకు సావధానముగా నీమానపాలుని చేర్చుకొనుము. (అనుచు వేదివైపునకు మఱలి విజయవత్తునిఁజూచి తనలో) ఓహో! ఈతఁడెవ్వరు? చూడఁజూడ నితఁడొక పరిచయ పురుషుండనియే స్ఫురించుచున్నది. నాజనకుని ప్రాణసముండగు సౌధనందన పురాధిపుండగు విజయవత్త మహారాజుగారు కారుగదా? అవచ్చువారెవరు! ఓహో! నా ప్రాణసమానుండగు నానందుఁడా? మంచిది. మంచిసమయమున కే

నన్ను వెదకుకొనుచు వచ్చుచున్నాఁడు. (ప్రకాశముగా)మిత్రమా! ఇటిటు. ఇటురమ్ము.

ఆనం—(ప్రవేశించుచు) ఇదుగో వచ్చుచున్నాను. (ప్రవేశించి విజయదత్తునిజూచి) ఓహో! యీ విజయదత్త మహారాజుగారిచ్చట కెప్పుడు దయచేసిరి!

మాన—(ఆశ్చర్యముగ) ఏమీ! వీరు విజయదత్త మహారాజుగారేనా!

ఆనం—ఇఁకసరె బాగున్నది. వీరినింకను విచారించను సైతము లేదన్న మాట..

మాన—వారేనా మహాశోకరాయని సందేహించుచుంటిని.

ఆనం—ఐనను గాకున్నను మననగరముజొచ్చిన మహాప్రభువులకుఁ దగిన గౌరవ సత్కారముఁ జేయవలదా?

మాన—ఒక మహాప్రభువులకేయేమి? ఎట్టివారికిని మననగరము మన ప్రదేశముఁ జొచ్చినపుడు తగిన సత్కారము గావింపవలసినదే ధి. ఐనను ఏకాంత లాన్వేషణ చింతితమగు నాచిత్తమిపుడు దేని యందును బొలువోవుట లేదు.

ఆనం—ఇప్పుడు నీకేకాంతము దేనికి?

మాన—ముముక్షు విచారము నకు.

ఆనం—ముముక్షుమనగా నేమి?

మాన—నీకు తెలియదా?

ఆనం—తెలిసినను నిన్ను కొన్ని విషయములు ప్రశ్నింపఁదలచితిని.

మాన—అట్లయినసరె. ప్రశ్నింపుము.

ఆనం—ముముక్షుమనఁగా నేమి?

మాన—సర్వసంగ పరిత్యాగము.

ఆనం—అదెట్లు సంభవము?

మాన—ఈయైహిక మంతయు హేయమగుచో.

ఆనం—ఆహేయ మెట్లు జనించును?

మాన—అనుభవముచే

ఆనం—అదెట్లుకల్గు?

మాన—(మిన్నకుండును)

ఆనం — చెప్పవేమి ?

మాన — నీటోటి యనుభవవేత్తల బోధనాపద్ధతిచే

ఆనం — అదిగాదు.

చం. జగతిసముద్గతిం దెలుఁగు • జన్మముఁగల్గు నరుండు బూటకం
బుగ నెవ్వమి చెపినను • బొల్పుగ నిక్కమమంచు నెంచఁగాఁ
దగునె వ ంపు ? (అనుచు మానపాలుని జూచును)

మాన — ఐనచో నీవింతకుమున్న చెప్పినదంతయు బూటకమేనా ?

ఆనం — బూటకమొ ? • తథ్యమొ నెమ్మదిమీద సర్వముం
దగిలినయప్పుడే తెలియుఁ • దథ్యము స్వానుభవంబునప్పుడో.

మాన — (విసుగుగ) అబ్బా! మఱల సర్వముందగులుమని చెప్పెదవేమి?

ఆనం — ఔను

చం॥ మనుజుఁడుతప్పక న్ సకల • మార్గములందుఁ జరించుచున్న నే
కనఁదగు సర్వసారమును • గాని తదేతరపక్కిఁ ద్రొక్కితాఁ
బనివడియొక్కచోటయతి • మాంద్యతఁ గూరుచునున్న లాభమే
మనసు దృఢంబునెట్లగును? • మానుగనన్నిటి హేయమబ్బక న్.

మాన — ఆనందా! ఐహికమంతయు హేయమనునది నిక్కమేకఁదా ?

ఆనం — ఏమో ?

మాన — మఱి నీవే చెప్పుచుంటివిగఁదా ?

ఆనం — ఔనది లోకవాడుక.

మాన — లోకవాడుకే యాఁగాక. అదినిజమా ! అనృతమా ?

ఆనం — దానిఁ దెలుసుకొంటకే స్వానుభవముగావలె.

మాన — అబ్బ ! ఇంకెక్కడి స్వానుభవము. ఆలోకవాడుక స్వానుభవమున బుట్టినదికాఁదా ?

ఆనం — ఇంక నేను నీకు సమాధానముఁ జెప్పలేను.

మాన — ఇంతకు నీనిశ్చయాభిప్రాయమేమి ?

ఆనం — నా యభిప్రాయానుసారముగా నడచెదవా ?

మాన — యుక్తమనితోఁచిన.

ఆనం — నాయభిప్రాయ మెప్పుడు నయుక్తముగ నుండదనియే నా నమ్మకము.

మాన — ఐనచో నీయభిప్రాయ మేమో వెలిబుచ్చుము.

ఆనం — శ్రద్ధగావినుము. ఇఁకనీవు గృహస్థుడవై గార్హస్థ్యధర్మ మవల
బించి నీరాజ్యమును నీవు పాలించుకొనుచుండుము. నీకదే యా
నందముగనుండెనా దాని యవలంబింపుము. లేక హేయమై
యాందోళనము జనించెనా ఆముక్తికాంత తనకై తానే నిను
వరింపఁగలదు. అంతేగాని (విజయదత్తునిజూచి) మహారాజా! చిం
తైనఁజెప్పుఁడు. ఇంతవరకు వీని కేయనుభవమును లేదు. శుక్లశో
ణితములు నిండుగ దేహమంతయు వ్యాపించి చిక్కపడి నిరాటం
ముగఁ గామక్రోధాదులు విహరించుట కాస్పదమై చెలరే
చున్న యీ యౌవనదశయందు నీతనిహృదయమున కెట్టుని
లుముగల్గు? ఎవడు ప్రయత్నించినను వీనిహృదయమున కానిశ్చ
లము లభ్యమగునా? ఒక్క కోమలాంగి మృదుకరస్పర్శమాత్ర
మునే శరీరమును బులకాంకితమొనర్చు యౌవనముగల వీనిహృ
దయమునకు, ఒక్క వాల్గంటి వీక్షణమునే జలదరించు స్వభా
వమగు యౌవనముగల వీనిహృదయమునకు ముముక్షా వ
నిశ్చలమే లభ్యమగునా? ఏదెట్లున్నను, (మానపాలునిజూచి
మిత్రమా!

గీ॥ ధర్మపత్నింగ్రహించి సం • తతినివడసి
యజ్ఞయాగాది కృత్యంబు • లాచరించి
సర్వ ... ణముక్తుఁడై ముము • క్షుంబుఁగోరఁ
నగును; లేకున్న భ్రష్టుఁడౌం • దయిన నరుఁడు.

ఈవిషయమైనను జక్కఁ నాలోచించుము.

విజయ — (ఆనందునిజూచి) అయ్యా! అపరిట్టితర్కంబునకు హేతువేమి

ఆనం — నేటిసభయందుఁ బ్రస్తావవశంబున ముముక్షుప్రశంస వచ్చిన
అందుమీఁద వీరు తండ్రికుమారు లిర్వురు ని విరాగమా
మవలంబించిరి. ఆ బాల్యస్నేహబాధ్యతచే నే తనితో ని
పోరాడుచుంటిని. ఇదివిషయము.

విజయ — (తనలో) ఆహా! యీబాలకుండెవరో భూసురకుమారుండు
నున్నాఁడు. ఎంతసుజ్ఞాని!

ఆనం——(మానపాలునితో) మిత్రమా! ఇంకనేమియు నీకు పాలుపోలేదా? సందేహమేమైననుండిన బయల్పరచుము. నీసందేహము దైనను దీర్చుటకు సంసిద్ధుఁడనై యుంటి.

మాన——ఆనందా! నీవాక్యంబులన్నియు ననుభవయుక్తములగుటయేఁ గాక వేదశాస్త్రోక్తములు సైతమై యున్నవి. ఇంకనీవాక్యంబులం దేమియు సందేహములేదు.

ఆనం——అదుగో ఇంక దేననో సంశయమున్నట్లు సూచించుచున్నావు "అసంశయ మభ్యాపధ్యేత" అను నీగురువాక్యమును మఱచితివా?

చ॥ మనసున కెట్టిసంశయముఁ • బాల్పడనీయఁగఁ గూడదెన్నఁడుఁ
ఘనుఁగువారు దాచకను • గ్రక్కున నెప్పటికప్పుడే మహా
వినయముతోడనైన మఱి • వెంగలికృత్యతనైనవైదుషీ
జనములముందు దెల్పుఁచి • సంశయమెల్లను బాపుకోవలెఁ.

మాన——అందుననే నేఁజెప్పనుండఁగాఁదర్వరపడుచుంటిని. చెప్పెదవినుము.

గీ॥ చానఁకు చక్కఁదనమున్న • జదువుసున్న
చదువుగల్గిన సున్న యూ • చక్కఁదనము
చదువుఁ జక్కఁదనాదులు • సరిగనున్న
బుద్ధిచెడుబుద్ధి యీామూఁడుఁ • బొడముటరుదు.

ఆనం——నీకట్టి సంశయ మనవసరము.

క॥ చదువుఁ జక్కందనమును
సదమల హృదయంబుఁ గల్గు • చానలుధరలో
వెదకిననుండకపోదురె?
పదివేలకు నొక్కరైన • భాసిలుచుండుఁ.
అంతటవ్వ విచారించ దేనికి?

ఉ॥ కోమలమైనరూపమును • గోవిదశిక్షితమైన విద్యయుఁ
బ్రాముఁగనొప్పె డిన్మదన • మానినియంచును వీరిపు తికఁ
వేమఱులేరొ చెప్పవిని • పెంపగుసంతసమొందుచుండ—?
యీామహితాత్ముఁడొక్కఁడఁ ద • దీయసుతన్నిడఁ బెండిలయె దే?

విజయ—— (వారించి అయ్యో! ఇటుచూడుము.

ఉ॥ ఒక్కఁడవేమి నాహృదిని • యొప్పుగనెన్నొదినాలనుంచి పెఁ
మక్కువతోడ నామదన • మాలినిపీనికొసంగు నిశ్చయం
బెక్కుడుఁజేసుకొంటి నది • యెల్ల యు నిప్పుడు నీతనందుఁబెం
పెక్కువిరాగమున్ననఁగ • భేదమునొందఁగనుండె భూసురా!

ఆనం—రాజేంద్రా! అట్లనుడివెదవేమి?

గీ॥ రాగునకుగాక రమణి వి • రాగుకేల?
యనెడు భావంబు లోకమం • దమరుచున్న
బాల్యదశ విరాగంబెంతొ • ప్రౌఢదశను
రాగమంత సరాగమై • రమణఁగాంచు.

విజయ—(తనలో) ఆహా! యేమీ పీనిమృదుమధురాలాపములు? ఇంతకు నిట్టి స్నేహితలభ్యుండగు నీమానపాలుని యదృష్టము గణనీయము.

ఆనం—ఇఁక మీరట్టి సంశయమును వదలుఁడు. (మానపాలునితో) ఏమి మిత్రమా? దేనికిని ప్రత్యుత్తర మియ్యకుండుట పాడియా?

మాన—ఆనందా! ఒకవిషయమునుగూర్చి యోచించుచుంటి.

ఆనం—అదేమి?

మాన— ఉ॥ ఇంతకుమున్ను నాకిచట • నీ వనదేవతయోయనంగ న
త్యంతకహేళియల్ చెలంగ నవ • యావనశౌక్ర బాణపాణియై
యెంతొచమత్కృతొప్పఁగమృ • గేంద్రమునొ ట్టటఁగూ నన్నుప్రే
మాంతరదృష్టిఁజూచి కడు • నంత నదృశ్యతఁజెందెఁ జక్రధర్.

ఆనం—(ఆశ్చర్యముగ) అట్లనా? చిత్రముగనేయున్నది. కాని ఆవ్యక్తివరని యూహించితివి?

మాన—మృగయా వినోదాసక్తయై యావిధముగా నిటకా మృగేంద్రమును దరుముకొనివచ్చిన యొకరాకుమారియై .

ఆనం—ఐనచో నీవావ్యక్తిని ప్రేమించితివా?

మాన—నాహృదయమప్పటినుండియు నావ్యక్తినే ప్రేమించుచున్నది.

ఆనం—అట్లు ప్రేమింపఁబడిన వ్యక్తివరో తెలుసుకొనకనే విడిచితివేల?

మాన—విడువలేదు. ఆవ్యక్తిం నీవనమునందే యెచ్చటనో డాగియున్నట్లు నిశ్చయమగుచున్నది.

ఆనం—అట్లైన నొకసారి స్వయముగా వెదకుకొని రమ్ము.

మాన—అదియే యుత్తమమని తోఁచుచున్నది. వచ్చెద నుండుము. (అనుచుఁ పోఁబోఁగా)

విజయ—యువరాజా! ఒక్కమాట.

మాన— ఆగి విజయదత్తుని జూచును)

విజయ— పునిజముగ నావ్యక్తిని ప్రేమించితివా?

మాన—ఆవ్యక్తెవరో మీరెఱుంగుదురా?

విజయ—ఎఱుంగుదును.

మాన—ఎఱింగినచో ఆవ్యక్తెవరో చెప్పెదరా?

విజయ—నీవు నిజముగ నావ్యక్తిని ప్రేమించితివా?

మాన— ప్రేమించితిని.

విజయ— శ్చయముగ?

మాన—త్రికరణశుద్ధిగ.

విజయ—ఐనచో నావ్యక్తి నాకుమారికయే.

మాన—(ఆశ్చర్యమునఁ జూచుచుండును)

ఆనం—(విజయదత్తునితో) మీకుమారికారత్న మిట్లు రాఁగతంబేమి?

మాన—సకలవిద్యా పారంగతురాలను జేయుటకై వెంటఁబెట్టుకొని యరణ్యము కేగఁగా దైవసంకల్పమున మఱొక్క మృగేంద్రు మీ లమునకు చేర్చినది.

ఆనం—(తలో) శుభమగుఁగాక (ప్రకాశముగ ఐచో మీ కుమారికా రత్నమును మాయువరాజగు మానపాలరాసుతున కిచ్చుటలో నిస్సందేహులై యున్నారా?

విజయ—నాకుమారికా యభిప్రాయము స్వయముగా నడిగితెలుసుకొని గాని చెప్పఁజాలను.

ఆనం—మంచిది.

విజయ—ఇప్పుడే మఱలవచ్చెద నుండుఁడు. (అనుచులేఁచి వెనుకకుమఱలితనలో) ఓహో! మదనమాలిని యిచ్చటనే పొంచొని మా సంభాషణమంతయు వినుచున్నట్లున్నది. సరే! కానిమ్ము! (అను

చు మదనమాలిని సమీపమునకుచేరి) అమ్మాయీ! మదనవతి
యు నీచెలియు నెచట?

మదనమాలిని—(లోపల) అదిగో ఆవేదికపై నిద్రించుచున్నారు.

మదనవతి—చెలికత్తె (లోపల) మేమేమియు నిద్రించుటలేదు.

విజయ—మీరందఱు మాసంభాషణమంతయు వినుచునేయుంటిరిగదా

మదనవతి—చెలికత్తె—(లోపల) వినుచునే యున్నాము.

విజయ—మదనమాలినీ! నీవో!

ముప్వురునుగలసి—అందఱమును వినుచునేయున్నాము.

విజయ—మంచిది, మదనమాలినీ!

గీ॥ మానపాలుఁడు సహజంపుఁ • బద్ధతిగను
స్థైర్యధైర్య గాంభీర్య యు • దారసాహ
సుండటంచు లోకప్రతీ • తుండయిపుడు
తృణమునకు వేయుగుణములఁ • గ్రాలుచుండె॥

అందుచే తొలుత తొలుత నిన్నాతనికే యొసఁగ నిశ్చయిం
నీయెదుటను వారియెదుటను నాయభిప్రాయము వెలిఁబుచ్చినను ఇప్పు
మాత్రము నిన్నాతనికొసంగుటకు నామనసొప్పకున్నదినీయభిప్రాయమేమి!

మదనమాలిని—జనకా!

గీ॥ మనసుచే వాక్కుచేత నె • వ్వనికి జనక
దత్తమైతినో నే నిఁకా • తనికెయైతి
మగుడి వేరుగఁ బుత్రిక • భావమెనసి
దత్తమును జేయుటకు నీదు • పాత్రుఁగాను.

విజయ—(మదనవతీ చెలికత్తెలఁజూచి) సరే! మీయభిప్రాయమేమి?

మదనవతి—చెలికత్తె—(ఏకగ్రీవముగ) మాయభిప్రాయమేమైనను సకల
విద్యాపారంగతురాలును భర్తృదారికా రత్నమునగు మదన
మాలినీ యభిప్రాయమునకు భిన్నము గలుగనేరదు.

విజయ—ఓహో! మీరు ముప్వురీవిషయమున కృతనిశ్చయులయ్యే
యున్నారు. సరేకానిమ్ము (మానపాలానందులఁజేరి) ఇఁకమాకు
సెలవు.

మాన—ఆనం—ఏక(గ్రీవముగ) అదేమి! మీరు మాయాతిథ్యమును గొనిపొండు.

విజయ—ఇఁక వీలులేదు.

మాన—ఆనం—(ఏకగ్రీవముగ) ఎందుచే.

విజయ—కన్యా వరవరణములు నిశ్చయమైన తదుపరి పాణిగ్రహణము గానిదే వరునింటఁ గన్యజొ—ట లోకనింద్యము. మఱొకతావున నుంకుటకు ప్రభువగువానికి సరాజ్యమంతయు స్వగృహమే.

ఆనం—ఐనచో శీఘ్రముగ నిప్పుడే పాణిగ్రహణము గావింపుఁడు.

విజయ—అంతయూ తమేలని విధ్యుక్తమగు వేడుకలతో స్వగృహమున వైవాహిక యనోసర్చెదను.

ఆనం—నిశ్చయము సారముగా కార్యక్రమము జరుగుటకంటె డాంబికమగు వేడుకలయందు ఘనము లేదు.

విజయ—ఇదుగో! నీచెప్పువిషయములన్నియు శ్లాఘ్యములే కాని, కార్యక్రమముల వేడుకల నవసరమును నర్థమాత్రము నాకునచ్చదు.

ఆనం—రాజేంద్రా! అట్లనెదవేమి?

గీ. అదనునందున జరుఁగు కా • ర్యములకంటెఁ
బిదపఁజరుఁగు వేడుకల నే • మిదవుఫలము
వేడుకలకేమి యటుమీఁదఁ • జూడవచ్చుఁ,
జను "శుభేషుశీఘ్రంశుభ" • మను టెఱుఁగనకు.

విజయ—అట్లేకానిమ్ము. నేనును సాధ్యమగునంత శీఘ్రముగనే కార్యక్రమమునకు గడంగెద.

ఆనం—అట్లే కానగుఁగాని నేఁడే యీమానపాలుని మహీపాలపదమునకు పట్టాభిషిక్తుని జేయవలె. అందుచేతను దైవానుగ్రహమున నన్నియు సమకూడుటచేతను తొల్త నీ నూతనవధూపాణిగ్రహణముసైతము జరిగిన సమంజసముగ నుండునని నాయభిప్రాయము. మఱియు,

మ. కలనైనన్మదిఁదల్చనట్టి తలఁపుల్ • కార్యక్రమారూఢత్రఁ
జెలువై చొప్పడుకంటె నన్యమిల,ను • తిన్ క్రియారోపితా

త్యలఘుప్రాభవసత్యనిత్యపుటమం • దానంద సంధానసత్
ఫలసంధాయిక కార్యమున్న! చెపుమె • భృంగిక విచారించిన.

అట్లే, దైవసంఘటనమున మనకన్నియుం దలవని తలంపులే సా
కూరనున్నవి. అందుచే నావాక్యములను తప్పక గౌరవింపవలయు.

విజయ — మంచిది.

ఆనం — మీకీ నగరబాహ్యారామ సౌధమే, వసతిగానుండు. (మానపా
లునిజూచి) యువరాజా! నీయభిప్రాయమేమి ?

మాన — ఔను, (ప్రక్కకుమరలి) ఎవడురా అక్కడ.

భటు — (ప్రవేశించుచు) ప్రభూ! ఏమిసెలవు?

మాన — ఈయానందుండేమియానతిచ్చునో విని అట్లుచేయుము.

భటు — చిత్తము.

మాన — (ఆనందునిజూచి) మిత్రమా! ఇంకవీనికి భావికార్య క్రమమును
బోధింపుము .

ఆనం — అలాగే. (భటునితో) ఓరీ! నీవు శీఘ్రముగ నగరము ప్రవేశించి
మంత్రితో నేడేయువరాజుగారు,నూతన వధూపాణిగ్రహణమును,-
మహీపాలక పట్టాభిషేకమును వొందనిశ్చయించిరనియు, నందు
కై తగు యత్నములు సిద్ధము గావింపమనియుం జెప్పుచు నీవెను
వెంటనే యామంత్రిశేఖరుండిట కేతెంచుటకు యువరాజాజ్ఞ యని
తెల్పుము. పొమ్ము.

భటు — చిత్తము. (అనుచు నిష్క్రమించును)

మాన — రాజేంద్రా! ఇంక మన మాసౌధాగ్రమున కేగుదమురండు.
ఆనందా రమ్ము ! (అందఱును నిష్క్రమింప నుండఁగా
నవనికజారును) ఇది-ప్రథమాంకము.





# —సతీ శృంగారవతి—

## ద్వితీయాంకము



ప్రదేశము - ఉద్యానవనము.

(మదనమాలినియు, నోడినిండఁ బద్మముల నిడుకొని చెలియుఁ ప్రవేశము.)

మదనమాలిని—చెలీ!

ఉ. ఆసుమజాలమంతయు మ • హాచతురత్వముతో ముదంబుతో
భాసురలీల హారముల • వైళమకూర్చఁగ నిశ్చయించితిన్
బాసటగాను నీవుఁగడు • వైళమ యెట్టివియందఁ జేసెదో!
రాసవిలాసమెల్లఁ గ్రియ • లన్ గనఁ గావలె రమ్ము చూచెదన్.

(అనుచు నొక వేదికపై నాసీనయగును.)

చెలి—అట్లే కానిమ్ము. (అనుచుఁ దాను నాసీనయై) ఊఁ! ఇదుగో!

(అనుచు నో పద్మమిడును)

మదమాలిని—(ఆ పద్మసుమమందుకొని)

మ. చెలియా! చూడవె! యీసరోజసుమమే • చెల్వొందెనో? యోసినా
చెలియా! చూడవె ఘుఁఘుమంచు నెపుడున్ • జేతోముదంబిచ్చు నీ
జలజంబందలి వాసనెంతయొ! యివే • చాతుర్యమున్ జూపుచున్
లలిహారంబొనఁ గూర్చితే నిమదియే • లాగుండు నూహింపఁగన్?

చెలి—

మ. ఒడలే సర్వముఁ బారవశ్యతను బెం • పొందన్మదిన్ జూడనే
వడినుండంచుఁ దలంచితో సఖియ! నీ • ప్రాణేశుఁడెవ్వేళ ని

య్యెడ కేతెంచునో ! యిప్డె దీని మహిమం • బెల్లన్గనన్గల్గుచో
మెడఁగో నీవొకహారముంచుకొని యా • మీఁద న్బతిన్జేరుమా!

మదనమాలిని—(సిగ్గున బెదవిగొఱుకుకొనుచుఁ బెడమొగము బెట్టును)

చెలి—దేనికమ్మా సిగ్గుపడుచున్నావు?

మదనమాలిని—నాకు సత్వరముగాఁ బుష్పములందించుచుండుము.

చెలి—అలాగే ! ఇదుగో ! (అందించుచుండును.)

మదనమాలి—(హారముఁ గూర్చుచుండును.)

మాన—(ప్రవేశించుచు నాశ్చర్యముగ నలో)

శా. ఔరా యీవనమేల యింత చెలువై • యాశ్చర్యము నూర్చెడిన్
ఆరే ! నావనమిద్ది కాదో ? అదో! నా • దారా హంసంబు తా
నీరేజంబుల నాడుచున్నది కనన్ • నిక్కంబుగా నద్దియున్
యీరామంబును నాదె నిశ్చయముగా • నిట్లుండ నేహేతువో ?

(దిక్కులు పరికించుచు మదనమాలినిఁ జూచి సంతసముగ)

శా. ఓహో కారణమిద్దియా? భళి! యిదే • మోయంచు యోచించితిన్
ఆహా! యిప్పుడు బోధయయ్యెనిదియే • యారామమందుండునో!
ఆహా! అచ్చోటు సర్వము నిగులనూ • త్నాలంకృతంబైనయ
ట్లాహాహాయనిపించి హాయి డదే! • యాశ్చర్యమింకేటికిన్.

(మఱల మదనమాలినిఁ జూచి ఆహా ! యేమీదీనిసొరు! పట్టాభిషేకాది కార్యక్రమానువర్తినై బంధుమిత్రాదియావజ్జనంబుల సత్కరించి యెవరిని వాసంబులకు వారల నంపువరకు నిప్పటికి దాదాపు మాస పరిమితదినంబులు కావచ్చినను దీనిపాణిగ్రహణ మాచరించియు నీయొయ్యారియేకాంతపుటొయారమనుభవించునదను దు ట ప చుండె. కానిమ్ము.

గీ. ఈమదనమాలినీదేవి • యెట్టులిపుడు
హావభావవిలాసచే • ష్టాములొప్పి
యుండునో ! ముగ్ధయో! ప్రౌఢ • యో! మఱింక
దీనియేకాంతమేవిధిన్ • దేజరిలునో!

(ఆచాటున డాగిసావధానముగ నన్నియు నరసెదఁగాక. అను వ్రక్రమించును.)

మదనమాలిని—(మొగమున విచారభావమును సూచించుచుఁ బుష్పము
లు కూర్చుచుండును)

చెలి—(మదనమాలిని యాచరఁ బరిశీలించుచు) అమ్మా!

ఉ. నీకిటసర్వభంగులను • నెంత నోసుఖమబ్బుచుండఁ జీ
కాకునుగొ యొక్కడను • లెదు! కారణమేమి! నీమనో
లోకవిలాలాసకుఁడు • ఉపము నెందుననైనఁ గూర్చునో!
శోకమదానుచర్యతకు • లీలతొలంగునో చెప్పుమమ్మరో?

మదనమాలిని—(మిన్నక నక్లేయుండును)

చెలి—ఏమి! చెప్పవుకదూ? నీ విచారమెంతరహస్యమైనదైనను నాకుఁ
గాఁకయింకెరికి చెప్పకుందువు? నాకును జెప్పకున్నపోనీ. నీవు
విచారమునమాత్రము నుండకుము. ఇదియే నాప్రా న.

మదనమాలిని—ఓసి! పిచ్చిదానా! విచారము వచ్చినప్పుడు విచారిం
చకఁ దప్పునా?

గీ. కపటనాటక కవియైన • కమలభవుఁడు
స్వకజగన్నాటక గ్రంథ • భాగమందు
నెట్టిరస మెప్డుపోషించు • నట్టు నటక
జనులమామన మనుభవిం • చంగవలదె?

చెలి—ఔను కాని ఇట్టి విచారమునకు హేతువు దేనికై సంఘటించెనో
తెలియకనే యడుగుచుంటి. దేనికో చెప్పఁదగదా?

మదనమాలిని—మఱల దేనికందువేమి?

ఉ. ఎన్నివిధాల నాకిచట • నెంతగనో సుఖ మబ్బుచుండినన్
వన్నెల చిల్కపంజరముఁ • బసయప్పటి దాని హృద్గతిన్
జెన్నగుచుండి నామనసు • ద్యముదుంగునదేమొ చెప్పకే
యున్న ఫలంబదేమి! విను • మున్నవిచారమునంత చెప్పెదన్.

చెలి—సరే చెప్పుము.

మదనమాలిని—వినుము.

సీ. నిద్దపుంబ్రేమతో • ముద్దుముచ్చటలుగాఁ
చినతల్లిదం • డ్రులనువీడి

స్ఫుటమైనభక్తితో • సుస్మితప్రదముగా
సేవలొనర్చిన • చెలులవీడి
శుభ్రంపుస్వరముతో • సుఖదాయకంబుగాఁ
. బలుకులాడిన చిలు • కలనువీడి
సొంపైనగాలితో • సుఖదాయకంబుగాఁ
దనిపినయుద్యాన • వనులవీడి
గీ॥ యుంటినను చింత • నొందకుండిన మదిఁ
దోడఁబుట్టుదాది • తోడుగాను
సంచరించుచెల్లి • స్మరణకేతెంచఁగా
నెట్టివేళఁగల్లు • నిట్టిచింత॥

చెలి—అమ్మా! సకలవిద్యా పారంగతురాలవును పదంపడి యిప్పుడు మహారాజ్ఞివి నగు నీ వ్విడిదితగునా?

ఉ॥ ఎప్పటికో పతిం గవయు • నెప్పటికో పతిముద్దుఁగొందు టిం
కెప్పటికొక్కొ సెజ్జవయి • కెక్కుచు మారసమోరు రూపునిం
జప్పునఁ గౌంగిలించెదని • చాలఁగ గ్రుక్కిలు మ్రింగి మ్రింగి నీ
విప్పటికన్నియుం గనుచు • నిట్టులచింతిలఁ బాడియౌనొకో?

మదనమాలిని—ఓసి నీవు వట్టిపిచ్చిదానవుసుమా!
చెలి—ఎందుచే!
మదనమాలిని—కూడనున్న విచారము కూడదనినమాననా?
చెలి—ఎంతసంగనాచివమ్మా!
మదనమాలిని—ఎందుచే
చెలి—అట్టులుండువిచార మప్పుడేలయుండదు?
మదనమాలిని—ఎప్పుడు?
చెలి— అప్పుడే
మదనమాలిని—అనఁగా?
చెలి—దానిఁ గనఁగా
మదనమాలిని—దేని?
చెలి—జేనికయ్యె
మదనమాలిని—(సిగ్గునఁ బెదవిగొఱుకుకొనుచుఁ బెదముగముఁ బెట్టును

చెలి—(చిఱునగవున) అప్పుడే మీయిర్వురకు ముక్తాహారము [illegible]
చేసితివి ఎంతనిపుణవమ్మా?

మదనమాలిని—ఎవరిర్వురకు?

చెలి—కాదు. మనయిర్వురకు.

మదనమాలిని—(చిఱునగవున) పాపము నీకెంతబుద్ధిగామున్నదో! నీకే
యలంకరించెదఁ బట్టుము.

(అనుచు నొకహారముబట్టుకొని లేఁచును)

చెలి—(అపవారించి) రా ! నేనేదో అట్లంటినేకాని నీవునాకేల యలంక
రింపవలయు?

ఉ॥ ఎవనిమనఃప్రదేశమున • యెల్లెడల న్జరియించుచుందువో
యెవని సమీపమున్గనిన • యెంతయు సిగువుజెందుచుందువో
యెవని కవుంగిలన్గలయ • నెన్నఁగరాని ఖాబ్ధిమున్గెదో
యెవని పదేపదేమదిని • యెంచెదొ వానికల కరింపుమా!

అంతియెగాని యాబాల్యస్నేహధర్మమున నీవు నాకలంకరింప
వగు నను వేడుకచెలిమాత్రనై నీచకులజాతనగు నేను మహారాజ్ఞివగు
నీచే లంకరింపఁబఁడదగుదునా! నాకై నను జ్ఞానముండవలెను.

మదనమాలిని— ఐనచో నే నజ్ఞానవర్తనమొనరించితినని యా నీయభి
ప్రాయము?

చెలి—నే నామాటన లేదు.

మదనమాలిని—(కించిత్కోపమున లేచుచు ఛీ నీమొగముజూడరాదు.
పొమ్మావలకుంబొమ్ము.

ఉ॥ పిన్నటనాటనుండి మము • బెంచిన, దాదియె నిన్నుకన్నదై
యున్నకతంబునో! మఱిమ • ఱొంపుకతంబునో! నిన్నుగూడమా
కన్నలుమమ్ముఁజేర్చితగు • గారముమీరగ సర్వవిద్యలన్
జెన్నగునట్లుచేసెనని • చెయ్యముఁదప్పిన చేష్టనొప్పెదే?

చెలి—రాజ్ఞీ! నిష్కారణముగానన్నుగోపించుచుంటివేగాని నేనెట్టిచెయ్యము
దప్పినచేష్టనొప్పితి.

మదనమాలిని—ఏమియులేదు. పాపము చాలబుద్ధిమంతురాలవు.

చెలి—కాక నేఁజేసిన నేరమేమి?

మదనమాలిని—ఏమో నీకు తెలియకున్నదా? నీవేమో యపేక్షించితివను నభిప్రాయమున నీయపేక్షఁ దీర్చుటకు నీపుష్పహారము నీకలంకరింపరాఁగా, దీనినిరసించుటయేగాక పైన నన్నాక్షేపించెదవా? నన్నాక్షేపించునంతదానవా నీవు? పాపము, నిన్ననిన లాభమేమి?

గీ॥ చవిటినేలనుజల్లు వ • ర్షంబెకురియఁ
బలువిధంబులఁ గాల్వలై • పాఱువిధము
నీచకుల జాతులకు విద్య • నెగడనేని
మన్ను మిన్నులనంటక మధ్యనుండ్రు.

చెలి—(మహావినయముగ) అమ్మా!

మదనమాలిని—(కోపముగ) ఏమిబోమ్మా!

చెలి—నన్నిట్టిచిన్నచూపున జూచుటకూడదు.

మదనమాలిని—కూడకున్న నీయబ్బకుచెప్పుకొనుము పొమ్మ.

చెలి—నీవెప్పుడునాకమ్మవైతివో నీవిభుడప్పుడే నాకబ్బయాయెను. వెళ్ళి చెప్పుకోమనెదవా?

మదనమాలిని—ఏమివిషయమున్నదని యెట్లుసాహసించి దరికిఁజేరి నన్నేమి చేసెదవో చేయుము పొమ్ము. ట్టిమాటలనే, నాకు చీకాకు గల్గుచున్నది. పొమ్ము. నీయబ్బ శీఘ్రము చెప్పుకొనుము పొమ్మ.

చెలి—(ప్రక్కనొకవైపునకు దృష్టిమఱల్చి) తనలో వారెవరు? ఓహో! దీనియేకాంతమునకు గాబోలుఁ బ్రభువుతారట్లాడుచున్నాఁడు! నిష్కారణారుణలోచని యగుచున్నదని భ్రమపడిఁగాని, యిదియునిందుకే నన్ను కోపించుటకావచ్చు. లేకున్న యెంతకాలమునుండియో యొకరిని యొకమాట యనుటన నెట్టిదోయెఱుంగనేరని యీ సకలవిద్యాపారంగతురాలగు వయోముగ్ధ ఆబాల్యమునుండియుఁ దోడునీడగానుండు నన్నిట్లు తూలనాడగల్గునా? ఇదియంతయు నవయౌవనంపు బిరుగల్గిన వయోముగ్ధత ప్రభావము. ఈప్రభావమంతయు గాఢమగుఁ బ్రియాలింగనాదుల గాని యుపశమించదు. (మదనమాలినిజూచి (కో

శముగ) నేనిదేపోవుచున్నాను సుమా? జాగ్రత !

(అనుచు నిష్క్రమించును

మదనమాలిని—(మెల్లగా) పోలే ? (అనుచు వా ముల బుష్పములు సరి చేయుచుండును)

మాన—(మదనమాలిని వెనుక మెల్లఁగఁ బ్రవేశించి తనలో) పాపమా చెలికత్తె యెంతగాఁ దనకనువర్తనమగు మాటల నుడుచుండి నను లేనికోపమువహించి యీమదనమాలిని దానిని నిష్కార ణముగఁ ద్రోసిపుచ్చినది. ఔను.

మ॥ ఎటులైన న్మనసిచ్చియున్నయపుడే • దేనిన్ బ్రశంసించినన్
గటువై తోఁచదు తిట్టిన న్మధుర మా • కాలస్థితిన్బట్టియ
ప్పటిదే తామనసియ్య జంకుఁ గలదై • భాసిల్లుచోనప్పు డ
ప్పటికన్న న్దనయిష్ట నుడినఁ గో • పంబే వహింపంబడున్॥

మఱియు నిట్టికోప మీయువిద కొక యలంకారముగ నేయున్నది. పదంపడి యిట్టిముగుదల కిది స్వభావసిద్ధముగూడను నగును.

గీ॥ పాపయుగమున సర్వసా • మాన్యముగను
నీతిబోధకు వృత్తి దు • ర్నీతియెంతొ
రమణుఁదొలిసంగమోత్సాహ • సమయమందు
బాలికాయనురక్తి గో • పంబుకింత॥

(అనుచు మెల్లఁగదాని ప్రక్క నుపవిష్టుఁడగును)

మదనమాలిని —(తుళ్ళి పాటున లేచి యావలకుఁ బోవుచుండును)

మాన—(తనలో సుస్మితముగ) ఆహా! యీ బెదఱిపోవుటయందు నంద మున్నదే!

మదనమాలిని—(కొంచెమీవలకువచ్చిమానపాలునివక్రదృష్టినిజూచుచు)

ఆహా ! యీ నామనోహరుండెంత హొయలు గలవాఁడు ?

చ॥ రమణఁజెలంగు నింత యను • రాగము, నింతటికీవి, యింతయం
దము, నమరేంద్రుకైన మఱిఁ • దమ్ముఁలవైరికినైనయున్నె! యీ
సుమశరసాయకుండె కడు • సొంపుగనింపొనఁగూర్పనాదు పు
ణ్యమున ధరన్ జనించి యిపు • డర్మిలి నాపతియౌచువచ్చెడిన్.

లేకున్న యింతటిసొ రేరెకిగలుఁగు ? (అనుచు మఱల నోరగా
నాతని జూచుచుండును)

మాన—(తనలో) ఔరా ! ఏమీ దీనిసౌందర్యము !

సీ॥ సోము గీమనరాదు • సొగసైనయీమోము
గళలవృద్ధిందు, న • తయ్యమెపుడు
మరుశరంబనరాదు • మరులెచ్చునీచూడ్కి
శాంతత్వమిందు, న • తయ్యమెపుడు
దొండపండనరాదు • తోరంపుటీమోవి
చవియెంతొయిందు, న • తయ్యమెపుడు
సుమగంధియనరాదు • రమణించునీమేను
స్వనుగంధమిందు, న • తయ్యమెపుడు
గీ॥ నెంతయని దీనిపొంత, ని • తాంతమగుచు
నొందుసౌందర్యవవయువా • ద్యందమెల్ల
వ నముసేయనలవియౌ ! • వనితలందు
నధి శృంగారవతియన • నంతెచాలు॥

(అనుచు మఱలదానిని నిరీక్షించుచుండును.)

మదనమాలిని—(జనాంతికముగాఁ దనలో) ఈనవమన ధాకారుఁడగు
నామనోహరునియొఁ జేరుటకు నామనసెంత వేగి వడుచున్నదో,
అంతగా నీతని సౌర్శకలుగుమాత్రముననే యేలొకో యొడలు
పులకాంకితమగుచున్నది. ఏమిచేయుదు ?

సీ॥ పతిదృష్టిపథమునఁ • బడునంత దత్పద
యుగళిమ్రొక్కఁగనైన • యొక్కబుద్ధిఁ
దతిఁజేరునంతఁ ద • ద్వరపదంబులవ్రాలు
నుత్సుకత్వమిల్లఁబో • నొక్కసిగ్గు
జేతులారఁగఁ బతి • సేవనెప్పుడుఁజేయు
చుండంగవలెనను • నొక్కబుద్ధిఁ
జెలులు దాసీజనం • బులు హేళనముఁజేయ
నుందురేమోయను • నొక్కసిగ్గు

గీ॥ నొక్కవైపున సతులథ • రోక్తబుద్ధి
నొక్కవైపునఁ గడుబాల్య • మొప్పుసిగ్గు
ద్వివిధమై యేమియును నాకు, • తెలియకుండ
నిపుడె చెలివోయె, నాకృత్య • మేమొయిపుడు.

మాన—(తనలో) ఇష్టమెంతగాఁజూచుచుండినను దనివి యెప్పటి కగు ?
ఇదిసిగ్గిలి కాఁబోలు! నాయొద్దకుచేర సాహసింపకున్నది. కానిమ్ము!
నేనె నాసరకు చేర్చుకొనెద. ఇందుఁ దప్పేమున్నది? (లేచి సమీ
పించుచుఁ (బ్రకాశముగా) ఓసి! రమణీ!

గీ॥ వయసునకుచూడఁ గడు జిన్న • వయిననేమి!
సకలశృంగారకావ్య రసంబు నెల్ల
గ్రోలియుంటివి సిగ్గేల • బాలలీల
యన్యులెవరుండిరిటఁ జూడు • మంబుజాక్షి.

(అనుచు దానిగడ్డముఁ బట్టఁబోవును)

మదనమాలిని—(పెడమొగమునఁ గొంచెము ప్రక్కకు దొలఁగఁగా)

మాన—(దాని బుజముపై చేయివైచి) ఓసీ!

ఉ॥ ఆదెసఁజూడు మెంతకడు • నందముమీరెడు మల్లెలున్నవో!
యీదెసఁజూడు మెట్లు వన • జేతరభూమిరుహంబులున్నవో!
యేదెసఁగాంచిన న్మనను • కెంతయొ హర్షముగూర్చు నూవె,నీ!
కేదెసయిష్టమో యచట • కేఁ గొనిపోయెద రమ్ము ముద్దియా!

(అనుచు దానిఁ గొంచెముదూరము కొంపోయి దానిముఖము నిరీ
క్షించుచుఁ దనలో) దీని నెట్లైననుఁ బల్కరించుకొనవలెను. (ప్రకాశ
ముగా) తన్వీ!

ఉ॥ ఈవును బాల్యమాడియును • నెంతయొ నేర్పరివంచు నేను ము
న్నే వినియుంటి నైన నిట • నేనొనఁగూర్చిన యీవనంపు సొం
పీవొనగూర్చినట్టి భవ • దీయ జని లి, నావనంపు సొం
పేవిధినుండు? భేదమెది? • యేది చమత్కృతి నొప్పు? చెప్పవే.

(కొంచెము నిదానించి) ఏమి! పిచ్చిదానా? (అనుచుదాని
గడముఁబ )

ఉ॥ దేనికిఁ జెప్పవేమి? మది • దేనికి సంశయమొందెదీవు! నా
దానవు గావొకో! మఱిఁక • దాచకు నీయభిలాషమెద్దియో
దాని వచించి తత _ ముఁ • దారొ్కను మిటుల ము గాఁ బతిఁ
పైనికుఁ జేయఁగా దగదు • తప్పుసుమా స వైనసీకునూ॥

(దానిచేయిఁబట్టుకొని) రమ్మి! మనమిరు మావేదికపై నేకాంతముగా గూర్చుండము రమ్మి. (అనుచు నా వేదికసమీపమునకు జేర్చి) నీవిటఁగూర్చుండుము. (కూర్చుండబెట్టి యెదుటనున్న హారములను చేతనెత్తిపట్టుకుని సుస్మితముగ) హారముఁ కూర్పుచమత్కృతినీదేనా?

మదనమాలిని—(శిరమువంచి చిరునగవున మెల్లగా) ఔను.

మాన—(సంతసముగ) ఆహా! ఇవెంతయందముగ నున్నవి? (దానిబుజముపై చేయివైచి తనతలయొగ్గి) ఇదుగో! నీవు మదనమాలినివా! కుసుమమాలినివా?

మదనమాలిని— చిరునగవుతోఁ బెడమొగముఁబె మిన్నకుండును

మాన—చెప్పకున్నవేసి! ఈరెండవి రెవరికి?

మదనమాలిని—రెండును దమకే.

మాన—రెండును నాకే?

మదనమాలిని—ఔను.

మాన—కాదు, ఇవి మనయిర్వురకును జెరియొకటి. అగునా?

మదనమాలిని—(చిరునగవున మిన్నకుండును)

మాన—అంతే నీభావము. ఇదుగో! దీనినే నలంకరించుకొనుచున్నాను. (అనుచునట్లుచేయఁబోగా)

మదనమాలిని—(చప్పునలేచి) నే నలంకరించెదనిటిండు.

మాన—అట్లే కానిమ్ము. ఇదిగో! (అనుచు నొకటియ్యఁబోగా)

మదనమాలిని—(రెండును బట్టుకొనును)

మాన—రెండును దేనికి?

మదనమాలిని—పనియున్నది.

మాన—సరే (అనుచు రెంటినివదలును)

మదనమాలిని—(రెండు నాతనిమెడలోవేసి కూర్చొనును)

మాన—(తనమెడలోని దొక్కటిదీసి దానిమెడలోవైచి దాని ప్రక్క నుపవిష్టుఁడై దానిఁజూచుచు) ఆహా యిప్పుడింకను నెంతరమణీయకమున నుంటివి!

చం॥ కలువలుఁదమి మొగ్గలును • గల్గుసరోవరమందు హంసముం
బలె సిరిదాల్పు స్తృతపు • వక్షమునందలి కౌస్తుభంబలెన్
దలఁప వికాసితంబయిన • తామరపుష్పములోని కేసరం
బులవలె నెంతొ యందమిట • బొల్పయె నీయెడ నీవు జూడుమా.

మదనమాలిని—తనమెడలోనిహారమును జేతఁబట్టుకొని చూచుకొనుచు (మెల్లఁగ)మీకు నిజముగ నాయీకూర్పంతయందముగనున్నదా?

మాన—(ఆలకించుట నభినయించి) యేమనుచుంటివి?

మదనమాలిని—(చిరునగవునఁ బెదవిఁ గొరుకుకొనుచుఁ బెడమొగముఁ బెట్టును)

మాన—(దానిఁజూచితనలో) అంతలో దీనికిసిగ్గు, మఱలఁబల్కరించుకొనెద; (ప్రకాశముగ) ఏమీ! నీవనునది?

మదనమాలిని—(అతనివైపుఁజూచి మఱలనట్లే చిఱునగవునఁ బెదవిఁ గొఱుకుకొనుచుఁ బెడమొగముఁ బెట్టును)

మాన—(దానివీపుఁ జఱచుచు దాని గడ్డముఁ బట్టుకొని) మనోహరీ! నీనుడునుడువులు నాకువినపడకనిన్నిట్లువజేవదేప్రశ్నించుటకాదు.

ఉ. క్షీరములుండి చక్కెరకు • చెంత నొకానొక గవ్వమైన లే
కారయువాని చందమున • యందముమీరిన నీదు సంగమం
బారయఁ గల్గినన్ హృదిని • హాయినిఁగూర్చెడు నీమృదుస్వనం
బారయుచుంటి నామనను • కట్టికొరంతిఁక తీర్పవేడెదన్.

కనుక చెపుము! ఇందాక నీవేమంటివో యిప్పుడసలే మఱచితి. భిడియపడక చెప్పుము. (దానిముంగురులు సర్దుచు) ఊఁ చెప్పుము. (దానిశిరమును గడ్డముఁబట్టి) చెప్పవేమి?

మదనమాలిని—(గారాబముగ) ఏమి చెప్పమనెదరు?

ఉ॥ సిగ్గగుచున్న దేమియును • జెప్పఁగఁజాలను దేనికోసమో
యగ్గలమౌచు నాహృదయ • మందున యేదొ జనించుచుండె నా

యుగ్గలమిందుకై చను న • టంచును సైతము౯ జెప్పరాని దై
సిగ్గుకుమూలమై చెలఁగుఁ • జెంతకుమారిటు వచ్చువెంటనే.

మాన—(తనలో) ఆహా! యేమీ దీని నర్మగర్భోక్తి! ఇది ముగ్ధయా? ప్రౌఢయా? కాను. ఇది వయోమాత్రముగ్ధయగు విద్వత్ప్రౌఢ. మఱియుఁ బ్రియసంగమోత్సుక సంరంభయగు నవయౌవనారంభ. ఎదుటి దిశఁజూచి- నిగుస్సి) ఆవచ్చునదెవ్వరు? ఓహో! అది నీవేడుక చెలికత్తియే, అపూఁబొదలచాటునుండి వచ్చుచున్నది. పూలపాన్పమో యమర్చివచ్చుచుండును. (మదనమాలిని జూచి ప్రకాశముగా) ప్రేయసీ! నీవు నిజముగా సిద్ధసంకల్పవు సుమా! సద స్కాలఫలసంఘటనాసంకల్పవన నీకుగాక మఱొకరికి జెల్లదు. అ గో నీచెలివచ్చుచున్నది. దేనికివచ్చుచున్నదో గ్రహించుము. (నేపథ్యంబున)
చెలి, రాజీ! (అనిపిలచును.)

మదనమాల—అ గో ! నాచెలి దేనికో పిల్చుచున్నది. సెలవిండు.

మాన—పొమ్ము.

మదనమాల—(నిష్క్రమించును)

చెలి—(ప్రవేశించి వినయముగ) ప్రభూ! రాజ్ఞి పిల్చుచున్నది.

మాన—(చిఱునగవున) ఎచ్చటనుండి?

చెలి—(చిఱునగవున) నాతోరండు.

మాన—సరేపద. (నిష్క్రమించుచుండఁగా నవనికజారును.)

ప్రదేశము-ఏకాంత లము.

మాన—(ప్రవేశించుచు)

చం॥ వయసనునట్టిదే పరమ • వస్తువు దానినిమించు వస్తువే
దియుదు గనంగలేమనుచు • దిట్టతనంబునఁ జెప్పుమూరుల౯
దయఁగననౌనె ! యావయసు • దాపురమేయగునంత ప్లమే
దియుఁగననౌనె ! యెవ్వరిని • దీనులఁ జేయదె ! కామవశ్యయై॥

చెలి—(ఒకవైపునఁ బోవుచుండును)

మాన—(దానిఁజూచి) ఎవరాపోవునది ?

చెలి—(చేతులు జోడించుకొని వినయముగ) ప్రభూ ! ఏమి సెలవు ?

మాన—మీరాజ్ఞిపుడేమి చేయుచున్నది ?

చెలి—పురాణకాలక్షేపముఁ జేయఁబోవుచున్నది.

మాన—(ఆశ్చర్యముగ) ఎట్లు ! పురాణకాలక్షేపమా ?

చెలి—మీరు లేనప్పు డెప్పుడేదో యిట్టికాలక్షేపమే చేయుచుండును.

మాన—ఈరోజు నెట్టికాలక్షేపము జరుఁగబోవుచున్నది.

చెలి—శ్రీ మద్రామాయణ మహాపురాణ కాలక్షేపము.

మాన—అట్లనా ?

చెలి—తమరు సైతము దయసేసిన బాగుండునని కుతూహలపడుచున్నాను. పిదప మీదయ. ఇకఁ నాకు సెలవిండు.

మాన—సరే పొమ్ము.

చెలి—(చిత్తము. నిష్క్రమించును)

మాన—(తనలో) నేను లేని సమయం దెప్పుడును నారాజ్ఞి వృధాకాల క్షేపము నొనర్పక బురాణకాలక్షేపముఁ జేయుచుండునా ? మంచిది. నాజన్మలో నాకు నిన్నటిదిన ముదా నంబున నారాజ్ఞి నాకొనగూర్చిన తనముగ్ధ శృంగారమే వర్ణనాతీతంబగు నానంద మొందించినది. ఇఁక నీ పురాణకాలక్షేపమున నెంత యమందానంద మొనఁగూడునో కందునుగాక ఆహా యేమి నాభాగ్యము !

ఉ॥ ఎందఱు లేరు భూవరులిఁ • కెందఱు లేరు మహావిదుల్భువిన్
సుందరు లెందఱుండరొకొ ! • చూడము వారినియెల్ల ! యిప్పుడీ
చందముగాను సర్వవిధ • శాస్త్రపరిజ్ఞతఁగల్గి యెంతయో
యందము మీఱు నాగృహిణి • యట్టిది యేరికిలభ్యమయ్యెనే.

ఏమంటి ! ఛీఛీ ! యెంత మందమతి నగుచుంటి .

ఉ॥ అందమదేల స్త్రీలకిల • నారయ ! విద యమాత్రమేల ! యా
యందము విద యున్నిటుల • యందురు నెలు వొందుఁగాక! యా
నందముఁ గూర్పఁజాలునొకొ • నాథులకెల్ల యవన్ని చూడఁగాఁ
జందముగాదు మానసము • సత్యసతీత ఁ జెంద కిమ్మహిన్.

ఉ॥ ఆ యెడ మద్దీయహృది • యందున యేదొకపై విలాసముగా
బట్టి మహాద్భుతంబుగను • బామరుపోలెను భ్రాంగుచుంటినే

నెట్టిఘనుండ ! నాగృహిణి • యెట్టిదొ ! దానిసతీత్వమెట్టిదో !
గట్టిగ నారయన్వలెఁబె ! • కాంతలహృద్గతి నమ్మవచ్చునే —

న కమా ము చేయునదేము ది?

గీ॥ పర తీ చేష్ట నెప్పుడే • భంగినైన
నెట్టివాఁడైనను గ్రహియింప • గట్టిఁడౌను
సీయమందు నామాత్రంబు • విధముఁదెలియ
శ క్యమే ! శక్యమైనచో • జగతిమనునె .

కాని యెటులైనను దీనిగుణమును బరీక్షించియే తీరవలె.

సీ॥ దేహమా మేలిమిం • దేలినబంగారు
వన్నెమీఱుచుఁగను • పండువయెడు
నవయవ సౌందర్య • మా కోమలంబునై
చక్కనై హృదిసంత • సంబునిడుఁ
జూడ్కియా వక్రమై • సూనశరోపమై
సన్యాసికైన హృ • త్సంగమిడెడుఁ
గంఠస్వరంబ దు • మ్కృతినపాషాణంబు
నకునైన మిక్కి • లానందమిడెడు
గీ॥ వైదుషీత్వంబ విబుధుల • ప్రతిభఁగనెడు
నిట్టి సర్వశుభాఁగ సం•ఘుట్టమయెడు
నట్టి మదనమాలినిహృది • యమలమగుచు
నుండకుండిన లోపంబు • నిండుకాదె !

భటు—(ప్రవేశించి) ప్రభూ ! ఆనందశర్మగారు మీ దర్శనమునకు వేచియున్నారు.

మాన—(భటునిఁజూచి సంతసముగ) ఓహో ! సత్వరములోనఁ బ్రవేశ పెట్టుము .

భటు—చిత్తము. (నిష్క్రమించును)

మాన—(సంతసముగఁదనలో) ఆహా ! ఈయానందుని నామోచ్చారణ స్మరణశ్రవణాదులమాత్రముననే నాహృదయమెప్పుడు నతా ంద మగుచుండును. ఔరా !

గీ॥ యౌవనారంభ దశయందు • నైనయువిద
యందు సఖ్యత్వమెట్టిదో • యాదినుండి
యైన యా ల్యమిత్రత్వ • మట్లెయెపుడు
మఱువరానిదెయగుఁ జెల్మి • మహిమయేమొ !

అదిగో! ఆనందుఁడు వచ్చుచున్నాఁడు. ఈతఁడు నాప్రాణసముఁడు. ఆమదనమాలిని నాప్రాణసమ. ఈతఁ డధిక వేదాంతి. యది యధిక విద్యావతి. ఈతని నిశ్చలత్వమెట్టిదో ! దాని సతీత్వమట్టిదో ! ఈతఁడును సుందరాకారుఁడును సకలకళానిధి. అదియును సకల శృంగారవతి, చాతుర్యసీమ. ఈతఁడును యౌవనుఁడు, నదియు యౌవని. నేనో ఈ యిర్వురకును సర్వసముఁడ. ఆహా ! నేనొక సూత్రధారుఁడనై వీరిర్వుర నొకచోఁ జేర్చి యొక పరీక్షానాటకము గల్పింతునా ?

ఆనం—(ప్రవేశించుచు) మిత్రమా !

మాన—(త్రుళ్లుపాటున నానందునిజూచి ఓహో ! ఆనందా ! మంచి సమయమునకే వచ్చితివోయి !

ఆనం—(ఆశ్చర్యముగ) ఏమది?

మాన—ఇప్పు డంతఃపురమునఁ బురాణ కాలక్షేపము జరుగుచున్నదట.

ఆనం—ఆపురాణమేమి? ఆజరుపువారెవరు?

మాన—పురాణము రా క త శ్రీమద్రామాయణ మహాపురాణము, జరుపునదియు రా యి. విందమురమ్ము.

(అనుచు నాతని చేయిఁ బట్టుకొనును)

ఆనం—అంతఃపురమునకు నేను దేనికి?

మాన—రావోయి! (అనుచు గుంజుకొనిపోవుచుండును.)

అంతలో యవనికజారును)

మఱల యవనిక లేవగా, మదనమాలినీ అంతఃపురము.

(రామాయణము ముందుంచుకొని మదనమాలినియు, వినుటనభిన యించుచుఁ జెలికత్తెయు రంగమునయుందురు)

శ్లో॥ త్వత్సమీపే తాంరామ! కోవామాంధర్మ యేద్వనె
ఫలమూలాఽది ం యద్వత్త వభుక్త్వా వశేషితం

తదేవామృతతుల్యంమే తేనతుష్టా రమామ్యహం
త్వయా సహచరంతా మి కుశాః కాశాశ్చకంటకాః॥

మదనమాలిని— (ఇట్లు దువుచుండును)

(ఈపై శ్లోకముఁ జదువుమధ్యలో మానపాలానందులు ప్రవేశించి వినుటనభినయించి నిలుచుండియుందురు)

మదనమాలిని—(వారినిజూచి గంధమునుమూయుచు లేచును)
చెలియు వారినిజూచి లేచును)

మాన—(మదనమాలనితో) ఆఁ ఆఁ గంధమునుమాత్రము మూయకుం. (ఆనందునితో) రావోయి! (అనుచు నాతనిఁబట్టుకొని యచ్చటి శయ్యాదాపునఁ నాతనిఁజే \ తానందు నుపవిష్టుఁడగును)

ఆనం—(బెదరు నభినయించుచుండును)

మాన— ఆనందునిజూచి) దేని కనుమానించుచున్నావు! ఇటుఁగూర్చుండుము (అనుచు స్వయముగా నాతనిశయ పై గూ ండఁబెట్టును)

మదనమాలిని—చెలి- (గుసగుస లాడుకొనుచు దురు)

మాన —(వారిర్వురిచర్యగాంచి వారలతో ఏమాగుసగుసలు?

మదనమాలిని—చెలి- (త్రుళ్లుపాటున మి కుందురు)

మాన— (వారలతో) ఇప్పటికికథ యెంతవరకైనది?

మదనమాలిని— (మందస్మితముసేయుచు సిగ్గుతోఁజెలినిజూచును)

మాన—చెప్పరేమి?

చెలి—(మందస్మితముతో మెల్లగ) ప్రభూ! ఒకపాతికపాలైనది.

మదనమాలిని—(అపవారించి చెలితో) పాతికపాలేమిటె! నీసు ఖం!

చెలి—కథా భాగముఁజెప్పుచున్నానమ్మా!

మదనమాలిని—అట్లుగాదు. కథా సందర్భముఁజెపుము.

చెలి—(మానపాలుతో) ప్రభూ! ఇప్పుడు రాముసరణ్యప్రయాణఘట్టము జరుఁగుచున్నది.

మాన—(విస్మితముగ) ఓహో! ఇప్పుడు దుఃఖరససంఘటిత ఘట్టముజరుగుచున్నదా! దుఃఖరసమేమి లే! మధ్యమధ్య నేమేమిరసములు మారుచున్నను మొత్తముమీద రామాయణమంతయు నానందమయమే, ఏమోయి యానందా? (అనుచునాతనిజూచును)

ఆనం—(సంతసముగ) ఔను.
మాన—(మదనమాలినిజూచి) ఓఁ ఇఁక నారంభింపుము.
మదనమాలిని—(చెలితో రహస్యముగ) ఆయానందపండితునిచే నీపూటఁ గాలక్షేపము జరుపునట్లుకోరుము.
మాన—(మదనమాలినిజూచి ఇంకనేమిటో యాలోచన?
చెలి—(వినయముగ ప్రభూ ఆనాడానగర బాహ్యారామమున దర్శన మొసంగిన యీయానందపండితులు మఱల మాపుణ్యవశంబున నేటికెట్లో మీవెంటనిచ్చటకే తెంచి దర్శనమియ్యఁగ రి. అందుచే వీరిచేతనే యీపూట నీసత్కథాకాలక్షేపము జరిఁ నబాగుండు నని రాజ్ఞితనయామాశయమును వెలిఁబుచ్చుచున్నది. పిదప మీదయ.
మాన—(కనులుమూసుకొనితనలో) ఓఁహూ. ఇదియునొకందుకు మం చిదే, (ఆనందునిజూచి ప్రకాశముగ) ఏమానందా?
ఆనం—(తనయనంగీకారమును సూచించును)
మాన—(మదనమాలినిజూచి) రా! వీరిచే ని సత్కథాకాలక్షేపము మఱొకప్పుడు జరుఁగవచ్చును. నీవుమాత్రమిఁక నాలస్యముఁజే యక నారంభింపుము.
మదనమాలిని—(మఱల మందస్మితమగుసిగ్గుతోఁ జెలినిజూచును)
చెలి—దేనికమ్మా? సిగ్గు! తఁరగాఁ గానిమ్ము.
మాన—ఓహోహో! రా దేనికిసిగ్గునీకిపుడు?
శా॥ నేనో! ప్రాణధవుండనీకు మఱివీ • నిఁజూడ నీకుండునా
ప్రాణ నము నీచెలేయదియు నీ • ప్రాంతంబు నింకన్యులే
రైనా పొంచొనియుందురే చెపుమ ని • న్నాక్షేపముఁజేయు కై
రాణుల్ రాణవసించుచోట భయమే • లా! మేలోకో! లావొకో?
గీ॥ రమణనొప్పారు రామాయ • ణమును కావ్య
రమవిలాసంబు రాసంబు • రంజితంబు
నగు విధంబు నీసమ్ముఖం • బందు విను ము
దంబునంటిమి చెపుమిక • సంబరముగ!
ఆనం—(చిఱునగవున మానపాలుతో)మిత్రమా! రాజ్ఞి కన్నమున్నే నీబో ధనాపురాణ మిట్లు ప్రబలమగుచున్న యింకా రా చెప్పుట

కవకాశమేది? (మదనమాలినిజూచి అమ్మా! ఇంక సిగ్గుంజెంద. సత్వరము బురాణముచెప్పుటకానిమ్ము! నీవును నీమనసున నొం విషయ మాలోచింపుము.

ఉ॥ చిన్నతనంబునుండిఁ గడుఁ • జిత్తమునెల్ల గురుప్రకాండమం
దెన్నికఁజేసి కష్టముల • నెన్నొసహించి వహించు విద్య సి
గ్గన్నది వీడి బైల్పఱచు • నప్పుడకాదొకొ సార్ధకంబగుఁ
బిన్నవెసీవు విద్యలకు • మిన్నవు నీకొక నీతి శ్రొత్తయే!

చెలి—(మదనమాలిని బుజముపైఁజేయివైచి) అమ్మా! ఇంకను సిగ్గెందు కుఁగానిమ్మమ్మా!

మదనమాలిని—(వారించి) సిగ్గుఁగాదు ఎగ్గుఁగాదు(అనుచు దలవాల్చును)

చెలి—(తలవొయి ) మఱి దేనికి

మద మాలిని—దేనికో నీకేమితెలియు!

॥ ఘన ఘనాఘనాఽకాశనం • కాశ విద్య
తందు దివ్యాచందాన ము • హాజగాన
నిగమనిగమాంగ పఠనీయు • లగుఁబురుషుల
యెడను స్త్రీవిద్య తేజోవి • హీనకాఁదె !

అందుచేత నేను జంకుచుంటి; తెలిసినదా!

ఆనం—(సంతసముగ తనలో ఆహా! ఏమీ యుపమానో మేయము! మఱియూ నిదొక యెత్తిపొడుపుమాట కానిమ్ము (ప్ర అమ్మా! ఒక్కమనవి!

మదనమాలిని—(ఆనందుని జూచును)

ఆనం—

గీ॥ ప్రౌఢతనమునెంత • వఱలినఁ బుంవిద్య
స్త్రీల విద్యయంత • చెలువుగాదు
దివ్యమైన శ్రీల • నవ్యవిద్వత్ప్రకా
శంబు డంబునొము • దంబొసంగు.

అందుచే నింక నీవాసందియమును వీడుము.

మదనమాలిని—అట్లైనచో నేనింక ధన్యురాలను.

మాన—ఊఁ! ఇంకనైనను ప్రారంభింపుము.

మదనమాలిని—చెలీ! కూర్చుండుము (చెలికూర్చుండఁగాఁ దానుఁగూర్చుండి రాగమాలాపించి)

శ్లో॥ త్వత్సమీపే తాంరామ! క్రోవామాంధర్ష యేద్వాని
ఫలమూలాఽదికంయద్య త్వభుక్త్వాశేషితం
తదేవామృతతుల్యంమే, తేనతుష్టా రమామ్యహం,
త్వయా సహచరంత్యామికుశాఃకాశాశ్చకంటకాః,
(అట్లు చదువును)

ఆనం—(ఆలకించుచు సంతసముగ శిరఃకంపముఁజేయుచుండును)

మాన—(ఆలకించుచు సంతసముగఁ దనలో) ఆహా! ఇది సంగీతసాహిత్యములయందు నిపుణయనుట విశేషోక్తి గాదు.

చెలి—(మదనమాలినితో) ఇఁక దీనియర్థముఁ జెప్పుము!

ఆనం—(వారించుచు) ఆఁగుము! రాజ్ఞి మఱల నొకతూరి యాశ్లోకమును జదివి వినిపింపుము.

మదనమాలిని—చిత్తము (మఱల)

శ్లో॥ త్వత్సమీపే తాంరామ! క్రోవామాంధర్ష యేద్వాని
ఫలమూలాఽది ంయద్య త్త్వభుక్త్వాశేషితం
తదేవా తతు ంమే, తేనతుష్టా రమామ హం,
త్వయా హాచ ంత్యామికుశాఃకాశాశ్చకం కాః.

ఆనం—(సంతసముగ) ఆహాహా! చాలబాగున్నది. ఇంకదాని భావమును విశదపరపుము.

మాన—(ఆనందునిపైఁ జేయివైచి) ఆనందా! ఇంతయల్పసంతోషుఁడవేమోయి!

గీ॥ పాండితీభావమిల్ల, భా • వప్రకటన
మందుఁ గ్రాలుగా నీగాన • మందుచూడ
నేమియున్నది సూ? గాన • మింతయింత
బుదుతలకుసైత మలవడుఁ • బుడమినిపుడు.

ఆనం—ఐనచో నిప్పుడేమందువు?

మాన—భావప్రకటనమగుఁబిదప నిట్టిసంతసమనుభవించిన బాగుండున

ఆనం—సరే కానిమ్ము. (మదనమాలినిజూచి) అమ్మా! ఇంక(బారంభ
పుము.

మదనమాలిని—చిత్రము. (చెలిబుజముపైఁ జేయివైచి) చెలీ !
(చెలినిజూచి) చెలీ! ఈరాము నరణ్యప్రయాణఘట్టమం దింత
మున్నా సీతామహాదేవి శ్రీరామచంద్రప్రభుం డేమని చెప్పెనో వింటివా!

చెలి—విన్నాను.

మదనమాలిని— ఏమని?

చెలి—(సాలోచనముగ) ఏమనఁగా? ఆఁ. అపును. సీతకు చెప్పిన రాము
ను భావాభిప్రాయము గదా? నీవడుగునది?

మదన—ఔను.

చెలి—ఏమన్నది? ఓసీతా! నీవు సుకుమారవౌటచే ఘోరారణ్యంబు
కేగు నాతోనీవు రాఁజనదు. నీరానన్న ప్రయత్న మింకను డుం
గుము! అనియేకదా?

మదన—ఔనా? తర్వాత సీతాదేవి చెప్పుచున్నదివినుము. "త్వత్సమీ
పే తాం రామ!" హేరామా! నేను సుకుమారిననియు, మీ
రేగునదిఘోరారణ్యమనియు నేనుమీవెంటవచ్చుచో నందు
మిగులఁ గష్టములొం దుదుననియు నన్నేల భయపెట్టఁజూచెదరు!
"త్వత్సమీపే తాం రామా! కోవామాంధర్ష యేద్వనే" హే
శ్రీరామచంద్రా! మీసన్నిధియుండఁగా నెట్టియరణ్యములందైన
నెవరికేమిభయముకల్గు? మఱియు సరియగు నాహారపదార్థములు
లభించకఁ గ్రంచెదనంటిరి. "ఫలమూలాఽదికం దత్త
నభుక్తాఽ వశేషితం, తదేవాఽమృతతుల్యం మే. తేనతుష్టా
రమామహం" (సుస్మితమభినయించుచు) ఆహాహా! వింటివా!
"హే శ్రీరామచంద్రప్రభో! మహాసుకుమారులగు మీచేతనే
యేకందమూలాదులు భుజింపఁబడుచున్నవో ఆమిగిలిన కంద—
మూలాదులే నాకు మిగుల నమృతోపంబులై భోజ్యములగు
నందుచేతనే యీప్రయాణమునకు నేను సంతోషించుచుంటి,
మఱియుఁ గుశకాశకంటకాదులచే సంచరణసమయంబున కష్టము
కల్గునంటిరి. అదెట్లుకల్గు? "త్వయాసహాచరంత్యామి" నేను

మీ వెంటవచ్చునప్పుడు "కుశాః కాశాశ్చ కంటకాః" ఆదర్భలు, ఆరె దుబ్బులు, ఆకంటకములు మొదలగునవి నన్నేమిచేయ గలవు "పుష్పాస్తరణతుల్యామే" చూచితిరా! నాకవన్నియుఁ బూలపాన్పువలెసౌఖ్యమిడఁగలవు భవిష్యంతినసంశయః" నాకాకీతి సౌఖ్యము సే యిడఁగలవు. ఇందెంతమాత్రమును సంశయములేదు.

మాన—(సాక్షేపముగ) ఆహాహా! ఏమి భక్తి సమోయి భక్తిరసము

ఆనం - (విస్మితముగ) ఏమోయి! రాజ్ఞింతసుశ్రావ్యముగఁ జెప్పుచున్నను నీకేమియు నచ్చుటలేదుగా!

మాన—అదికాదోయి! సీతప్రస్తావము నాకు నచ్చుటలేదు.

ఆనం—ఎందుచే?

మాన— ఏదో కార్యామేగు శ్రీరాముని సీత వెంబడించెదననుట

ఆనం—అందుఁ దప్పేమున్నది?

గీ. అధిపుఁడనువందు సగభాగ • మాలుపాలు
నాలుతనువందు సగభాగ • మధిపుఁబాలుఁ
గాన యీతనువులరెండు • గాఁ నొనర్చి
సంచరింపగఁ గూడదే • సమయమందు.

మాన—(మరల నత్యాక్షేపముగ) ఈధర్మ మేశాస్త్రమందున్నదోయి

ఆనం—భార్యయర్థాంగి యను భావ మేశాస్త్రమందుండునో ఆశాస్త్రమందు.

మాన—(మదనమాలినిజూచి) ఏమే! ఈవిషయమున నీయభిప్రాయమేమి?

మదనమాల-(మందస్మితంబగు సిగ్గునఁ బెదవిఁ గొఱుకుకొనుచుఁ బెడమొగముఁ బెట్టును)

మాన—అదిగో! ఆసిగ్గె విద్యావివాదంబున కూడదు.

గీ. సర్వవేద పురాణ శా • స్త్రంబులందు
న సంగ్రహ రసికత్వ • మధిగమించుఁ
బ ండితుల ముందు జంక కె • ప్పటిదెనఁ
దర్కమును జేయవలె దధిఁ • దరుచుభంగి.

ఈవిషయము తెలియదా? ఏమీపలుకవు?

మదనమాలిని- (మెల్లగ) తెలియును.

మాన—ఐనచో సీత ప్రస్తావమున నీయభిప్రాయమేమి ?

మదన—ఆయానంద పండితుల యభిప్రాయమె నాయభిప్రాయము.

మాన—నాయభిప్రాయము మాత్రమది కాదు.

ఆనం—(మానపాలుని తో) నీయభిప్రాయ మేమోయి ?

మాన—నాయభిప్రాయ మేమనెదవా ?

గీ. భార్యయర్థాంగి యనుదాని • భావమెల్ల
సతియుఁ బతియును దమ హా ది • సంఘటించి
మెలఁగవలెనని గాని భూ • స్థ ని యొకరి
వెంబడొకరేగుటని గాదు • వెఱ్ఱివిధిగ.

మదనమాలిని—అట్లయిన నాయభిప్రాయము నైతము వెల్లడింపఁ దగునా ?

మాన—నిస్సందేహముగ, విద్యావివాదమునగాని మఱి యేవిషయమందునగాని స్వాభిప్రాయ ప్రకటనముకంటె మఱొండు ప్రాజ్ఞులకు పాడిలేదు. ఇంక నీయభిప్రాయమేదో వెల్లఁబుచ్చుము.

మదన—చిత్తము.

ఉ. కాంతకుఁగాకఁ గాంతుడును • గాంతునకట్టులె కాకఁ గాంతయుఁగ
స్వాంతములందుఁ గష్టసుఖ • సంగతులొందఁగ రాదటంచుమీ
స్వాంతము నైత మొప్పెడిని • బాగయెఁగాని తదీయపక్కి నే,
స్వాంతములందునొండ సహ • చర్యత నిర్వురునొప్పకొప్పనే ?

మాన—అదిగో, దానినే! నేనొప్పను.

ఆనం—(మానపాలు స్మరించి) దేనినోయి!

మాన—సతీ పతుల సహచర్యత్వమును.

ఆనం—ఎందుచే?

మాన—అది సతీధర్మమునకు విరుద్ధము.

ఆనం—విరుద్ధ మెట్లగు?

మాన—అట్లడుగుము చెప్పెద.

మ. పతి దేశాంతరమేగుచో నపుడు సత్ • భావంబుఁ జెన్నార సత్
సతియేదైన నవార్జితంబు నతి ని • ష్ఠన్భర్తృచింతా పరా

యిత చి త్తంబున యేకభ క్తతను దా • నింట న్జరింపన్వలెఁ
బతిసాన్నిధ్యము గల్గుదాఁక సతికిఁ • మార్గంబె సన్మార్గమౌ.

అంతియేగాని అసలు అంతఃపుర వాసార్హ యగు రాజస్త్రీయై యుండి, భ ర్తయగు మాత్రమునే యాతనివెంబడించి బహిరంగ సంచారమున కుద్యమింపఁదగునా? అదేమనిన,

శా. లీలామానుషరూపులై ధరణిలో • శ్రీయు న్మహావిష్ణు వా
పౌలస్త్య వ్యధ జేయుకై చనిరనే • భావంబుఁ జూపెట్టుదే
మో ! లోకుమ్నరికింప నందుననునూ! • నొప్పౌనె! యీరీతి సీ
తాలోలేక్షణ మానుషీత్వము న భ • రమ్నాశి బైలొందుటల్.

ఆనం—బైలొందునంతనే సీతమానుషీత్వమున కొందినలోపమేమి ?

మాన—సతీధర్మ విరుద్ధమే.

ఆనం—సతీధర్మమందు భ ర్తృసహచరత్వము విరుద్ధమను నర్థమున్నదా?

మాన—అసలు కూడవచ్చెద ననునంతనే భార్యను వెంబడించుకొనిపోవు రాముడే పిచ్చివాఁడు.

ఆనం—ఇఁకనరే, మఱల రాముఁ బరీక్షకోటి నెత్తుకొంటివా ? (మదనమాలినిజూచి) అమ్మా ! నీప్రమాత్రము తదుపరిశ్లోక మారంభింపుము.

మదనమాలిని—ఇక నారంభించున దేమి ? ఒకవైపున రాముడే పిచ్చివాఁడనుచుండఁగా నీరామాయణమింక పిచ్చిరామాయణమేకదా! ఇట్టి పిచ్చిరామాయణమేల చదువవలె?

మాన—రామాయణమును బిచ్చి రామాయణ మనేకాదు. నిరర్థక రామాయణమని సైతముఁ జెప్పనలసి వచ్చినది.

ఆనం—ఎందుచే?

మాన—ఒక గ్రంథకథా భాగమందలి నాయకీనాయకు లెప్పుడు త్తమ పాత్రతవహింపఁ బడరో అప్పుడే యది సర్వాంగములందును, వ్యర్థముగఁ బరిణమింపఁబడు,

ఆనం—ఈరామాయణ, (అర్ధోక్తిలో)

మాన—(వారించి) నేజెప్పినదంతయుఁ బూ ర్తికానిమ్మా ! ఇఁకనట్టి నా

యకీయుం దుత్తమ పాత్రత్వమనఁ జాతివ్రత్యమొకటే. అ
యేమో యిట్లున్నది.

ఆనం—ఇట్లున్నదనఁగా,

మాన—ఈ నిర్ణయమునకు మఱలవచ్చెదను. ముందు నాయాక్షేపణ భాగమంతయుఁ బూర్తిఁగానిమ్ము. ఇంకనెన్నో విషయంబులనొప్ప వలసిన పాత్రత్వము నాయకునిది, అట్టినాయకుండగు శ్రీరామ ని లీల యెట్టిది?

సీ॥ తనకెట్టి యపకార • మును జేయకున్నట్టి
స్త్రీఁ జంపె, విప్రుని • తేజమణఁచె
స్త్రీకిదత్తంబైన • చెడువరంబౌకపాడి
యనుచెంచి కన్నల • వనటముంచె
నవకోమలాంగియౌ • యువతిని బహిరంగ
ముగ నటవులమధ్య • నెగడఁజేసె
రమణికోల్పోవు మా • తనె జవాదుఃఖించి
యన్యాయత శత్రు • లణఁగజేసె

గీ. నిటులధర్మంబుఁ, బెద్దల • యెడలభక్తి
యుక్తమౌదీక్ష కన్నల • కొప్పునడక
నాత్మబుద్ధియు స్థైర్యంబు • శూరతయును
లేనివేకావె! శ్రీరాము • లేఁనోలి?

ఉ॥ ఇట్టులదేశదేశముల • నెంచఁజకో కమునింద్యమైన వై
వట్టివయేన్నితర్కములఁ • బాల్కని రామకథా తేజముల్

ఆనం—(మందస్మితముగ) నీ యాక్షేపణములన్నియు లోకమువేకాని నీవికావుగదా! అట్లయిన యికనీయిష్టమువచ్చినట్లు కానిమ్ము!

మాన—నాయిష్టమొక్కటేగాదు.

నవీనారు నేనుజెడు • నిర్భరలౌక్యపుభావశత్రులై
జెట్టితనానవాదమును • జేయుఁడి! యిక్కథనా మాక్రియణ.

ఆనం—సరే! అట్లెగానిమ్ము.

మాన—ఇందుఁ బూర్వపక్షభాగమగు నాక్షేపణకోటి నేనేయెత్తుకొను

తో లక్షణానాయకత్వమున నొప్పు సీతయందుగల మొదటితప్పు భర్త్రనువర్తిత్వము, బహిరంగ సంచరణోద్దేశ్యము. ఇది సతీధర్మమైకూడనా! కూడదా! యనుటకు

శ్లో॥ స్మరోపహతమప్యప్రాప్య వాంఛంతి పురుషాంతరమ్
నార్యస్సర్వాస్స్వభావేన నోచ్యంతేహ్యామలాశయాః ॥
ఇత్యాదిస్మృత్యర్థములచే,

మ॥ తనవాథుండతి శీల, భాగ్య, కుల, వి • ద్యా, దాన, సౌందర్య, యౌవన, ధైర్య, రభావ, బాహుబల, స • ద్వ్యాపార, సత్త్వాదులందున, భూ ప్రభుఁ గాం మఁ గాక, మదిన • న్యన్యోంద వాంఛించుచుండును నైజంబుగ, గానస్త్రీ, హృదిసియె • ట్లు న్నమ్మరాదెప్పుడున్.

అందుచేత

గీ. అతివయెట్టిదైన • నంతఃపురంబున
నుండనొప్పనట్లు • లుండకున్న
నవ్యమైన యన్య • నైజంపుమనసుతోఁ
జూడనగును జూచి • చూరుకొనును.

ఇత్యాది సందర ములచేత సీత—(అర్ధోక్తిలో)

మదనమాలిని—(వారించి) ఇదిగో! సీతవిషయమట్లుంచి నామనవి రొయిటాలకించెదరా?

మాన—ఏమది !

మదనమాలిని—గీ॥ అతివయెట్టిదైన • నంతఃపురంబున
నుండనొప్పనట్లు • లుండకున్న
నవ్యమైన యన్య • నైజంపుమనసుతోఁ
జూడనగును జూచి • చూరుకొనును.

అనియంటిరా ?

మాన—ఔను.

మదనమాలిని—ఆయభిప్రాయము లు రెండు నెప్పుడుఁగూడవు.

మాన—ఎందుచే?

మదనమాలిని—

చం॥ పరపురుషాభిలాష కుల • భామలకెందును గల్గదద్దియుం
దరుణులకుంజనించినను • దప్పకజారుని గూడకుండరీ
ధరణిని జారకాములు • దార్ఢ్యము డంపఁగడంగుచెల్ల యా
సురకరిబట్టికట్టుటయు • సూక్ష్మసరోరుహతంతుసంతతిన్.

[వి. మద. మాన. చరిత్ర. ప్ర. సం.]

మాన—అట్లనా ?

మదనమాలిని—ఔను.

మ॥ పరలోకాదులకుం భయంపడుచు స • దా మాళిరోరత్నముల్
పరుఁగూడంగఁదలంపకుండెదరు పో! • ప్రఖ్యాతిపోనంచు నీ
ధరణింగామిని జారుఁగూడఁగడఁగన్ • దామెంతవారైననూ?
పురుషుల్ వారలతప్పుఁ బట్టుగలరే! • పూఁబోండ్లు సంపాద్యలే !

[వినో. మద. మాన. చరిత్ర]

మాన—ఎట్లు! స్త్రీయందంత పాపభీతియు సైతము నున్నదా ?

మదనమాలిని—ఓహో! ఏమో నూతనముగ నాశ్చర్యపడుచున్నావే!

శ్లో॥ వివాహం తేన మంత్రేణ తంత్రేణ వినయేన చ
వంచయం నరం నార్యః ప్రష్టాధనమపి క్షణాత్.

[వినో. మద. మాన. చరిత్ర. ప్ర. సం.]

ఇత్యాద్యనేక ప్రయుక్తంబగు నార్యవాక్యంబులు మనము వినుటలేదా ?

మాన—(విస్మితముగ) ఆహాహా ! మదనమాలినీ !

ఉ. నిక్కువమేవచించితివి • నిర్మలమానసవాట, నందుచే
నెక్కుడుమెచ్చుకొంటిమది • నెంతయు, కాని, త్వదీయజాతి చెం
పెక్కునను తావిషయ • వృత్తులఁజూడగనిన్ను మాత్ర మే
ఫక్కిగనమ్మనౌఁదగిన • పద్ధతినేనికనుండ కిమ్మహిన్.

ఆనం—(వారించి మానపాలుని స్పృశించుచు) మిత్రమా! ఇదేమిటి?

మాన—ఏమున్నది ?

ఆనం—ఇంకేమున్నది! రామాయణములోఁ బిడుకలాటయును సామ్యముఁ దార్కాణించుచుంటివి.

మాన—(కోపముగ నాతని విదళించి లేచుచు)నీకేమి తెలియు నట్లుండుమా.

ఉ. లలటన్న స్త్రీలె కదుఁ • బృథ్విని యిట్టి సమస్తైనచోఁ
లవనొక్కొ పూరుషుల? • కాయమునన్ రుధిరంబుఁగల్గువాఁ
డే లివంచితుండయెడా! • యెంతయు రక్తము జచ్చిన వాఁ
డాలలి నౌనుగాక యది • యెంతయు నాయెడసాగివచ్చునే ?

(మదనమాలినిఁజూచి) రా ! వినుచుంటివా? (మఱలనానందునితో) ఆనందా !

ఉ. తప్పక దీనికీగృహామె • స్థాయిగనుండెడు నటులింక నే
నెప్పగిదిన్ జరించెదనొ • యేర్పడఁజూడుమ యెంతమాత్రమీ
గొప్పలు సాగనిచ్చెదనె ? • కోమలి దానిభవిష్య మెంత! నూ!
తప్పులె పూరుషుల్బవిని! • తన్వియొకర్తు కె గట్టఁబానొకో !

మదనమాలిని—(ఖిన్నహృదయయై తనలో)

ఉ॥ అయోః యిదేమి కర్మమొకో! • యట్టెయెదో యొకమాటమాటచే
నెయ్యా యో వచింపనిది • యేమి! మహోగ్రత కొప్పి యిప్పు డా
నెయ్యపు కాని సైతమును • నీతివిదూరతఁ జేరి దూఱుచున్
జయ్యన నట్టి వైచినను • జంపెడువాని విధానముండెనే.

ఉ. ఏలిక నేమి నేయఁగల • యెవ్విధి నియ్యధిపాగ్రహోగ్రతన్
మానుపుదాన ! దేననను • మాత్ర మపాత్ర తనాని నానితో!
ఫోనొక కానిపోనిపనిఁ • బూనితొ! నన్నిటు విన్నబుచ్చఁగా
దేనికొకో! విధీ! ననిఁక • దేనఁబ్రవర్తిలఁజేసెదొకోఁదా !

(అనుచు నిర్విణ్ణయై మానపాలుని జూఁచుచుండును)

మాన—(ఆనందునితో) మిత్రమా !

ఉ. జాలమికేల ! నాకేదియొ • సంశయమయ్యెది నేటికిప్పుడీ
బాలవచోమృతామహిమఁ • బాసెను సర్వము నేటినుండి నూ!
యేలలి జాగ్రతన్మెలఁగు • చెట్టుల నేనిఁక నుండనొప్పునో
యాలలినుందునింక, యిసి! • యాడుఁదిపూరుషుమించుటొర్తునే!

రమ్ము. (అనుచు నానందు చేయిఁబట్టుకొని గుంజుకపోఁబోవుచుండును)

మదనమాల—(ఆత్రముగఁజెలితో) ఇదేమే! (అనుచు వారలఁజూపును

చెలి—ఏమోనమ్మా ! (అని పెడమొగముఁబెట్టుచు నొక ప్రక్క బోవును)

మదనమాలిని—(బీభత్సహృదయమున తనలో) అయ్యో ! అయ్యో నిష్కారణ సంచిత మహోగ్ర కోపంబునఁ బోవుచున్నాఁడే యి డేమిచేయనగు ? చివాలున నాతనికడ్డమగుచు మహావినయము హృదయేశ్వరా ! ఒక్కమనవి.

మాన—ఇంకనీమనవికి చనువొసంగను. శీఘ్రము నావలకుఁ జనుము.

ఆనం—(మానపాలుతో) ఇదిగో నామాటొక్కటి వినుము.

మాన—(ఆనందునవైపు దృష్టిమఱల్చును)

ఆనం—స్వరూప మాత్రాబలలగుమాత్రమునే స్త్రీలను నిర్లక్ష్యతఁజూడ జనదు. స్త్రీయనఁగా సర్వసమ యగుఁ బ్రకృతిస్వరూప, పం మూనుచో నెట్టి దిట్ట నట్టేట్లోనర్పఁగల శక్తిగలట్టి దాడఁది. మించుచో నెంతవిరాగు ననురాగునొనర్చి సరాగమున మెలఁ.. గల్గ దాఁటది. ఇప్పుడైనను నీమద మాలి నీవిధముగ బేలగ బ్రాఁ ంచుచున్నప్పుడే యామె ప్రా న మంగీకరించి జాలి వహి పుము ? లేదా చెడెదవు. ఎన్నిభంగు ను జూచినను నీమదనమా లినీ మహారాజ్ఞి మహావిద్వత్పతివ్రతయని మాత్రము రూఢి నమ్ముము. నమ్మక నీచే జేయనగు నదేమియు లేదు. సహధర్మి యందిట్టి యపనమ్మకముఁ గల్గువాఁడు నిరంతరమును విస్పష్టము దుర్వారు దుఃఖభాజనుండగుట నిక్కము. పెక్కేల ?

కం. స్త్రీయే సుఖమునుగూర్చును
స్త్రీయే దుఃఖంబునించు • స్త్రీయేయధిక
శ్శ్రేయాశ్రేయంబులనిడు
స్త్రీయే సంసృతినిముంచు • దేల్చు న్మగుడన్.

ఈ విషయమెప్పటికిని మఱువకుము. నేనిదే పోవుచుంటి. పిద నీయిష్టము. (అనుచు నిష్క్రమించును.)

మాన—(సాలోచనుఁడై యుండును)

మదనమాలిని—(అత్యంతవినయముగ) మనోహరా ! (అనుచు నాథ ముఖము నిరీక్షించుచుండును)

మాన— (ఆలోచనాంత తిరస్కారముగ) ఈ యానందుని మాటల
కేమిలే? (ప్రక్కనున్న మదనమాలిజూచి)

శా॥ ఓసీ! నీవింక చింతనొందకుము! నీ • వొక్కర్తువే స్త్రీవా! యే
స్త్రీసాహస్యము దొడ్డదేయనుచు నీ • దివ్యామలంబౌమన
స్సేసాక్షంబుగజెప్పి యుండెనుగదా! • చింతిల్లనీ కేటికిన్?
నాసాహస్యము నెట్టిదో! కనుమిదో! • తన్వీ! యిదే పోయెదన్.

(అనుచు నిష్క్రమించును.)

[అంతలో నేపథ్యంబున కవాటబంధనధ్వని కల్గగా మదనమాలిని బెదరుతో నలుదిక్కులుఁ బరికించుచుండును.]

చెలి—(ఆత్రముగఁ ప్రవేశించుచు) అమ్మా!

శా॥ ఇంకేమున్నది?

మదనమాలిని—యేమిటేయది!

చెలి—కటా! • యింకేమిటే! నూవె! యీ
వంక ద్వారములెట్లు మూయఁబడెనో! •

మదనమాలిని—ద్వారంబులా!

చెలి—యానందు
శ్శంకన్నీయెడనొంది నీపతియెయీ • వక్షోమాత్రమున్ జాలిరే
వంకన్ లేకిటు జేసిపోయె మన మె • వ్వట్టింక బందీలమే॥
(అనుచు భీభత్సమనమున జేతులు పిసుకుకొను చుండును)

మదనమాలిని—(భీభత్సముగ) ఆఁ! అంతపనే జరిఁగినా! హా! నిష్కల్మ
ష దయనయ్యును నిరంతర కారాగారోపమాంతః పుద్ధగాఁ
గావల వచ్చెనా! విధీ! ఏమిది! సత్యశీలనగు నన్ను సమస్తరాజీ
లోక ప్రచార నిందోపహతను గావించెదో! హా! హా! హా దై
మా! సాటివారలలో నగుబాంట్లకు హేతువగు నాకీతప్పులేని శిక్ష
నేలసంప్రాప్తింపఁజేసితివి!

చెలి—(వారించి) అమ్మా! స్వయంకృతాపరాధమునకు దైవమేమి చేయు?

మదనమాలిని—ఆఁ! ఏమి! స్వయంకృతాపరాధమా? (కోపముగ) ఛీ!
నోరుమూయుము! ప్రస్తాపసందర్భమున నిజము వక్కాణించు
టపరాధమా?

చెలి—నీనిజమేమమ్మా? ఎట్టిపురుషునైనను వంచింపగలట్టి ప్రౌఢత మున్ననే నేనొండు సమ నని గాజులు గలగల లాడించుకొను బైటకురావలె. లేనిచో యథాశీతి ముడుచుకొని మూలఁ బ్రా లాటయే స్త్రీప్రవృత్తి. అట్లుచో నీవెందు నాతీతేలుఁ ప్రౌఢ్వము గల సమ వని బెట్ట ంపుఁ గట్టిండగుఁ బభుముందు నట్టువట్టి బిం ంవు టంకానఁ జెట్టాడితివి? అందునే కిట్టి శాస్త్రి నొనర్చినాఁడు.

మదనమాలిని—అందుకిది శాస్త్రియా?

చెలి—ఔను. ఆతఁడు బలేపక్కాపనిఁ గావించినాఁడు.

మదనమాలిని—నేనంతకంటెఁ బక్కాపనే కావింపఁగల నెఱుంగుదువా!

చెలి—అట్టి తెలివితేటలే యుండుచో నింతవిచారమేల?

మదనమాలిని—నాకట్టి సామర్థ్యము లేకనే యిట్లు విచారించుచుంటి ననుకొంటివా!

చెలి—మఱి దేనికి?

మదనమాలిని—భర్తృవంచనాదోషం వెఱపొందుటచే!

చెలి—(సాక్షేపముగ) ఎట్టెట్టు భర్తృవంచనాదోషంపు వెఱపా? ఆ వెఱ పెట్లున్నను నిపుడు చేయనగు నావంచనా విధానమేదో కొంచె మెఱింగింపఁగలవా?

మదనమాలిని—ఓసిపిచ్చిదానా! ప్రపంచమున నుత్తమమగు ప్రబ గల్గువారల కెవ్వటి కప్పుడే యొప్పిదమగునెత్తుకెత్తు సిద్ధము దోచుచుండును. చూచితివా!

సీ॥ ఏనాడునిర్మల • హృదయంబుఁ జెలువొంద
మదిఁ దోఁచినంతనై • ల్పఱచియుంటి
నానాడునిర్మల • హృదయమే మలినమై
నటులఁ దోఁచఁగఁ జేయు • దమలనొంచు
నేనాడుకర్మ వ • శాన నానిష్కల్మ
షాయితవాక్కురో • షాత్తమయ్యె
నానాడుకర్మ వి • ధానమే కల్మషం
బైనట్లు తోఁపించు • దసతిఁ గాక

గీ॥ యెట్టినాపతి నాయందు • నేమితలఁచె
నొ నాపతియే యందు • నమరినట్లు
హృదయమందుఁ దలంచి వి • భ్రాంతుఁడయెను
నట్టులొనరింపఁగలదాన • నబలఁగాను.

చెలి — అనఁగా!

మదనమాలిని — (వినిపించుకొనక మానసపాలునుద్దేశించి) మనోహరా! నీయాకృతికి ప్రతికృతిఁజేయు సామర్థ్యము నాకు లేకపోలేదు. ఉన్నను ఎట్లుచేయుదు. నేమనిచేయుదు.

మ॥ పతియెబ్భంగి నకృత్యుఁడైనసతి • యైభాసిల్లు నద్దేమి ప
ద్ధతిగా నాతనికృత్యమంతయు నకృ • త్యంబంచు నెంచన్దగున్
సతియేయైన ధవుండు తన్నెటులనీ • మాత్రమున్ బ్రేమవ
ర్జితుఁడై తిట్టినఁ గొట్టినన్ మరియెదేఁ • జేయ న్సహింపన్వలెన్.

చం. అని యిటుధర్మశాస్త్రములు • నాపురఘోషిలుచుండ నేవిధిన్
బనివడి నీదుకృత్యమును • భావ్యముగాని యకృత్యమంచు నె
నమున నెంచనో? మఱికఁ • మార్గముదెయ్యది నానుబంధ ము
క్తిఁ గననొటకిమ్మహిని? • దీనిభరించుట నెట్లు లక్కటా?
(అనుచు విచారమున నుండును)

చెలి — (తనలో) ఈమె తొల్తొల్తఁ బ్రభాతమేఘాడంబరముం బోలె యేమేమో ప్రగల్భతలాడి తుట్టతుద కిప్పుడు తెలువేదియును గానక చింతిలుచున్నది. (ప్రకాశముగ) అమ్మా! మఱలనేమి కతంబునఁ జింతిలుచున్నావు?

మదనమాలిని — (దీనముగ) ఏమియును స్ఫురించుట లేదే!

చెలి — మఱి నీప్రగల్భతంతయు నారంభ సంరంభమే కాని అత్యంతమగు సంబధ్ధసంబధ్ధముగాదను?

మదనమాలిని — (సవిచారసాలోచనములతో) చెలీ!

చం. విధికృత మెట్టులేననుభ • వింపక తప్పదు కాన బుద్ధిఁ బె
న్నిధినగు దేని నాహృదయ • నీరజనిర్మలత హింపక
వ్విధిఁబతి నాయెడ న్దలఁచె • వేగము నవ్వి సంచరింతు స
త్పథమిసుమంతయు న్విడక • భామలజాణ నాననొప్పుచున్.

చెలి—అమ్మా ! నీవేమో ప్రతిన విధంబుగఁ బల్కుచుంటివే కాని నీ భావ మదో బోధపడుట లేదు.

మదనమాలిని—నాభావ మింత మాత్రముననే నీకు బోధపడునా? ఇపుడు నాహృదయమెట్టి కపటనాటక కథారచనోద్యుక్తమై యెంత సంరంభముగ నెంత వింతగఁ జిత్ర విచిత్ర రంగంబులఁ జిత్రించుచున్నదో నీవేమెఱుంగుదువు ?

సీ॥ రతివాంఛఁ జెలరేగి • రతనొయ్యారతనీఁగి
దేనందు నానంద • మాననొప్పఁ
గులుకుతోఁ, జెలువుతో • వలులందు వలులొంది
దేనందు నానంద • మానననొప్పఁ
దనివోవఁ దనువోవు • ఘనతరాలింగ త
దేనందు నానంద • ననొప్పఁ
గొట్టానఁ గొట్టాడి • బిట్టానఁ జిట్టాడి
దేనందు నానంద • మానననొప్ప
గీ॥ న సర్వైహికాంక సం • ఘట్టఘట్టి
తా సుఖ సంగ మావాప్తి • నమరుచుండు
జా ంబంధమునకన్న • జగతిమిన్న
మార్గమున్నదే, కామినీ • మణులకెందు॥

లి—(విస్మితముగ) అమ్మా ! నీమహాపవిత్ర హృదయసాగరంబున నిట్టి యూ చనా త ంగంబు లభంగ భంగురంబులుగాఁ బొంగి పొరలుచున్నవేమి ? ఐనను నీ కామార్గ మెట్లు లభ్యము ?

మదనమాలిని—ఓసి పిచ్చిదానా !

సీ॥ ఏసర్వసుఖములఁ • కెలనాస్పదంబౌచు
నేవృత్తి రహిఁ జెందు • నేరికైన
నేసర్వపుణ్యా ఫ • లీసమూహ్వాయ మొప్పి
యెది దివి ముఖ్యమా • నేరికైన
నేసర్వశృతిసార • మై సౌఖ్యసాగరం
బై యేది స్తుత్యమా • నేరికైన

నేసర్వవిధమనో • ల్లాసినీత్వశేఁజెంము
చేదిడు నానంద • మేరికైన
గీ॥ నట్టి వ భిచార జన్యమే • యవ్యయుఁగు
నవ్వ ్రంగార నాయకీ • నాయకులకు
శక మే నుతింపఁగ నదే • సంతతంబు
స్వీ పతియందుఁ గనిసంత • సించుదాన॥
చెలి—(సాక్షేపముగ) ఓసి చాదస్తురాలా ! సీఁయపతి యందిప్పుడు కనుచున్న వ్యభిచారజన్యంబగు సంతసంబు న్న వేఱుగాఁ గనదగు నదేమున్నది ?
మదనమాలిని—ఓసీ ! నీవేచాదస్తురాం(డలలోకెల్లఁ (బ(పథమురాలవు.
చెలి—ఎట్లు ?
మదనమాలిని—ఇంతవరకును నీకసలు వ్యభిచార శబ్దా మేదో తెలియదు
చెలి—నీవు చెపుము ?
మదనమాలిని—స్వీయపతియందు జన్యమగు సంతసము ఆభార్యలగు వారలకు స్వాచార ధర్మంబుకాని, వ భిచారజన్యంబుకాదు. వ్యభిచారశబ్ద జన్యంబగు నర్థము అంకు. అ ట్టియ మన్యాభిసారికల యందొప్పు, నేనుమాత్ర మట్లుగాక స్వీయాభిసారికనై నాసతీత్వ మున కెట్టి లోటుఁ గలిగింపకనే తద మనుభవింప నిశ్చయిం చితి.
చెలి—బాగనేయున్నదికాని యిది పొసఁగుటెట్లు ?
మదనమాలిని—దీని విధాన (ప్రకరణమంతయు నామనసు నందప్పుడ విధించియుంచితి.
చెలి—ఏమని ?
మదనమాలిని—నావ ర్తమాన వృత్తాంతమును నానిశ్చయంపు భావివిధా నమును నె న నాచెల్లెలగు మదనవతికి, నాభ ర్త యొుకనే యొకపువ్వ ండుక గర్భితె లేఖ ముఖంబునఁ దెలియఁజేసెద అందుమీాద మదనవతి పురుష్మవేషధారిణియై యీావసుమాన నగరముఁ (బవేశించి సత్ర్పవ ర్తనమున నానాథుని చెల్మిగాంచి తదను(గహంబున యీాసౌధాంతర సామీాప్య నిష్కుటంబ

నొక నివాస యోగ్యంబగు గృహముఁ దనకై నిర్మించుకొని
యందుండి భూగర్భితి రహస్యద్వార మొండు నిట కేర్పరచును.
పిదప నెట్టెట్టి చాతుర్యక్రియ లొప్పారుచుండునో, మున్ముందు
నీవే చూచి గ్రహింపఁగలవు.

చెలి—(సంభ్రమాశ్చర్యములతో) అమ్మ! అమ్మ! ఎంతగడుసుదాన
వమ్మ! నే నేమోయనుకొంటిఁ గాని యెంతలో నెంతయూహా
పోహములుఁ గలజాణవైతివి?

ఆ॥ మొదట మొదటనెంత • ముగుదుగా జెలఁగితో
యంతకన్నజాణ • వైతివిపుడు
బాలవైన విబుధ • జాలమందున నీదు
ప్రతిభయెల్ల మెప్పు • రాణగాంచు॥

మదనమాలిని— ఐనచో నాయూహ నీకుచాలగా నచ్చినదే కదటే?

చెలి— ఆతురముగ నచ్చినదిగాని. నీవసలు చలచిత్తవు. అందుచేత నీ
విప్పుడింతగా యూహించి చూపింప నిశ్చయించిన నీచాతుర
పోహణతంతయు సాక్రియఁజూపెట్టుదో లేదో యని సంశ
యముగ నున్నది. ఇదిగో నీహస్త మీహస్తమందుఁ జేర్చి నే నీకా
ర్యముఁ దప్పకొనర్చెదనని ప్రామాణికమొన న గాని నీయిట్టి
కృతనిశ్చయమును నేను నమ్మఁజాల.

మదనమాలిని—(సుస్మితముగ) ఓసిపిచ్చిదానా! అట్లే ప్రామాణికమొన
ర్చెద నిదుగో పట్టుము. (అనుచు దానిచేతులోఁ దనచేయినిడి)

ఉ॥ ఎన్నివిధాలను న్నవాంత • రేంగిత రంగిత రంజితాన, నా
చిన్నియుపుంగుఁ జెల్లికిఁక • జిత్రతజిత్రితపుం బత్రచే
నున్న కథాంశమెల్లఁ గను • నున్న నవీన విధానమెల్లయుఁ
గన్ననఁ జేర్చుదాన విని • కన్నలు మిన్నగనెన్న నన్నెదన్॥

ఇదియెల్లను సత్యము. సత ము. స ము.

(అనునంతలో నవనికజారును)

ఇది ద్వితీయాంకము.

— ✱ —



# సతీశృంగారవతి.

## తృతీయాంకము.



ప్రదేశము—మానపాలునికోర్టు.

[మానపాలుఁడును మంత్రియు నానందుఁడును శాస్త్రియు నుచితపద్ధతి సభ నలంకరించియుందురు.]

మాన—(మంత్రినిజూచి) నీకీదినము గతదినసంబంధపు వ్యవహారశేష మేమి యునుండదా?

మంత్రి—ప్రభూ! ఎంతమాటయనుచుంటివి?

మాన—(విస్మయముగ) అదేమి?

మంత్రి—మహీపాలతిలకమా! నీకీవిస్మయమేల?

గీ॥ పరధన పరదారాసక్త • నిరతు లెవని
రాజ్యమున నుందురో య • రాజుసభకు
నింతవింతలౌ తగవుల • నతఁ డెరిఁగి
వచ్చుచుండు నెప్పుడుఁ దీఱు • పాటు లేక.

అంతియేగాని మనరాజ్యమునందు నెవ్వియు నింతవరకును జరిఁగి యుండలేదు. కాలవైపరీత్యముగల్గుచో నింకముందేమో చెప్పఁజాలను.

శాస్త్రి—(వారించి) ఎన్ని కాలవైపరీత్యములు గల్గిన నీకముందేమేమి యీభూపాలుర చండశాసిత ధరుపాఁన మందట్టి విచార మనవసరము. ఆనందా! నీయభిప్రాయమేమి? (అనునంతలో)

(రంగమున నొకపెట్టెతో దొంగ, భటుఁడుఁ ప్రవేశము)

భటు—(దొంగనునెట్టుచు) గాడ్దె! నోర్మూసుకోని ప్రభువుగారొద్దకుఁ బద! (దొంగనెత్తిపైపెట్టె క్రిందఁ బడఁగా వానిని కొట్టుచు) ముం దుదీనె త్తినెత్తిన బెట్టుకో.

దొంగ—(పెట్టె నెత్తుకొనుచు) ఏమోయి మహాదర్పం జూపిస్తుండావే! నేనెట్లయిన నా రాజు పాదాల్మీదబడి తప్పించుకుంటా. అప్పుడేమిం చేస్తావోయ్?

భటు—ఇంక నీవీలోకాన్ని తప్పించుకోవాల్సిందే!

దొంగ—అంటె?

భటు—ఓ రెధవా! చచ్చి మన్నుకావడంరా!

దొంగ—మన్నుకావడం అంటె? నన్ను చంపి పూడ్చేస్తాడేంటి?

భటు—పూడ్చేయడూ! నిల్వా నురితీయిస్తాడు.

దొంగ—నిన్నా? నన్నా?

భటు—ఆ! (ఈడ్చి చెంపపై కొట్టుచు) అంత కొవ్వెక్కిందంట్రా!

దొంగ—((కిందఁబడిపోవుచు నుచ్చస్వరంబున) ఓరినీతాడుదెగ!

భటు—ఏదీ మళ్ళా నోరెత్తు? (అనుచు నొడినుండి కత్తిఁదీయుచుండును)

దొంగ—ఇదుగో మ కొట్టావంటే మర్యాద దక్కదు జాగ్రత!

భటు—ఏంచేస్తావోయి

దొంగ—ఏల్నోరికి చెప్తా.

భటు—ఏంచెప్తావ్?

దొంగ—నీథైప్యానికేల్నోర్కే చెప్పాలా! నీగుడ్లు పీకించటానాక్కు మాత్తాకు చెప్తే చాల్దూ!

నటు—(సాలోచనముగా) ఏందీమాట! ఏల్నోరంటె ఏల్నోర్సరె. నా గుడ్లు పీకించే యా గుమాస్తా యెవరు? (అనుచు దనలో నాలోచన మభినయించుచుండును)

దొంగ—(ఉలుకుపాటున తనలో) అరరే ఎంతపొరపాట్బడ్డి? ఆమణి మంతగుమాత్తాగారెంతో బతింవిలాడి బతింవిలాడి ఎన్నో బుద్దు ల్చెప్పి యీపెట్టిస్తే సరె ఆయన్చెప్పినట్టె దొంగాన్నె ఎట్లా నటించాల్నో అట్లా యింతవరక్కు తప్పకుండా నటించా. బాగా నేవుంది. ఆఖరక్కు ఈడకొచ్చేయాల్కి ఆగుమత్తానుండానే! (నోరుమూసుకొనుచు) ఇంకానయం. గాచారం మంచిది. ఆయే ల్నోరి పేరింకా గ్యాపకం రాలె. వచ్చినట్టయితే కొంపముసె ట్టుగా ఆయన్పేరూ బైటపెట్టేవాణ్ణే. ఎప్పుడేస్పిన దొంగితన

ఈదొంగతనం. ఏందో కాలకర్మవశాన కడుపులోకి గంజిలేక తిరిగేవాణ్ణి. అట్లాగె తిరక్క ఈఅడ్డం వైనవాళ్ళచేతుల్లో తన్నుల్తింటాని కొవ్వుకొన్న దొంగతనంగాని ఏంవుందిమటి. ఒకాల నిజంగా చెయ్యాలనుకుంటేమాత్రం దానిలోవుండే మామ్మరాస్యాలందర్కీ తెలిసేడుస్తె? దాన్నుంపతెగలే పాడుదొంగతనం. ఈకానేపెట్లాగో వోర్చుకుంటినా నాదైద్రం అంతా తీరిందన్నమాటే. ఆగుమాత్తా చెప్పిందబద్దాం తుందా? పోతేమాత్రంనాకేం, ఆమణిమంతచేటి కాళ్ళమీద నేపడతా. ఆఁ మర్చేపొయ్యా ఆమణిమంతచేటిగారిక్కడి కొస్తారని ఆగుమాత్తాగారే చెప్పారుగా ఇంకేం.

భటు—(చప్పరించుచు) ఊఁ హూఁ ఈయెధవలకు సంఘాలులేవు. పాడు లేవు. ఉంటేమాత్రం గుమాస్తా యెందుకు? ఇదంతా టలాయించటానికేత్నం. అంతే, (ప్ర) ఓరీ నాగుడు ఊడబీకే… గుమాస్తా యెవరో చెప్తావా? పళ్లూడదన్న మం… …దన్న బోవును)




దొంగ—బాబూ! దణ్ణంబెడ్తా తన్నకు త…

భటు—మటి తిన్నంగాఁ జెప్పు.

దొంగ—(తిరస్కారముగా) ఏందోయి నీకు…

భటు—(జనాంతికముగ) అయింది. (వానితో) ఓ… ఖాపెట్టు

దొంగ—నేనెత్తుకోలేను.

భటు—నేనెత్తెనఁ బట్టుకో!

దొంగ—ఎవఁడు మోస్తాఁడు?

భటు—ఆఁ అయిందే! ఇఖ నిన్ను నమ్మరాదు, ఇయ్యుగోపట్టు. (అనుచ నొాడినుండి సంకెళ్లు దీయును)

దొంగ—(ఆశ్చర్యముగ) అదేంది!

భటు—ఏందోలె ట్టు. (వానిచేతులకుఁ దగిలించును)

దొంగ—సంకెలంటే ఇవేన్టయ్యా!

భటు—(పెట్టెను వానినడుముకు బిగించి) ఆఁ ఇవేలేయిఖువడ.

దొంగ—మతైతే దొంగనుబట్టుకోడంతోటే తగిలించాలంటారుగా.

భటు—నాకూ దొరక్క దొరక్క నేఁటి కాలానొక దొంగదొరికి తే కొత్త బిచ్చగాడి(ప్రొద్దెరిఁగ)ది, పద! పద! (వానినెట్టు నంతలోఁ బ్రభు సన్నిధిఁ జేరుదురు)

ఆనం—(శాస్త్రినిజూచుచు) శాస్త్రులుగారూ! అటుచూడండు!

శాస్త్రి—(దొంగనుజూచి) ఇదేమి?

మంత్రి—(భటునిజూచి) ఓరీ! వీఁడెవఁడు! యీపెట్టెయేమి?

భటు—(తలవొగ్గుచు) మహీపాలవరేణ్యులకు జోహారు. వీఁడొక దొంగండి.

మంత్రి—వీనినెక్కడ పట్టుకొంటివి?

భటు—పట్ణంబైట గుట్టలచాటు నొఖపెద్ద గోతిదీసి ఆగోతిలో ఈడీ పెట్టెను బూడ్చుతూ౦టె చప్పునాడఁ బట్టుకుం.

మంత్రి—నీవదెట్లు న్పొట్టఁగట్టితివి?

భటు—అప్పుడు నాకాడ ఫారాతిర్గేవంతు.

మంత్రి—అంతమాత్రమునే గుట్టలచాటునుండువాని నెట్లు గన్పొట్టఁగ తివి?

భటు—ఈడాగుట్టలచాటునుంచి తనపనేదైనా సూస్తారని కొంవాలా అప్పుడప్పుడు బైటకువచ్చి తొంగితొంగి సూస్తూ మ. లోపల కెళ్ళి మొదలెట్టాడు. అదిచూచి ఆఁహాఁ ఇదేందో ందర్భంగా వుందే అని చప్పునఁబోయి పట్టుకుంటి.

రంగ—(పైనఁజూచుచుఁ గాలాడించుచు కూనరాగములు తీయుచుం డును.

మంత్రి—ఁడా తొంగిచూచునప్పుడు నిన్నుచూడలేదా?

భటు—మాచేకొంవాలా, చప్పప్పున యీపెట్టాగోతిలోఁ బడేసి గంద్ర గోళంగా మట్టితోస్తూన్నాఁడు. అంతలోనే నేనమాంతంగాఁబోయి గబాని పట్టుకుంటి.

మంత్రి—వీఁడీ పెటెనట్లు పూడ్చుటకుఁగల కారణమేమో మొదట నెమ్మదిగా నడి తివా?

భటు—అడిగితేయేం. యెంతడిగినా సమాధానంచెప్పక నన్నువదలించు

కొని వెళ్ళాలని యెంతో పెనుగులాడటం మొదలెట్టాడు. ఇంతకు బండాముండా కోడుకును గన్క పట్టిన పట్టువదలకుండా తిన్నంగా యీడ్చుకొచ్చా).

మాన—(వారించి మంత్రితో ఇఁక చాలును దొంగను విచారింపుము.

మంత్రి—చిత్తము (భటునితో) ఓరీ! దొంగ నిటునభిముఖుఁ జేయుము.

భటు—చిత్తము. (దొంగనుజూచి) ఓయబ్బో! వీఁడు సంగీతాలు దీస్తున్నాడండోయి.

మాన—సంగీతాలు! (గద్దింపుగ దొంగతో) ఏయి ఇటుతిన్నఁగజూచి యడుగుదానికి సమాధానముఁ జెప్పుము.

దొంగ—(తుళ్ళిపాటున దిక్కులుచూచుచు) ఏఁందిది?

మంత్రి—(దొంగతో) ఓరీ! ఈభటుఁడు చెప్పుచున్నదంతయు విని యుంటివా?

దొంగ—ఏలొన్నరికి దండాలండీ!

మంత్రి—నీ దండాలటుంచి నేనడుఁగుదానికి ముందు సమాధానముఁ జెప్పుము.

దొంగ—ఏం సమాధానమో సెలవి ండి.

మంత్రి—ఆసొత్తు నీచే నపహరింపఁబడి దని మాభటుఁడు చెప్పుచున్నాఁడు. అందు కంగీకరించెదవా?

దొంగ—(తనలో) ఏంవిటో యీపాడుమాటలు నాకు తోంద్రగా అర్థమేకావు. (అనుచుఁ దలగోకుకొనుచుండును.)

మంత్రి—తొందరగాఁ జెపుము.

దొంగ—( నలో) ఇదెక్కడి తొందరోయి పాడుతోంద్ర

మంత్రి—ఏమిరా? ఒప్పుకుంటివా ?

దొంగ—(తనలో) ఇదేదదో మాయపీడ తొందరొచ్చిందె (ప్ర) ఏలొన్నరల్లా తొందర్చేస్తా రెల్లాంటి. ఏలొన్నర్మందెల్లా చెప్పాలన్నా ఎ. చెప్పాలన్నా ఆపద్ధావతంతా మర్చేపోయ్యానా? మళ్ళా గ్యాపం తెచ్చుకోని చెప్పాల్నా మరోద్దండీ?

మాన—(వారించి మంత్రితో) ఇఁక వీనిప్రశ్నించుట కట్టిపెట్టి ఆ పెట్టె యందుఁగల సొత్తు ఎవరికెసంబంధించినదో విమర్శింపుము.

మంత్రి—చిత్తము (భటునిజూచి) ఓరీ! ఆపెట్టె నిటుదెచ్చివిడఁగొట్టుము

భటు—చిత్తము. (అట్లు చేయును)

మంత్రి—(లేచిపెట్టెను సమీపించిచూచి) మహీపాల వరేణ్యా! ఇవే-యొక రాజరమణునింటఁగల రత్నములని తోఁచుచున్నది.

మాన—(విస్మితముగ లేచి సమీపించుచు) అట్లనా?

మంత్రి—(యొకరత్నముఁదీసి మానపాలునకిచ్చుచు) ఇటుచూడుఁడు!

మాన—(అందుకొని పరిశీలించుచు సంతసముగ) ఆహాహా! ఎంత విలుగల రత్నంబులివ్వి?

మంత్రి—(పరిశీలించుచు నందుఁగలచీటిఁజూచి) "రత్నవర్తకమణిమంత' (అని చదువుచుండును)

శాస్త్రి—(మంత్రినిజూచి) కొంపఁదీసి రత్నవర్తకమణిమంత యనున్నారేమండోయి?

మంత్రి—అట్టిపేరుతోఁ బ్రతిరత్నమునకు-దానికి చీట్లంటింపఁబడి యున్నవి.

శాస్త్రి—(ఆనందుఁజూచి) ఆనందా! ఇఁకఁ గొంప మునిగిందన్నమాటే!

ఆనం—(వారించుచు) త్వరపడకు.

శాస్త్రి—(క్రమక్రమకోపాభివృద్ధుఁడగుచు) ఏమిత్వరపడకు?
ఆమహానుభావుని రత్నములపహరించిన యీదొంగను మెత్తఁగాఁ జితుకపొడవక వీరుగాఁబట్టి యింకా మొదలకూరుకున్నారు! లేచి రౌద్రమున పండ్లు పటపటలాడఁగా దొంగపైఁబడుచు) రీ ఛండాలుఁడా నిన్ను పిండిపిండిగా నలగఁబొడిచినను పాపమున్నదా?

దొంగ—(భయమున నేలఁగొత్తి) ఈయెన్నవ్రోబాబో? (అనుచు బొజిపోఁబోఁగా భటుఁడు పట్టుకొనును)

ఆనం—(చప్పున లేచి శాస్త్రిని వారించుచు ఇదేమిటయ్యా? ఇటు నింతమందియుండఁగా నీకొక్కని యింతకోపమేల?

శాస్త్రి—(ఆనందు విదళించుకొనుచు) ఓరీ! విశ్వాసఘాతకుఁడా! నిన్నగాక మొన్ననేకదా నీవేమో వేదాంతార్థములు బాగుగా

ము జెప్పెసివాడవని యీాముప్పేటల రత్నహారము నీమెడుగానఁ జెట్టి నది! ఇంతలోనే మఱచితివా?

ఆనం — మఱువలేదు లేరమ్మా? (ఆతనిచేయిఁబట్టుకొని మెల్లఁగా నాసన ముపైఁ జేరును.)

మాన — (మంత్రినిజూచి) ఈయపహరింపఁబడిన సొత్తుగలవారు వీరల చక్కని యెఱుకనేయున్నట్లు స్పష్టమగుచున్నదినుమా? (అనుచు నాసీనుఁడగును)

మంత్రి — ఔను. (అనుచు నాసీనుఁడై యానందుఁజూచి) ఆర్యా! ఈచో రాపహృతముగుఱించి శాస్త్రిగారికి తత్తఱపాటేల?

ఆనం — అమాత్యశేఖరా! మీారారత్నవర్తకమణిమంతుఁగూర్చి యిది వరలో వినియుందురో లేదో కాని యిప్పటికి రమారమి యైదారు మాసములనుండి మనపట్టణమున రత్నవ్యాపారము సేయుచు బీదసాదులఁ గనికరించుచుఁ బ జలచే మణిమణిమంతుఁడు మిగుల భాగ్యవంతుఁడనియు, ధర్మ లుఁడనియుఁ బుణ్యాత్ముఁ డనియు మఱియుఁ బలుతెఱంగులఁ బ్రఖ్యాతిఁగాంచుచున్నాఁడు. ఈతనికింకను నన దేశంబుల వ్యాపార లంబులున్నవట. ఉండినను.

శా॥ విద్వత్పూజక రత్న ర్తక మహా • విద్యుద శఃప్రాభవో
ద్విద్వద్వర్యత సర్వభూతసమ సం • ప్రేమార్ద్ర చిత్తోన్నతిఁ.
విద్వన్మండల మాచునొప్పెడు భవ • త్పృథ్వ్యందునేచేరి స
ద్విద్వద్వర్యులఁగారవించు కతనన్ • విద్వాంసబంధుండయెన్ ॥

అందుచే నాతనికష్టమే మాకష్టముగాఁ బరిగణింపఁబడుచున్నది.

మంత్రి — (శిరము కంపించుచు) ఓహో!

మాన — (మంత్రిఁజూచి) ఇఁకనాలస్యము సేయక ఆమణిమంతుసభకురా నాజ్ఞాపత్రముఁబంపుము.

మంత్రి — చిత్తము. (ఆనందుఁజూచి) ఆతనినివాసమెచ్చట?

ఆనం — మీాయాజ్ఞాపత్ర మొకభటునకిడి పంపుడు. మనభటులలో సైత మాతని నివాసము నాతనియుదంతము నెఱుంగని వారుండరు

మంత్రి — (భటునిజూచి) ఏమిరా? నీవాతని నివాసమెఱుంగుదువా?

భటు — ఎఱుంగుదును, ఈప్రక్క మూడోవీధిలోనే యాతనినివాసః

మంత్రి—సరె. ఈయాజ్ఞాపత్రమాతనికిడి సభకు శీఘ్రముగ నాతని ప్రవేశ పెట్టుము. (అనుచు నాజ్ఞాపత్రమొసంగును)

భటు—చిత్తము. (ఆజ్ఞాపత్రమందు గొని నిష్క్రమించును)

మాన—(మంత్రినిజూచి) ఎప్పుడాతనిదర్శింతునా? యని హృదయము మిగులఁ ద్వరపడుచున్నదిసుమా?

మంత్రి—ఈచోరావృత్తముఁగుఱించి యాతనిచే నెట్టి విన్నపపత్రము మనయొద్దకు రాకుండుటచూడఁగా నాకు మిక్కిలాశ్చర్యమగుచున్నది.

శాస్త్రి—మీకాశ్చర్య మగుచున్నదేమోకాని మాకేమియు లేదు.

మంత్రి—ఎందుచే?

శాస్త్రి—ఇట్టి ముప్పిరత్నము లా భూలోక కుబేరునకు ఆకలిముగ కర్ణునకు ఒకలెక్కా?

(అంతలో భటునితో మణిమంతుఁడు ప్రవేశము)

దొంగ—(మణిమంతునిజూచి యత్యానందమునఁ దనలో) అమ్మయో రానేవచ్చినాడమ్మో! (ప్ర) ఏమండోయి! ఈ ంతా నంచంపు తింటున్నారు. ఎల్లోరికి దండాలుదండాలు రచ్చించండి రచ్చించండి. (మణిమంతుని పాదములపైఁబడును)

మణి—(భటునిజూచి) ఇతఁడేనా చోరుఁడు?

భటు—చిత్తమండి

మణి—(దొంగతో) ఓరీ! నీకువచ్చిన భయమేమియులేదు. అవలకుఁ బొమ్మి.

మాన—(ఆనందముతో) ఆవచ్చువాఁడే మణిమంతుఁడనువాడు కాబోలు!

ఆనం—(శిరఃకంపముఁ జేయుచుండఁగా)

శాస్త్రి—(ఆత్రముగ) ఔనౌను.

మాన—(జనాంతికముగ ఆహా! ఏమాతని శాంతరసవచనములు?

మంత్రి—(భటునిజూచి) ఏరేనా మణిమంత శ్రేష్ఠియనువారు.

భటు—ఔ నీమహానుభావు లేనండి.

మణి—(మహావినయముగ) సభాసదులందఱకును వందనములు. (అను చుఁదలయొగ్గును)

మాన—(సంతసముగఁదనలో) ఆహా! ఏమా వినయ రసప్రదర్శనము!

చ॥ ధనికునియందుఁ బండితుని • దాపు మహాబలవంతు పొంత స
ద్వినయము స్వర్ణ సౌధమున • దింపిన రత్నపుఁదోరణంబలెన్
ఘనమగు సత్ప్రకాశమునఁ • గ్రాలును నంగను వీనియందె నేఁ
గనవయె సర్వరీతులను • క్ష్మాలి వీనికి వీఁడెయీడగున్.

మంత్రి—మణిమంతశ్రేష్ఠి! నీవాయాసన మలంకరింపుము.

మణి—చిత్తము. (అనుచు నాసీనుఁడగును)

మంత్రి—(మణిమంతుఁజూచి) రత్నవర్తక మణిమంతుఁడవనీవేనా?

మణి—ఆఁగానే పిల్చుచుందురు.

మంత్రి—నీవీ నగరమున రత్నవ్యాపారము సేయుచుంటివా?

మణి—చి ము.

మంత్రి—ఎంత విలువవఱకు?

మణి—ఏదో ప్రస్తుతమిచ్చటఁ గొంతవఱకే.

మంత్రి—ఆకొంతకే పరిమితియెంత?

మణి—కొంతయే యేమిటెండు? ఇచ్చటను నేఁబదివేలకోట్ల రూప్యముల విలువకు తక్కువలేకనే వ్యాపారము జఱుగుచున్నది. కానిందు అంతవఱకు నష్టమురాకుండా చక్కగా జఱుగుచున్నమీఁద చూడవచ్చునని ప్రస్తుత మంతటితో విరమించుకొంటి.

మంత్రి—(ఆశ్చర్యముగ మానపాలుఁజూచి) చూచితిరా! ఈతఁడెంత విలువవఱకు వాపారము సేయుచు సామాన్యునివలె నటించుచున్నాఁడు. ఇదంయు నిజమా! అనృతమా? యని నైతము సందియముఁ గల్గుచున్నది.

మాన—(వారించి)

మ. అవునోయీ! యితనొక్క మోసు:నదెసూ? • యా ర్యము ప్పొంగఁగా
రవలుంజెక్కిన డిబొమ్మొ? యనఁగా • రాణించు స్త్రీచిహ్నముల్
నవలో? నవ్యపు ందరీయగు మరు • న్నారీమణీయొక్క శ్వ
శ్రువొ? యంచాసిరిసత్కళ్లొప్పె నితఁడె • ట్లున్నాని సామాన్యుఁడే!

మంత్రి—ఔను. ఇతఁడింత విలువవఱకు వాపారము సేయుట నిశ్చయమే కావచ్చును. కాని ఇంత విలువవఱకు వ్యాపారము సేయు నితండు

తగిన పరివారముతోఁ గూడుకొని జాగ్రతతో మెలంగక మన రాజ్యమున కెన్నఁడు లేని యపకీర్తిఁ దెచ్చుటకుఁ గారణమగుచున్నాఁడు. అందుచే శిక్షాస్మృతి చట్టముననుసరించి యితండు శిక్షకుఁ బాత్రుఁడును ఇప్పటినుండి మనసహాయమువడసి మనకుఁ గప్పముఁ గ వలసినవాఁడునై యుండును.

మాన— శిక్షాస్మృతి చట్టమెట్లున్నను మనము వినికనుచున్న యీతని సన్నడవడికనుబట్టి చూడఁగా శిక్షకేమాత్రముఁ బాత్రుఁడుకాడు.

మంత్రి—(మణిమంతునిజూచి) నీవీపట్నములో నింక నెన్నిదినంబులుందువు?

మణి—అడుఁగుచుంటిరి కాన చెప్పుచున్నాను వినుండు. నాకిచట వ్యాపారము చక్కఁగా జఱుగుచునందు మిక్కిలిలాభమే కన్పట్టుచున్నది. వర్తకమర్మ మొకరితోఁ జెప్పరానిదేయైనను

చం. మనుజుఁడు ప్రాణరక్షణపుఁ • బట్టుననొండె మఱెట్టిపట్టునన్
నినువుగఁబొంకులాడినను • నిష్కృతియుండు ధరామరప్రభూ
జనములయందు సాధువుల • సన్నిధి వెండియు దేవళంబులం
దున ననృతంబులాడు ఖలు • దుర్భరనారకముక్తి యున్నదే!

అందుచే నిక్కమే వక్కాణించుచుంటి వ్యాపారవిషయ మాలాగునుండగా నాకిచ్చటనుండు దినంబులన్నియు బండితగోష్ఠిచే నిండు సంతోషపూరితంబులగుచున్నవి. ఇంతకన్న నాకు కావలసిన దేమున్నది.

గీ॥ అఖిల శాస్త్రపురాణేతి • హాసయుక్త
మైన పండితగోష్ఠిక • న్యంబుడంబు
మీఱి సంతసంబి నున్నె • మేదినందు
నెట్టి మనుజునకైన నె • ప్పట్టునైన.

ఐనను చోరాపహృతముగాని, ఇంకనెట్టి సంకటముగాని తటస్థించకుండునట్లు నామూలధనమును అందుతో నాధర్మపత్నిని నివాసముంచుటకు సర్వజనాభేద్యంబగుఁ బ్రభువుగారి కోటయం దేమూలనైనను గొంత ప్రదేశముఁజూపుఁడు. నచ్చట నొకగృహము నిర్మించుకొని యెన్నిదినంబులైనను నిర్భయముగాఁ గాపురముందు. నీకార్యమంతయుఁ బ్రభువుగారి యాదార మునందు మాదంపతుల యదృష్టమందు నున్నది.

మంత్రి— న. ఈవిషయముఁ బ్రభువుగారే యోచించి చెప్పవలె,

మాన—(మంత్రినిజూచి) ఈయనఘుచారిత్రుఁడు తన ధనదారాసంరక్షణా మై మనయండఁ గోరుచున్నాఁడుగాన నాచే నంగీకరింపఁబడినది.

శాస్త్రి—శుభమస్తు.

ఆనం—(తనలో) ఈవ్యక్తి విషయమంతయు నేమో యనుమానాస్పదముగా నున్నది. ఎన్నివిధములఁ జూచినను విజయదత్తుని కుశాగ్రైల కళలితనియందుట్టి పడుచున్నవి. ఎంతవఱకు నీతని నిజనివాసమెవ్వరుఁ బ్రశ్నింపరు. ఇదేమిపారవశ్యతయో బోధపడదు. అందఱుఁ బారవశ్యమునే మునిఁగి తేలుచున్నారు. కానిమ్ము! ఇపుడు నాకు వచ్చిన యాతురతయేమి?

మంత్రి—(మణిమంతుఁజూచి) వర్తకశిఖామణీ! ప్రభ్వంగీకారమాటచే నీవీ యావరణమందుఁగల యీశాన్యభాగమందలి ప్రదేశములో గృహము నిర్మించుకొని యుండవచ్చుఁగాని నీవ్యాపారమునకును దీనికినిగలిపి యెక్కుడుగాఁ గప్పముఁ గట్టవలసినవాడ వగుదువు.

మణి—మీయిష్టము ననుసరించి యెంతకైనను బద్ధుండను.

మంత్రి—(భటునిజూచి) ఓరీ! నీవాదొంగ నొకవారము దినములవఱకుఁ గొర్రునఁదించి యుంచుము.

దొంగ—(ఆతురముగ) మణిమంతచేటిగారూ! రక్షించండి రక్షించండి!

మణి—(ప్రభువుఁజూచి) స్వామీ! వాఁడుశరణాగతుఁడౌటచే శిక్షించి ప్రయోజనము లేదు. విడఁచిపుచ్చుఁడు. (దొంగనుజేరి) ఓరీ! నీవెప్పుడిట్టిపనులు చేయక ఇదుగో ఈరక్షమమ్ముకొని బ్రతుకుముపొమ్ము.

దొంగ—చిత్తం చిత్తం. (అనుచు నాతఁడి నరత్నముఁ గైకొనును)

మాన—(దొంగనుజూచి) పో! యింకనెన్నఁడు నిట్టిపనులు సేయకుము. (నేపథ్యంబున ఘంటానాదము ధ్వనించగా నాలకించి) అదుగో గంటయైనది. (సభికులఁగలయఁజూచి) మనమీపూట నింతటితో సభవిరమించుదము. (అనుచు లేచును)

మంత్రి
ఆనం (ఏకగ్రీవముగ) చిత్తము.
శాస్త్రి (అనుచునందఱు లేచుచుండఁగా నవనికజాఱును)
మణి

అవనిక లేవఁగా

ప్రదేశము. మదనమాలినీ యంతఃపురము.

మదనమాలిని యాసీనయై గ్రంథమొకదాని నవలోకించుచుండును. చెలి. శయనించియుండును. అంతలో భూగర్భమున చప్పుడగుచుండును.

మదనమాలిని — (చప్పుడునాలకించుచు విస్మయముగ) ఏమిది? చెలీ!
(అంతలో మఱింతచప్పుడుకాఁగా ఆతురముగలేచి చెలినిసమీపించి దానిని తట్టుచు)

శా॥ ఏమే యిచ్చట గబ్గబంచు నిలకంపింపం దొడంగెం జెలీ!
యేమే వైళమ లెమ్ములెమ్మటను నాకేమో భయంబౌచునుం
డేమే యెంతకు లేవవేమి! యయయో? యింకేల నే జాగునీ
కేమైనన్మది మొద్దువాఱెనొ కొంచీ యింకైనను లేవవే!
(అనుచుఁ దాని చేయిఁ బట్టుకొని లేవఁదీసి నిలువఁబెట్టును)

చెలి — (కనులునులుముకొనుచు) ఏమిటమ్మా?

మదనమాలిని — యీచప్పుడేమో యాలకించుము?

చెలి — (ఆలకించి యతిభయంబున తత్తరపడి) అమ్మో? ఈయదురుడేమిటమ్మా? (చేతులు పిసుకుఁగొనుచు) ఇదేమో భూకంపము వలెనున్నదమ్మా?
(అనునంతలో భూగర్భమునుండి పైనున్న తివాసీ యెత్తుకొనుచు మణిమంతుఁడు బైటకువచ్చుచుండును)

మదనమాలిని — (తివాసిపైకి లేచుచుండుటచూచి యాతురముగ) చెలీ పాన్పుక్రిందనున్న నాపిడిబాకుఁ ద్వరగా నిమ్మా.

చెలి — (భయవినయములతో) దేనికమ్మా?

మదనమాలిని — ఇందేమో భూతము వెడలుచున్నది. త్వరగాఁ దీసుకరమ్మా! ఒక్కపోటున దీనిఁజీల్చివైచెద.

చెలి — (తొందరగాఁ దెచ్చియిచ్చును)

మదనమాలిని — (ఆబాకునందుకొనునంతలో)

మణి — (ముసుఁగుగానున్న తివాసీతీసి నిలువఁబడునంతలో)

మదనమాలిని — ఆఁ ఆగుము.

మణి — (త్రుళ్ళిపడును)

మదనమాలిని— ఎవరునీవు?

మణి—(మదనమాలినిఁజూచి చిఱునగవున) సోదరీ! ఈయుత్తరమును జూచుకొనుము. (ఒకయుత్తరము నివ్వఁబోవును)

మదనమాలిని—(ఆశ్చర్యముగ) ఇదేమి? వీఁడెవఁడో నన్ను సోదరీయని సంబోధించుచున్నాఁడే? చెలీ! ఆయుత్తరమేమో యందుకొనుము.

చెలి—నాకుభయమగుచున్నదమ్మా?

మణి—చెలీ! భయంపడకుము. (మదనమాలినిజూచి) సోదరీ! ఏమీ వి భ్రమము?

మదన:— వెవరవు?

మణి—ఇచ్చటకీ విధముగా నెవరిని రా నాజ్ఞాపించితివి?

మదన—(యోచించియాశ్చర్యముగ) మదనవతివా?

మణి—మఱెవ్వరనియీవిభ్రమము?

మదన—నీవు నిజముగ నాసోదరివగు మదనవతివే!

మణి—నిజమునకు మాత్రము మదనవతినే కాని ఇపుడు మాత్రము మణిమంతుఁడను నామాంతరముఁ గలవచ్చున్నరత్నవర్తకుఁడను.

మదన—రత్నవర్తకుఁడవా? మణిమంతుఁడనువాఁడవా? సరె? యిచ్చటకెట్లురాగలితివి?

మణి—నీవీ యుత్తరబున నేమని యెట్లువ్రాసితివో. అట్లగా నన్నివిధంబుల సఫలీకృతనై రాఁగల్గితిని.

మదన—నీయీయాగమమున కెట్లు జననీజనకుల నొప్పించితివి?

మణి—నీవీ యుత్తరమున తెలియపరచినంత సులభముగా నొప్పించ వీలు గాకపోయినను నానిశ్చితా మున నొప్పించి రాఁగల్గితి.

మదన—నీనిశ్చితా మేమి?

మణి—నీ పాణిగ్రహీతయే యిందుమూలకముగా నాపాణిగృహీత కావలెనని.

మదన—అటుపై నాలుగారాదని బోధింపలేదా?

మణి—ఎన్ని బోధించిన నేమి?

గీ॥ వధువుచే నెవ్వఁడిలను బ • ప్రథమమందు
భావమందువరింపగాఁ • బడునొయతఁడె

తనను పరిణయంబాడుచో • ధన్యగాని
యితరమైన తద్వ్యధువు దు • ర్భాగ్యదయగాదె?

మదన—ఔనుగాక. అందుకు జననీ జనకులొప్పవలదా?

మణి—నా నిశ్చయమంతయు విస్పష్టపఱచియుండఁగా వారలొప్పకేమి చేయుదురు?

మదన—నీ నిశ్చయమంతయు నేమనివిస్పష్టపఱచియుంటివి?

మణి—సరె! అదియుఁ జెప్పెద వినుము.

శా॥ నాయందెంతయుఁ బ్రేమలేక నను నం • తంతఁ బడం ద్రోయుచున్
నాయానందమయుండు రోసివిడచీ! • నాసోదరీయు న్గనున్
నాయాబాల్యపు మైత్రివీడి చననీ • నానాథుఁ డామానపా
లాయుష్మంతుఁ డె లేనిచో నప్పుడె స • న్యాసంబె నాపాలగున్.

మదన—నీవు నిశ్చయముగ నానాథునే వరించియుంటివా?

మణి—నిశ్చయముగ నీకొఱకే వరించియుంటి.

మదన—(ఆశ్చర్యముగ) నాకొఱకా?

మణి—ఔను.

మదన—నిశ్చయము.

మణి—నిశ్చయము. మూడుసారులకును. వేయుసారులకును. నీయాజ్ఞానుసారముగ నీ యభిలాషము నెఱవేర్చుటకై నీనాథువరించితి. అట్లు వరింపకున్నచో నా మార్గము జననీజనకుల యొప్పుదలమీఁద లభ్యమగునట్లు కన్పించలేదు. ఎట్లో యిప్పటికన్నియు లభ్యములైనవి. ఇఁక నావరణభావ మట్లుంచి భావికృత్యమేదో బోధింపుము. నీవు నాకుఁ దోఁబుట్టువును, వయోజ్యేష్ఠవును పదంపడి మహారాజ్ఞి వగుటచే నిదే నా నమస్కారము సన్నకయముగఁ గొనుము! (అనుచు మదనమాలిని పాదములపైఁ బడును)

మదన—(మహాసంతోషమున గ్రుచ్చియెత్తుచు) ఆహాహా!

ఉ. సోదరిసోదరీయనెడు • సోదరభావముఁ గల్గినట్టిదే
సోదరియుం బ్రపంచమున • శోధిత చూచినఁ గానుపించునే?
సోదరభావమంతయును • సొంపుగఁ గల్గిన యట్టి నిక్కమా
సోదరివీవె నాకు భళి • సోదరి! నిన్మదిమెచ్చి తెంతయున్.

(బుజ్జగించుచు) అమ్మా! మన హృదయము లెప్పుడిట్లే యుండవలెను.

గీ. ఒక్కతల్లి కడుపునఁ డాఁగి • యొక్కతల్లి
మెసవు నాహారసారంబు • మెసవి ధరణి
నొక్కచో జన్మమంది పెం • పెక్కనంత
నేవరికెవరంచు నన్యంబు • నెంచదగునె?

ఆరీతినుండక నీవుచేసినదంతయు నా కత్యానందమైనది. అమ్మా!

ఉ. సేమమె? తల్లిదండ్రులకు • సేమమె దాదులకెల్లయర్క? జెలుల్
సేమము నొందియుండుదురె? చిత్రము లందొక యప్పుడైన నా
సేమము ముచ్చటించెదరె • చెప్పుము? హంసశుకాది పక్షులా
రామమునందు మోదమున • రాజిలునే? శుభమే సమస్తముర్క.

మణి—(వారించి) సోదరీ! అంతయు శుభమే. ఇఁక నా విచారమువీడి భావికృత్యమేదో బోధింపుము. నా హృదయమందుకై త్వరపడుచున్నది.

మదన—అమ్మా! నీ యీరాక కెంతయో సంతసమేయైనది కాని నీ వచ్చు నిశ్చయము నాకెఱుకసేయక నే వచ్చితివేల? నీవు రాఁబోవు ముందు నాకొక లేఖ వ్రాయుమని యీలేఖ ముఖంబున నీకుఁ దెలియ పఱచితినా లేదా?

మణి—తెలియపఱచినను నేనీకార్యారంభసంరంభంబున నదియెల్లయు మఱచితి. నాయీస్వల్ప నేరము సైరింపఁదగు.

మదన—సైరించు టెట్లున్నను నీవాలాగు నొనర్చుచో నీప్రయత్నమిఁక నుడుంగమని మఱలఁ దెలియఁజేసి యుండెడిదిదా. ఆలాగు నొనర్పమి యిప్రుడీకార్య మెంతముప్పునకు హేతుభూత మగుచున్నదో కంటివా?

మణి—నాకిందున ముప్పేమియుఁ గన్పించుట లేదు.

మదన—ఓసి పిచ్చిదానా!

సీ॥ జననియు జనకుఁడు • మనవారలొటచే
గణితరత్నాదు • లందినావు
సాహసౌదార ముల్ • స్వకస్మృతులొటచేఁ
బ్రజలందు సత్కీర్తిఁ • బడసినావు

జనవశీకరణంబు • ఘనస్త్రైజమకాటచే
క్షితిపాలు వశవర్తి • జేసినావు
పనివారలెల్లను • ధనవశులౌటచే
భాగ్యగర్వమునఁ ద్రోవఁ • బొంకితినావు

గీ॥ కాని నీవిటసేయురా • కలకునొండె
పోకలకునొండె శకమే • పుడమినేరి
కంటఁబడకుండఁ జయింపఁ • గలుగునెల్ల?
చెవులుగోడకున్నట్లుఁ గం • డ్లవనికుండు.

మణి—(వినుఁగుగ) వినచో నిప్పుడీ వనున దేమి?

మదన—వేతేమున్నది! నీయీరాకపోక లెవరికెటుకపడకమున్నె శీఘ్రముగ నింటికేగుము.

మణి—

చం. సరిసరి! బాగుబాగు! చెలి! • సంగతినంతయు విన్నునంటివా?
సరసపుఁ బల్కులో? యివి ని • జంబుగ భీరుతనంపుఁ బల్కులో?
యరయఁగ శకమా డిన? • యాహాహా! సోదరి! యెంతధీర వీ
వరయఁగ నింతఁబెటిటి • వైన యిదేమిటి లేఖచెప్పవే?॥

మదనమాలిని—

శా. ఏమో! యిప్పటికామనస్సటులనా • యూహఁ గల్పించె ని
ద్దీమాటంబుఁ దలంప నెల్లయుఁగడుఁ • హేతుంబయ్యెతోఁచె, నా
కేమే లోపము నిక్కముగ్గనఁగఁ బ్రా • ణేశుండెదో యీజగ
తా మాన్యాంశమునెంచి నన్నిటుల బం • ధనేసె నంతేకదే?

ఉ॥ సేవనచేయనీ? మనకు • చెందినలోపము దేమి నాధుఁడెం
తోసరియైన ప్రేమమున • నొప్పినచాలదె? యిట్టులే మహా
భానురలీల నొప్పెడిని • భావ ముగాదిఁకనల్ల యిప్పుడా
చేసిన యూహ లేమియును • చెల్వ్యగనీవికనింటికేగుమా?

మణి—(ఖిన్న వదనమున దుఃఖము సూచించుచు

మ. అదిగో! సారెకునింటికేగుమని ప • ల్కాడంగ సంభావ్యమే
యొది నాకిల్లొకచోట నన్యముగ! నీ • వే చెప్పు? లేకున్న నీ

యుదియీయాయిల్లనిచూపు? చూచెదను నే • నంతేకఁదే? యిందు నీ
వెదియున్గొనకున్న కన్నలెడనే • నేమంటినో కంటివే?

మదన—(మణిమంతునొద్దకుచేరి బుగించుచు) పిచ్చిదానా! నాయంత
సోదరినీకుండఁగా నీ కంతయు సర మేలః? నీవందుకై యిసుమం
తయు వంతఁజెందకుము ? కొంచెమాశయ్యపైఁ గూర్చొని భావి
కార మూలోచించుకొందను రమ్ము? (అనుచు మణిమం
తుఁ శ పై నాసీనయై చెలిఁజూచి) నీవును భావికార్యమును
గుఱించి ప్రస్తుతాచరణీయమేదియో యోచించుచుండుము.

చెలి—సద్యస్కాల ఫలావాప్త్యంశపుటూహాపోహములకెల్లయు నీవే
సమర్థవు. నావల్ల నదియుఁగాదు. అంతలో విరక్తిఁజూపుటయు
నాచేతఁగాదు. నీవే యోచించుము?

మణి—(మందహాసము సేయుచు) చె ! ఉండుండి బలేమాటవేసినావే?

మదన—(మందహాసముచేసి సాలోచనయై తనలో) ఏమియోచించుటకు
నేమున్నది.

మ. పతిచే నాకిప్పుడెంతమాత్రమును లో • పంబెందు రాకున్న, మ
త్పతియీ చేసిన కృత మేయిఁకను సం • భావ్యంబటంచందఱుఁ
బతులీకృత మె చేయరా? సతులెడఁ • బంతంబుగాఁగట్ట? యీ
గతిగానే ఁగ్రుశింపరే సతులికఁ • గాంతారవాసంబలెఁ.

అందుచే నెక్కుడు గౌరవంబున కాస్పదంబుఁ బరపురుష వీక్షణా
మహాదోషంబున కనాస్పదంబునైయుత్తమోత్తమనుగు నంతఃపురవాసము
స్త్రీలకుండిన నుండుఁగాక. లేనిచో లేకపోవుఁగాక! నిరంతర భావనామనో
పరిశీలనా ప్రవర్తకు సంసారవిధి విధానంబులెల్ల మాని పరస్ప మన
స్స్పర్థాదులచే నైహికసుఖాదుఁ జక్కఁగ ననుభవించ నేరక లేనిపోని
యిట్టికట్టడితనంబుల కొడింగట్టుచు దుఃఖభాజనులగుఁ బురుషులీమహాప్ర
పంచంబున నెందఱోయుందురు. మఱియుఁ దమయం దిసుమంత యపోహ
మారోపించుమాత్రముసే పురుషుల నంతటితో రోసి వారియాసహ్యాము
నకుఁ బాత్రలై వారిబెట్టిదంపు టిట్టికట్టడితనంబుల కోర్వనేరమి వారినెదు
రాడుచు లోకనిందయు మహాదుఃఖముఁ బొందుచు నుభయవంశాపకీర్తి

నిలయులై సర్వసౌఖ్యప్రదాపక సంసారవినాశినులై స్త్రీలు సైతము నీమహా ప్రపంచంబునం దప్ప నెందఱో యుందురు. అట్టి స్త్రీ పురుషులకందఱకు నవిచ్ఛిన్న సౌఖ్యాస్పదంబగు సంసారసుఖ మనుభవించుట కీమదనమాలినీ మానవపాలుర చరిత్రమే మార్గదర్శియౌనట్లు నొక కపటనాటకమాడుచు స్త్రీ సామర్థ్యమిట్టిదని వెల్లడించెదంగాక, ప్రతి స్త్రీ పురుషులకు నానంద దాయినగుదుంగా. (ప్ర) చెలీ!

చెలి—(తనలో) అదుగో మఱలనేమో క్రొత్తపన్నుగడయే పన్నినట్లున్నది. (దగ్గఱకుచేరుచుఁ ప్రకాశముగ) అమ్మా! ఏమి సెలవు?

మదన—మాయిర్వుర ప్రతిరూపములు క్షణమాత్రమున నీచాతుర్యమంతయు వెల్లడియగునట్లొక చిత్రఫలకముపై చిత్రించుము.

చెలి—చిత్రము.

మదన—చిత్రమనుచు నికనిట్లు నిలుచుండుటకూడదు. ఇప్పుడే యీకార్యము పూర్తికావలె.

చెలి—సరే. (అనుచుఁ దగుపరికరములు సిద్ధముచేయుచుండును)

మదన—(మణిమంతుఁజూచి) ఇఁక నీవు లె . (అనుచు మణిమంతు చేయిఁబట్టుకొని యీవలకువచ్చి) ఇదిగో యిప్పుడది మనయిట్టి ప్రతిరూపములఁ జిత్రించుతఱి నీవు నన్నొకముగ్ధమోహనాంగిగా భావించి యొక మహాకాముక పురుషునివలె నాయందు మోహంతరదృష్టులఁ బ్రసరింపఁజేయుచుండవలె.

చెలి—(సంసిద్ధయై) అమ్మా! మీరిక సిద్ధముగనుండుఁడు.

మదన—ఇదిగో సిద్ధమగుచున్నాము సోదరీ! సిద్ధముగనుంటివా?

మణి—నీవుండురీతి నీవుండుము.

మదన—నాయందు కెంతసేపు ఇదిగో! (అనుచు లతయగు నొయ్యారిగా నిలువఁబడును.)

చెలి—(మందహాసము సేయుచు) వాహ్వా!

మణి—(మదనమాలినికి కుడిప్రక్కనుండి వెనుకగా దానియెడమ బుజముపై నొకచేయియు దానికటిలముపై నొకచేయియునుంచి దాని ముఖముఁ బ్రేమంపుదృష్టిని చూచుచుండును.)

చెలి—(వారల ప్రతిరూపములఁ జిత్రించినట్లభినయించి వారలతో) నా పని పూర్తియైనది. యింక మీయిష్టము. (అనుచు నావలకుఁ బోయి కూర్చొని పఠమును దిద్దుచుండును)

మదన—(మణిమంతుతో) అమ్మాయీ! ఇప్పుడిచ్చటకు నాథుఁడువచ్చు సమయమగుచున్నది. ఇంకెంతమాత్ర మాలస్యముగాకుండ శీఘ్రముగ నీ నివాసమునకు నీవేగుము. నీవెనువెంటనే యీచెలినంపుచున్నాను పొమ్ము. ఇఁకనెందుకు నాకపటనాటక మెంతవఱకు సాగనున్నదో అంతవఱకు నిశ్చయముగ సాగనిచ్చెద. నీవందుకై యేమాత్రముఁ జింతింపఁబనిలేదు.

శా॥ ఏనో యీకపటంపు నాటకములో • నెచ్చో కథానాయికన్
నానాథుండును నట్టినాయకుఁడగున్ •
(తాఁజేయుపని నైతముమాని తన్నుజూచు చెలినిజూచి సుస్మితముగ)
నైరాశ్యతన్ జేగఁబో ।
కేసీవిందలి ముఖ్యపాత్రమవె మణిమంతుఁజూచి)
నూ • వేనీవు నిష్టిట్లనే
యై, నాయీపని పూర్తియాపిదపఁ బెం • డ్లందీవునన్బొలెదా.

(అంతలో నేపథ్యంబున దూరముగ ఘంటానాదము ధ్వనించును)

మదన—(ఆలకించి) అదిగో గంటయైనది. ఇఁకనాథుడు సభవిడి యిప్పు వచ్చును. సోదరీ! ఇఁకనీవు శీఘ్రముగఁబొమ్ము.

మణి—తత్తఱపాటుతో భూగర్భమునుండి నిష్క్రమించును)

చెలి—(మదనమాలినొద్దకుచేరి) రాజ్ఞీ! దిద్దుపాటునైతము పూర్తియైన విచూడుము. (అనుచుఁబఠముఁజూపించును)

మదన—(చూచి) బలే! బాగున్నదికాని. ఈ లము శుభ్రపఱఁచి యీరీతి వాసీని యథా తినుంచుము. ఊఁ త్వ గా.

చెలి—(అట్లుచేయఁబిదప)

మదన—ఇదిగో! ఇఁకనీవుమా పెండ్లికాలంబున మాభార్యాభర్తల నిర్వురి ప్రతిరూపములఁగలిపి చిత్రింపఁబడిన యాచిత్రపఠము దెమ్ము. దేనికని వృథాప్రశ్నములిడక నీఁకనుండి నేనెప్పుడేమి యానతిచ్చు

చుందునో అప్పటికప్పుడేయది యకుఁగులమీాద జఱుగుచుండ వలెఁగాని యెంతమాత్రము నాలస్యముకారాదు.

చెలి—చిత్తము. (అనుచు నాపత్రముదెచ్చి యివ్వఁబోగా)

మదన—ఇదిగో దీనిసైతము నీయొద్దనుంచుకొని, యదుగో అనుచు దన చేతిలోనుండు పత్రముసైతము దానిచేతికొసంగి దానిచెవిలో నేమోరహస్యములు చెప్పుచు మానపాలుఁడు వచ్చునట్టిడి యాలోకించి కోపముగ) అటుగో! వారుసైతము వచ్చుచున్నారు. పొమ్ము. దూరముగఁబొమ్ము. (అనుచు దానినావలకు గెంటు చుండును)

మాన— (ప్రవేశించుచు నాశ్చర్యముగ) ఇదేమి?

మదన—(ఉలుకుపాటున వెను కుమరలి యాతిసిగ్గభిముఖయై) మనోహరా! వందనము.

మాన—మనోహరీ! దేనికై నీచెలిని కోపించుచుంటివి.

మదన— ఖిన్నవదనయై తనలో) హాపరమేశ్వరా! ఇప్పుడీమనోహరు ప్రశ్నమునకుఁ బ్రత్యుత్తరమేమొసంగుదు? కృత్రిమకోపము వహించి దానినట్లా నావలకు గెంటితి. ఇఁకకృత్రిమభాషణమెట్లా డనోరాదు? విధీ! నిరంతరసత్యవచోనిరతయు నహర్నిశపతిస్మరణాలంకృత హృదయపంకజయు. నగునే మదనమాలినీ యను దానినే మహాపండిత సందోహభూయిష్ఠంబు భరతఖండంబున సత వచోశీలగ జనింపజేసితివో, ఆమ నమాలిని యాపండిత సం ) హా మసమా పమునట్లు నాభరతఖండంబునవే, ఆసత్యవచోశీలత్వమే తనభర్త దుటనే దూఱముగ వోనాడి యిపుడనృతమాడగడంగినది. మఱల జంకుచున్నది. జంకుచుండియు, మఱల ననృతమాడుటకే కృతనిశ్చయయగుచున్నది. ఇట్టి యీామదన మాలినీ దుష్కృత్యాచరణము లోకహితార్థమైనను మహాపవిత్రమైనదగుఁగాక.

మాన—మనోహరీ! నాయీాస్వల్పప్రశ్నమునకే సదుత్తరమీాయ సందేహించెదవేల?

మదన—సందేహింపఁదగినదైనది సందేహించుచుంటి.

మాన — ఏమది?

మదన — ఏమైనను మీరావిషయముఁ దర్కింపకుఁడు.

మాన — తర్కింపనీయక నే చెప్పరాదా?

మదన — నామనవొకటంగీకరించిన చెప్పఁదగు.

మాన — ఏమామనవి?

మదన — నేనా చెప్పఁబోవు విషయమందెప్పుడె నైర్మల్యమును దమరు తమహృదయమునఁ జొరనీయనని ప్రామాణిక మొనర్పవలె.

మాన — ఎవరు?

మదన — తమరు.

మాన — (కించిత్కోపమున) ఏమీ? నీకొకవిషయమందు నేనుప్రామాణిక మొనర్పవలెనా? (చెలినిజూచి) ఏమే: ఏమీ? సమాచారము!

చెలి — (మదనమాలినిఁ జూచి భయమభినయించుచుండును)

మాన — (ఆశ్చర్యముగ) ఏమీ! విస్మయములు?

మదన — మనోహరా! కోపింపకుము! ఏమైనను సర్వసవిస్తారముఁ దెల్పెద.

మాన — తెల్పుము.

మదన — (తనలో సవిచారముగ) ఇప్పుడేసత్యముగ నసత మాడవలసిన సమయము; ఏమి చేయుదు? నాకునోరాడుట లేదు. దైవమా!

ఉ॥ దేనికో? యింతగాను కదుఁ • దీవ్రభయంబొనగూర్చితో నస
త్యానికిఁగాదె కాలమిది • యందఱు సత్యమెపల్కుచుండిరే!
పోని యసత భాష మన • భూరిభయంబె వహించునట్లున
న్దేనికో చేసి వుసరె • దేనికినన్ గృహాబంధఁ జేయుటల్.

లేక పరీక్షా మిట్లుచేయుచుంటివా కానిమ్ము? నాయొనర్చి చూపఁబోవు నీస్త్రీమూర్ఖ్యము. స్వప్రయోజన కత్యముగాదు. లోకహితార్థమగు సుప్రయోజన కృత్యము. ఇట్టికృత్యమందెట్టి నీవరీక్షలకు లొంగను.

మాన — ప్రేయసీ!

మదన — (మానపాలుఁ జూచును)

మాన — చెప్పెదనని మఱల దేనికీ సంశయము?

మదన—(తనలో ఏమని చెప్పుదును? అసత్యమాడుటకు నోరాడుట లేదు. (చెలినిజూచి) చెలీ! నీవే చెపుము. భయమేమియు లేదు చెపు (మానపాలుఁజూచి) మనోహరా! ఇటనాసీనులుగండు ?

మాన—(ఆసీనుఁడగును)

మదన—(చెలినిజూచి) ఆకథయంతయు నేనును సవిస్తారముగ వినలేదు చెప్పుము. (అనుచు మానపాలుని వెనుక చేరును.)

చెలి—(తనలో ఈమెనాతో ముచ్చటించు నప్పుడున్నంత ధైర్యము నిప్పుడు లేదు. కానిమ్ము నేనే యీపనినంతయుఁ జక్కగ పూర్తి చేసెద. (అనుచు మదనమాలినొద్దకు చేరి వినయముగ అమ్మా! ఇప్పుడైనను శ్రద్ధగ వినుము!

చం॥ ఇది మీ యిర్వురి చిత్రరూప ఫలకం • బిద్దాని నట్లుంచు ? నీ కెదియుఁ భేదముగాక సర్వవిధులం • దీవే యిదౌనంగ భ్రాంతిదమై యెవ్వతో వైశ్యకామినట యీ • దీనందుఁ దద్వైశు గదియంజేరెడు న మద్ధ లెనై • క్రొల్పుండెఁ జిత్రంబు నా

మాన—ఆవై ౦డెవరు ? ఆవైశ్య కామినెవరు ?

చెలి—(లజ్జాభయములు సూచించుచు మిన్నకుండును)

మదన—అడుగుడానికి సమాధానముఁ జెప్పవేమే ?

చెలి—చెప్పుచున్నానమ్మా! ఆవై ౦డొకరత్నవర్తకుఁడఁట. మణిమంతుఁడనువాడఁట. ప్రభువుగా యనుగ్రహమువడసి మనకోట యందే యొక గృహము నిర్మించుకొన్నాడఁట.

మాన—ఆసమాచారమంత నీకెట్లు తెలిసినది.

చెలి—నా చెలికత్తె యొకతె చెప్పినది.

మాన—మఱొక చెలికత్తె యిచ్చట కెట్లు రాగల్గె?

చెలి—ఎట్లు రాఁగల్గు? ఆగవాక్షమునుండి యావణిజుల యుదంతమంతయుఁ జెప్పి నాపఠము నిచ్చినది.

మాన—దానికీపఠ మెట్లు లభించినది?

చెలి—అప్పుడప్పు డదామణిమంతుని భార్యయగు దాని యంతఃపురమున్న కేగుచుండెడిదఁట. అప్పు డామెను చూచునప్పుడెల్లయు రాజ్ఞి యని భ్రమపడుచు గృహబంధయగు రాజ్ఞిపైటకు రావీలు లేదు

గదాయని సమాధానపడుచు నిదొక చిత్రమని యామెను ప్రాధే యపడి రా చిత్రపత్రముసైతముఁ దెచ్చి చూపెదనని యా మెకు వాగ్దత్తముసంగి యామె నొప్పించి యామె భర్తతోఁ గూడుకున్న యా చిత్రపఠము తఁ వేరొండు లేదని యామె యీపఠమునిడఁగా. దీనిగైకొని యత్యాతురముగ నీగవాక్షము నుండి నాకీయుదంతమంతయుఁ జెప్పియిచ్చిపోయినది.

మాన—(తనలో) ఇది చెప్పినదంతయు సత్యముగనే కన్పట్టుచున్నది.

(ప్ర) ఏదాపఠము ? ఆరెండు నిటు తెమ్ము.

చెలి—(అడుఁగులు తడబడునట్లు వచ్చియిచ్చి ప్రక్కకు తొలఁగును)

మాన—(ఆపఠములరెంటిఁ బరికించుచు) ఇది నిజముగా మణిమంతుఁ బఠము. ఇదో నాది. ఇది నారాజ్ఞి. ఇది? వీనిభార్య యా ? ఏమీ యీచిత్రము ! రాజ్ఞీ ! చూచితివా ?

గీ॥ రూపమొండె వేషంబొండె • రూఢిమెరసి
భేద విరహితమ్మై నీకు • వేరుగాక
చెలువుఁగాంచుచు నున్నదీ • చిన్నదిందు
నింతకన్న నాశ్చర్య మెం • దేనిఁ గలదె॥

చూడుము. (అనుచుఁ బఠములఁ జూపఁబోవును.)

మదన— వారించి నేను చూడను.

మాన— ందుచే ?

మదన—ఎందుచేతనో చూడఁ దలంపకే మొదటినుండియు నెంతో కుతూహలపడుచున్న నాచెలినిసైతము నిరసించుచుంటి.

మాన—(సాలోచనముగ) ఓహో ! అదియా కారణము ? రాజ్ఞీ ! యిది పరపురుష సంబంధమనియేనా నీసంశయము ?

మదన—(చిఱునగవున) గుణగ్రహణ పారీణులగుఁ దమకు తెలియ సంశ మేముండు ?

మదన—(మందస్మితము సేయుచు సాక్షేపముగ) ఓసి పిచ్చిదానా ! ఇంత మాత్రమునకే నీసతీత్వమునకు భంగమేమి ?

గీ॥ సతులుసైతము దమరతీ • సదనములను
కృష్ణలీలాది పఠము లీ • క్షించుచుంద్రు

నీవుసైతి మట్లా నీల • నీరదాంగుఁ
జెయిదములన్నిఁ జూడవే • చెంగలించి॥

మదన—మనోహరా ! మీరట్లు నుడివిన నే నేమిచెప్పఁగల ?

గీ॥ సతులకెల్లను స్వపతి వీ • క్షణమునొండె
స్వకమనోదైవ రూప వీ • క్షణమునొండె
ఘనసుధీవరా మరసు వీ • క్షణమునొండె
యొప్పు నితరమందదిగొప్ప • తప్పుగాదె॥

మాన—రా —ఆ॥ తప్పునొప్పునెంచఁ • దనస్వాంత యందొప్పు
స్వపతియందునొప్పఁ • బడునె చెపుమ !
మానహానియొండె • ప్రాణహానియునొండె
స్వపతియాజ్ఞమీఱఁ • జనదుసతికి॥

మదన—ఓహో ! యాజ్ఞయనుచున్నారా ? మీరు దీనిచూడుమనుట
యాజ్ఞాధారకమేయగుచో నింతఁదనుక మిన్నకుందునా ? యిటిండు

మాన—ఇదిగో ! చూడవే పిచ్చిదానా ! (అనుచుబఠములిచ్చుచు)

ఆ॥ ఇ చిత్ర మెప్పు • డీవు నే నేకాదు
పృథ్వినెట్టివారు • వినియుఁగాని
కనియుఁగాని యుండ • రనియె చెప్పఁగవచ్చు
నింతకన్న చిత్ర • మెందుకలదు ?

మదన—(పఠములఁబరిశీలించుచు) నిజముగఁ జిత్రముగనేయున్నది. కాని
చెలీ ! దీనిపేరేమి ? నాపేరేనా ?

చెలి—(చిఱునగవున) పేరుమాత్రము నీపేరుగాదులే, శృంగారవతట.

మదన—(ఆశ్చర్య ముగ ఏమీ ? శృంగారవతియా ?

చెలి—ఔనట.

మదన—ఏమీలోకవిపర్యాసము ?

మాన—ఇందులోకవిపర్యాసమేమున్నది. ?

మదన—లేకేమున్నది? ఒక్క వైశ్యకులాంగన కింతటి సౌందర్యము
నింతటి నామధేయమునా?

మాన—(మందహాసము సేయుచు సాక్షేపముగ) లేక నీవొక్కదానవే
యీప్రపంచమున కంతయు నుట్టిపడివచ్చితివనుకుంటివా?

మదన—ఇంతకుముందు మీరల్లేయనుకొంటిరని నాభావము.

మాన—ఇదిగో నీవు సందువచ్చిన యెత్తిపొడుపుమాటలు సంధించుటకే యత్నించుచుందువుగాని (అర్థోక్తిలో)

మదన—(వారించి) అదిగో నామాట యెత్తిపొడుపు మాటనుచున్నారు. ఎట్టి మాటైన నిందబద్ధ మేమున్నది?

చం॥ వనధిని నీటిబెట్టయును • బత్తుసఖు మునందుఁ జెట్టయుఁ
దనుజులయందు శాంతమును • దాపసులందున గోపభావముఁ
గణికలయందుఁ బ్రేమయును • గాంతలవృద్ధతి నిశ్చితా ముఁ
బనివడికల్గినఁ నిమిష • మాత్రమునే యవియెల్ల వీడెసుఁ.

కాని,

చం॥ ధరపదనైన యాయదనుఁ • దప్పకనాటిన విత్తనం బలెఁ
బురుషుడు పూర్ణయౌవనముఁ • బొందిన యప్పుడు వానిమోహపుం
దెరువగుదృఘుఁదునొక • దివ్యపు జవ్వని కానిపించుచో
నరయుగ నెం కావలయు • నంతయుఁ గాకది రిత్తవోవునే?

మాన—(సుస్మితముగ) ఆహా ప్రేయసీ! నీయుపమానోపమేయముల కెంతయు నెప్పుడు సంతసమే కలుగుచుండుఁగాని,

ఉ॥ యౌవనుఁడైన, నెక్కుడు ధ • నాఢ్యుఁడునైన, మహాబలుండునై
నా, వరసద్వివేకమున • నారయ శోభిలుచుండు పూరుషుం
డేవిధినైన నె యిన • నేకడుచక్కనిదౌచు నేమహా
యౌవనికానిపించినను • నాత్మదలంప డితఃప రంబుగ.

అందుచే నీవావిషయమున నసంశయాత్మవై యుండుము. నేఁ బోయివచ్చెదను. (అనుచు లేచును)

మదన—ఏమో మీదయ కాని అప్పుడే పోయెదరా?

మాన—ఔను నాకావలతొందరపని యున్నది. అందుచే నిప్పుడే పోవలయు కాని ఆపర మెవ్వరిదో వారిది వారికి శీఘ్రముగా బంపి వేయుము.

మదన—మనపరము సైతము వారుకోరియున్నారేమో?

మాన—(నిష్క్రమించుచు)అదియుఁబంపుము. (అనుచునిష్క్రమించును)

మదన—(ఆతఁడు పోయెనా లేదాయని కొంచెమాతఁడు పోవుమార్గము బరికించి కవాటబంధధ్వనికాఁగా ధైర్యముగ నీవలకువచ్చి) చెలీ! ఏదెట్లున్నను బొంకు బొంకుటలో బలే మొనగత్తెతనమునే బొంకితివే.

చెలి—సత్యశీలవగు నీవు జంకి నేను జంకిన కార్యసాఫల్యమెట్లగు ?

మదన—శృంగార తియని సమయస్ఫూర్తిగ చక్కని పేరిడితివి. నీకట్టి పేరెట్లుల ఁచిన దే?

చెలి—మీసహవాస లమే అట్లు తోఁపజేసినది.

మదన—మంచిది. కా , నీవిప్పుడే యీభూగర్భమునుండి నిష్క్ర మించి ప్రచ్ఛన్నముగ నాథుని వెన్నంటి యెప్పటిసమాచార మప్పుడు నాకు తెలియఁ జేయుచుండుము.

చెలి—చిత్తము.

మదన—మఱొకసంగతి.

చెలి—ఏమది?

మదన—ఈయుదంత మంతయు మదనవతికి సైతముఁజెప్పుము. పొమ్ము శీఘ్రముగఁ బొమ్ము.

చెలి—ఇదిగో యిప్పుడే పోవుచున్నాను. (అనుచు భూగర్భమునుండి నిష్క్ర మించుచుండగా

మదన—ఈదా రమెంత రమ యముగ నున్నది. (అనుచు భూగర్భద్వారము ంగిచూచుచుండగా)

(అవనికజారును.)

(వెలుపల)

మాన—(ప్రవేశించుచు) ఎవరిచట?

భటు—(ప్రవేశించి) ప్రభూ! ఏమి సెలవు?

మాన—నాయాజ్ఞయని మంత్రిశేఖరు నిచ్చట శీఘ్రముగఁ బిల్పుకరము .

భటు—చిత్తము. (నిష్క్ర మించును)

మాన—(తనలో) మణిమంతు రత్నాపహారణ దినము మొదలుఁ బ్రచ్ఛన్నముగ నగరమందు వర్తింపవలెనను బుద్ధియిదివరకే వాఁడని

యున్నది. దానికి తగినట్లు మణిమంతుఁ బత్నియు మత్పత్నియు రూపురేఖావిలాసాదుల భేద విరహితులౌట, మిగుల నాశ్చర్యము గ నున్నది. ఈ విషయమందుఁ బ్రత్యక్ష స్వరూపదర్శనమున సంశయము నివృత్తిఁ జేసుకో బుద్ధియు వొడ్డమున్నది.

(మంత్రిరాకడజూచి) ఓహో! వచ్చితివా! మంచిదిరమ్ము.

మంత్రి —(ప్రవేశించి) నన్నిప్పు డిచ్చటకుఁ బిల్పించు టేల?

మాన —మంత్రిసత్తమా! ఏలయని ప్రశ్నించెద వేమి?

శా॥ రాజ్యంబేలు నరేంద్రుఁ డప్పుడు దా • ప్రచ్ఛన్నరూపంబుతో
రాజ్యంబందుఁ జరించుచుణ్ జనులచ • ర్యల్చూచి యెవ్వారలో
పూజుల్ దుష్టులు నెవ్వరో యనుచు స • ద్బుద్ధిన్విచారింపనౌ
"రాజా ంతేనరకంధ్రువం" బనెడు సం • ప్రాచీనలోకో క్తిమై.

మంత్రి —ౘగాక. మనసురక్షితరాజ్యమం దట్టి విచారమనవసరము.

మాన —నాకడ్డు మాట్లాడకుము. మొన్న నేకదా మణిమంతు రత్నాప హారణము జరిగినది. ఇక నేనావిషయమునందు ప్రసక్తుడనై యుండె ద నేవచ్చుదనుక రాజ్యముఁజక్క జూచుచుండుము. పొమ్ము. ఇదినాయాజ్ఞగా భావింపుము.

మంత్రి —చిత్తము (అనుచునిష్క్రమించుచుండగా మానపాలుడు నొక వైపుగ నిష్క్రమించును.)

ఇది తృతీయాంకము.





శ్రీ రస్తు.

# సతీ శృంగారవతి.

## చతుర్థాంకము

ప్రదేశము:—బహిరంగము.

[మానపాలుఁడు ప్రచ్ఛన్న బ్రాహ్మణ వేషమున ప్రవేశము]

మాన—(ప్రవేశించుచు) (తనలో) ఇప్పుడు నేధరింపఁదగిన వేషమునే ధరించితి. కాని ప్రకృత మెచ్చటనుండి పరిశోధనమున కారంభింపఁదగు ?

సీ॥ సర్వవర్ణంబుల • జనులును స్వకులవృ
త్తుల నుందురో లేదొ! • తెల్లఁగనుదొ?
అస్మదీయోద్యోగు • లందఱుం దమకిరీ
తుల నుందురో లేదొ! • తెల్లఁగనుదొ ?
జారచోర్యాది దు • శ్చరణులుఁ దత్కృతిఁ
దొలఁ యుందురో లేదొ! • తెల్లఁగనుఁదొ ?
సతిపతు లనురాగ • యుతులౌచు ధర్మరీ
తులనుందురో లేదొ! • తెల్లఁగనుదొ ?
గీ॥ ఏదియును గాక మణిమంతు • నింటికేగి
దానినే తెల్లఁగాంచుదొ? • దానికేమి ?
యెప్పుడో చూడనగు నిప్పు • డేను కోట
లోని భటుల జాగ్రతఁగనఁ • బూనువాఁడ.

ఇదియే నా ప్రకృతారంభోచితకృత్యము.

(అనుచు నిష్క్రమించును.)

(అవనిక లేవగా)

మదనమాలిని—(ఆసీనయై యేదో గ్రంథ మవలోకించుచుండును.)

మణి—(భూగర్భము నుండి ప్రవేశించుచు) సోదరీ !

మదనమాలిని—(త్రుళ్ళిపాటున వెనుకకు మఱలి) ఏమి విశేషము ?

మణి—గీ॥ నాయకుం డేలోకో మంత్రి • కీయమేయ
రాజ్యభరమెల్ల నిడి తా స్వ • రాజ్యమందు
నెల్లెడలను రహస్యఁబు • లెఱుఁగఁగోరు
నిశ్చయముఁ జేసుకొనెనట • నేఁటిదినము.

మదనమాలిని—(ఆశ్చర్యముగ) అట్లనా ?

చెలి—(అంతలో భూగర్భమునుండి వెలువెడలి ఆతురముగ) అమ్మగారూ !

మదనమాలిని—
మణి— (చెలివైపునకు మఱలుదురు)

చెలి—ఒక బ్రా ఁడిపుడు ప్రభువుగారి యంగుళీయక మానవాలుగఁ జూ చు రాజాజ్ఞయని భటుల నందఱ నెట్లో తప్పించుకొనుచు (మణిమంతుని జూపుచు) ఈ భర్తృదారిక యుద్యానవనంబునఁ బ్రవేశించుచున్నాఁడు. నే నాతని దూరమునుండి పరీక్షించి చూడఁగాఁ దప్పక నా వ్యక్తి ముఖవిలాసాదు లేమి ? వాగ్వైఖరియేమి ? ఇది యది యననేమి సమస్తవిషయంబులును మన మహీపాలునకే పోలియున్నవి. మఱియు నట్టి యంతఃపురోద్యానంబులఁ బ్రవేశించు నంతటి సాహసము శ్రీవారికే తప్ప మఱెవరికుండు ?

మదనమాలిని—(శిరముఁ బంకించుచు) నిశ్చయము. సరే మనమందరము నిప్పుడే వెళ్ళి చూచెదమురండు. (అనుచు లేచి భూగర్భమున నిష్క్రమించుచుండఁగా వరుసగ వారు నట్లే నిష్క్రమించుచుందురు.)

(అవనికజారును)

(అవనిక లేవఁగా)

[ఉద్యానవనమునఁ బ్రచ్ఛన్న వేషుఁడగు మానపాలుఁడు ప్రవేశించుచు]

మాన—(తనలో) ఆహా!

మ॥ ఇదె కాంటోలును మంత్రిపుంగవుఁడు నాఁ • డేర్పాటుఁగావించి న
ట్టిదియా నా మణిమంతుఁజోటు? భళి! యే • తేవప్రకాశించుచు
న్నది? వాహ్వా! ఇది వానిదై నవనమై • నవ్యాకృతినొందె నూ?
అదిరా! ఏమిర! నీదు చాతురి! భళీ! • అర్భ్యం శివం ణీ.

(దిక్కులు పరికించుచు సంతసముగ) ఆహాహా! మిరా మణి మంతా! వైశ్యుడవైనను నీవీ వనమునందు నేర్పాటుఁ గావించిన నవీనప తు లతి శ్లాఘ్యంబులు గదా? ఏదెట్లున్నను ఔరా! ఈ వేదికలఁగా చుచో నాకు మిగుల ముచ టగుచున్నది.

గీ॥ స్వచ్ఛ నవరత్న ఖచి సం • ఛన్నమాచు
రమ్యమై నవ లీల స • రసులనెల్లఁ
జెయిద ముడించి యానంద • మయుఁజేయు
నిందుఁ గల యీ వేదిక • లెందుఁగలవు?

కొంచెమువట కీ రమణీయమగు వేదికపై నుపవిష్టుండ నయ్యెదఁగాక.
(అట నొక వేదికపై నుపవిష్టుఁడై దిక్కులు పరికించుచుఁ బశ్చిమదిశా కాశమువంకఁ జూచి) ఓహో! అప్పుడే ప్రొద్దుగుంకుచున్నట్లున్న దేమి?

గీ॥ వరుసగా నిందు నుద్యాన • వనములెల్ల
వనములందలి కాపరు • లునికినెల్లఁ
జూచుచును వచ్చునంతనే • సూరుఁ డస్త
మించనుండె నేకతమునో • యెఱు పడదు.

(సాలోచనముగ) ఎఱుకపడుట కేమున్నది? ప్రచ్ఛన్న వేషుఁడ నగు నాకిది యెంతయో యుపయుక్తము. ఇఁక నే నిచ్చటనుండి నగరంబుఁ బ్రవేశించి యెంత స్వేచ్ఛవహించి విహరించినను నా యునికి నెట్టివారైన గ్రహింపఁగలరా? కాని యింకను సూర్యుఁ డస్తంగతుఁడు కాలేదు.

సీ॥ రక్తవర్ణప్రభా • రాజితుండై యప
రాద్రిఁ జేరెడు సూర్యుఁ • డచటెయుండెఁ
గిలకిలారావ సం • కలితమై గూండ్లఁ జే
రెడు ఖేచరాళి పై • కెగయుచుండె

వికసిత సుమగంధ • వేద్యమై దిశలఁజే
రెడు గాలి యల్లన • నిచట యుండెఁ
గానలఁ గెంజిగురులొం • దినవోచు మొగ్గల్
విప్పించు మల్లె లా • విధమునుండె
॥ తె॥ ఓరి! యిటి తరుణ • మం దెట్టివారైన
నిచట నొర్రైమ • నింపఁగలరె?
సతికి పతియుఁ బతికి • సతి జోడుగాకున్న
మదనశరము బారిఁ • పడుట కాక.

ఆహా! యీసమయ మెంత యమందానందమయమై చెలువొందు చుండెఁ? (అనుచుఁ గనులు మూసుకొని సుఖస్పర్శ నభినయించుచుండును)

[చాటునఁ గొలఁది విశేషాలంకారముతో శృంగారవతి నేపథ్యంబున మదనమాలిని యను నీచదాసి నేపథ్యంబునఁ జెలియుఁ బ్రవేశించి యీ క్తిని నిరీక్షించుచుందురు]

మదనమాలిని—(చెలితో హాస్యముగ) ఇంక నెంతమాత్రము సంశయము లేదు. తప్పక యీవ క్తి మన ప్రభువే కాని (అనుచు దానిని యొద్దకు చేర్చుకొని దా చెవిలో నేమో చెప్పి) ఇఁకఁ బొమ్ము? (అనుచు దానిని ముందునకు గెంటి తానావలకుఁ బోవును)

చెలి—(రంగమున ప్రవేశించుచు మానపాలుని జూచి కనుబొమలు ముడివైచి) ఈయనోరూ?

మాన—(కనులు తెఱచి దానిఁజూచి) ఎవరు నీవు?

చెలి—నీ వోరువయ్యా!

మాన—నేను బ్రాహ్మణునిగాఁ గన్పించుట లేదా?

చెలి—ఎల్లాకన్పించిన మాకేమి?

మాన—ఏమిలేని దే యెవరని దేనికి ప్రశ్నించితివి?

చెలి—అవన్ని తర్వాతజూతాం. ముందీవనందాటి బైటకు బదండి.

మాన—దేనికి?

చెలి—ఈ వనం వోరిదనుకున్నారు?

మాన—ఎవరిది?

చెలి—ఇది మా సుంగారవతీ విగారి ఉద్యానవనం తెలిసిందా?

మాన—ఐననేమి ?

చెలి—ఏమీలేదు ముందుబైటకు నడవండి ? నిన్నిచ్చటకెవ్వరు రమ్మన్నారు ? ఇల్లావచ్చుటకు నీ కోరు త్తర్విచ్చిరి ?

( నే పథ ంబున )

చె !

చెలి—(ఉలుకుపాటువ) ఓయి !

( నే పథ్యంబున )

ఎచ్చట ?

చెలి—చూడమ్మా ? ఈయనోరో బాంబఁడంట మన వనంలోకొచ్చి కూర్చున్నాఁడు.

( నే పథ్యంబున )

బాంబఁడెవరే ?

చెలి—ఏంవోనమ్మా ?

నే పథ్యంబున)

ఇదిగో ? నే వచ్చి విచారించెదఁగాని నీవిటురా ?

చె —దేనికి ?

(నే పథ్యంబున)

ఈ మల్లెలు చక్కఁగా వికసించినవి కోయుదువుగాని రమ్మ ?

చెలి—అల్లాగా ?

(నే పథ్యంబున)

త్వరగా రమ్ము ?

చెలి—ఇదిగో ! వస్తున్నా (అనుచు నిష్క్రమించును)

మాన—(ఆశ్చర్యముగఁ దనలో) ఏమీ భ్రమ ?

గీ॥ వేషమువనొండె భాషించు • విధమునొండె
తప్ప రూపరేఖాదుల • నొప్పిదముగ
మదనమాలిని నెచ్చెలి • భంగినొచుఁ
గ్రాలుచుండె నీ చెలి యేమి • కారణంబొ ?

మఱియు దీనిభాషణ మొకవిధము గ నకటా వికటముగనున్నది. ఇట్లుండుటకుఁ గతంబేమో బా త్తిగనే స్ఫురించుటలేదు. కారా ?

గీ॥ నాదు దేవికి సరిపోవునంత • నామధేయము
దేవియొక్కతే యెనయుని • తెలియఁబడియెఁ
గాని దాని నెచ్చెలికి నా • కర్త ప్రతిగ
దీని నెచ్చెలి కలదంచుఁ • దెలియదయ్యె.

ఏదెట్లున్నను ఈ శృంగారవతిని మాత్రమిప్పుడె చూచుట తట మగు నట్లున్నది. కానిమ్ము! "పసలో పసి" యను సామ్యముగ మగుడ దీని దర్శించుఁ బ్రయత్నము సేయకయే అప్రయత్నము గ నా తలఁచిన కార్య భాగమంతయు వరుసగ సఫలీకృతమగునను శుభసూచకంబుగ నా శృం గారవతియే ముందుగ దానే నన్నుదర్శించుటకు రానున్నది. ఇదొకం దుకు మంచిదే. అదిగో వచ్చుచున్నట్లిలికిడి యగుచున్నది. (మిక్కిలి సం తస మభినయించి) ఆ హా హా?

గీ॥ వెదకఁబోయిన తీవి యు • పదములందుఁ
జుట్టుకొనినట్లుగా మేలు • చొప్పడంగ
నేడి మదినెంచి దేని పే • ర్కొంపనుంటి
నదియె యప్రయత్నముగ • న దియనుండె.

(సాలోచనముగఁ గనులుమూసి) మనుచుంటి? "అదియె యప్రయ త్నముగ నన్గదియనుండె" అని యంటినా? శివా శివా? మాతృస మానభావ భావిత పరదారుండనగు నా యిట్టి భాషాజన్యదోషంబు శమించుఁగాత.

మదనమాలిని—(విశేష భూషణాద లంకార భూషితయై మానపాలు సమీపించుచు సగర్వముగ) వరునీవు?

మాన—(ఉలుకుపాటున దాసిఁ జూచుచుండును)

మదనమాలిని—అదేమట్లుచూచెదవు?

మాన—(నిట్టూర్పున శిరముఁ గంపించి) ఏమియులేదు నీ పేరేమి? శృం గారవతియా?

మదనమాలిని—(తనలో) నేను మదనమాలినీ యను నామధేయముఁ గలదాన నాటచేఁ గించిద్భేదంబుగఁ జెలువొందు సౌందర్యమాలి యను నామాంతరమునఁ బ్రవర్తిల నెంచితిఁగాని నా నెచ్చె నాకు శృంగారవతియను నామాంతరమిడినది. కానిమ్ము? ఇది

యెల్లయు విధివిధాన వైచిత్ర్యము పదంపడి నిదియు నొక విశేష చాతురా లంకృతగ నేయొప్పారుచున్నది. అందుచే నింకనుండియు నిట్లే వ హరింపఁ బడెదఁగాక.

మాన—ఏమి నీపేరుఁ జెప్పుటకింత దనుక సంశయమేల ?

మదనమాలిని—(తనలో) ఇప్పుడొకచిత్రముఁ గావించెద (ప్ర) స్వామీ ! మీకు నా పేరు శృంగారవతియని యెవరుచెప్పి యుందురా ? యని యోచించుచుంటి,

మాన—ఎవరుచెప్పిననేమి ? నీ పేరదియే కఁదా ?

మదనమాలిని—కాదు.

మాన—మఱి యే పేరున వ్యవహరింపఁబడుచుంటివి ?

మదనమాలిని—(తనలో) మదనమాలిని యను దివ్యనామముఁగల నేను కుత్సితనామమున వ్యవహరింపఁబడ దలంచునపుడు నాయందిది యది యన నేమి ? యెన్ని నామములైనను వ్యవహరింపఁబడఁదగు.

మాన—ఏమా యాలోచనము ?

మదనమాలిని—ఏమియులేదు నాయందు సౌందర మాలిని యను పేరు చెందిఁయుండగా రూపరేఖావయో విలాసా సర్వవిధకళలయందు నన్నుఁబోలి పట్టమహిషి యగు మదనమాలినీదేవి యొప్పుచున్న దని యొక యంతఃపుర పరిచారిక నాకు నిశ్చయముగఁ జెప్పి నా నామధేయముఁ గూర్చి ప్రశ్నింపఁగా నా నిజ నామధేయముఁ జెప్పుటకు సిగ్గిలియో విలాసా మో మఱిదేనికో శృంగారవతి నని చెప్పియుంటి. అంతమా ముందే నా నిజ నామధేయము కప్పఁబడి శృంగారవతియను నామమింత ప్రసిద్ధికెక్కుటకుఁ గత మేమా ? యని యోచించుచుంటి లేక మీ కా పరిచారికయే చెప్పినదా ? (పక్కకు మఱలి చిఱునగవున తనలో) దీనికేమి చెప్పునో ?

మాన—ఔను

మదనమాలిని—(తనలో) ఊఁ హూఁ (ప్ర) సరె ! ఎందుకుగా మీకది చెప్పవలసివచ్చినది.

మూాన—(తనలో) ఇప్పుడేమి సమాధానముఁ జెపుదు? కానిమ్ము?
సత్యమే వచించెద భయమేమి?

మదనమాలిని—ఏమి చెప్పరు?

మూాన—అంత త్వరపడుదువేల? నాయభిలషించు మాఁదనే యదిచెప్పి
నది. కాని దానికేమి యవసరము?

మదనమాలిని—దాని కవసరము లేకున్న పోనిండు! నాపేరునుగురించి
అభిలషించునంత యవసరము మీాకేల కలుఁగవలె?

మూాన—(తనలో) ఇప్పుడేమి సమాధానమున్నది? ఇది మంచిచిక్కుపె
ట్టుచున్నదే? నిజము వచించుచో నాప్రచ్ఛన్నమునకు భంగము.
మఱొకవిధముగా వచించుచో నాసత్యభాషాశీలత్వమునకు
భంగము. ఔరా! ఇది నన్నెంతలో నిరుత్తరుఁ జేయఁజాలినది?
ఎంతజాణ! (దాని పరిశీలించి చూచి) ఆఁ

గీ॥ ఏమి యాచూడ్కి? చూడ్కిలో • నెంత సొగసు?
సొగసులో నెంతగర్వంబు? • చూడఁ జూడ
గౌరవం బెంతయో:దు? శృం • గారభావ
సూచనంబందు నెంతగాఁ • జొప్పడారె?

మదనమాలిని—(మందస్మితముగ) ఏమిస్వామీ?

గీ॥ అడుఁగుదాని ప్రత్యుత్తరం బిడరు పోని?
యేల నన్నిగాదిగ రీ • క్షించుచుంట?
విప్రులంచు నే మీాముందు • వెలయునంత
వెర్రిబాపఁడా? యిదియేమి • వృత్తియయ్య.

మూాన—(తనలో) ఆఁ ఏమీా దీని వాచాగాంభీర్యము? నిజముగా
నారాజ్ఞకీది సర్వవిధముల నెనయౌ ననుట యెల్లయునది ప్రమా
దభాషణము. రూపరేఖావయో విలాసాదులందెనయైననౌను
గాక. తక్కుఁగల విషయంబులందెంతయో భేదంబుగలదు. కంఠ
స్వరంబుసైత మొక్కటైన కానిమ్ము. ఈయొయ్యారము నీకేవి.
యీానిర్లజ్జత యీానిర్భయ గంభీరభాషణము. మొదలగునవి యిసు
మంతయు నారాజ్ఞియందుఁ గలవా?

చం. చనువున నేన చేరినను • జాలఁగఁ గోపము నేనచూపినన్
బ్రణయమునందు నేదొయొక • పద్ధతిచేఁ జెలువొందు కోపమున్
దనుఁగని యల్గునప్పుడును • దానధిక ప్రమదంబుఁ గల్గియుం
డిన నెపుడేని యాలలిని • శీవిగ నాసతి సంచరించునే?

అందులో పరపురుషుండ నగు నాయెదుటనా ? యిట్టి నడవడిక?

మదనమాలిని—స్వామీ ? మీయాలోచనమేమో ? నాక మనుట లేదు. ఆ ఇంకా విషయము బోనిండు ? ఇప్పటికే మీరిట కేతెంచి నిండు తడవైనది. ఇఁక మీరిట నుండరాదు. శీఘ్రముగఁ బొండు .

మాన—ఏమనుచుంటివి ?

మదనమాలిని—శీఘ్రముగఁ బొండనుచుంటి

మాన—నీయాజ్ఞకు నేను లోఁబడవలెనా ?

మదనమాలిని—ఏల లోఁబడరాదు?

మాన—నీకట్టి యధికారమున్నదా ?

మదనమాలిని—ఉన్నది. ఈవనము నాదాటచే నాకిట్టి యధికారమున్నది.

మాన—ప్రభువుగారి యావరణమందుండు వనము నీదగుటెట్లు ?

మదనమాలిని—ఇది మాదంపతులకై విభజింపఁబడుటచే?

మాన—అట్లయిన నీకీ వనమునందే కదా యధికారము ?

మదనమాలిని—నాకింతవరకే చాలును.

మాన—చాలకున్నను నీకింతవరకే. తోయునా?

మదనమాలిని—ఔగాక. నాతో మీకీ వివాదమేల ?

మాన—నన్ను శీఘ్రముగఁ బొమ్మని యాజ్ఞాపించుటచే.

మదనమాలిని—నాయధికారమును నేఁజెల్లించుకొనఁగూడదా ?

మాన—నాయందుమాత్రము కూడదు.

మదనమాలిని—ఎందుచే.

మాన—నాకీసమస్తమునకును సర్వాధికారమున్నది.

మదనమాలిని—మీరు ప్రభువులా ?

మూన—ప్రభువే నాకిట్టి యధికారము స్వయముగ నొసంగినాఁడు. అం
దుననే నేసి వనపాలకుల నందఱ నొప్పించి రాఁగల్గితి.
మదనమాలిని—అందుకు గుఱుతేమి ?
మూన—మానపాల మహీపాలుని నామాంకితమగు నంగుళీయకమే
గుఱుతు.
మదనమాలిని—అదేది.
మూన—ఇదిగో ? (అనుచుఁ దన వ్రేలు జూపును)
మదనమాలిని—(దాని పరిశీలించిచూచుచు మోకాళ్ళపైఁ గూర్చుని
వినయముగ) ఆహాహా ! స్వామీ ? ఈ దీనురాలిమనవి నొక్కటి
చిత్తగించుదురా ?
మూన—(దానిచర్యనెల్లఁ జూచుచు సంతసముగఁ దనలో) ఆహా ?
గీ॥ దీని యందెంత సాహసో • దీప్తికలదో
అంత సరసత్వ భావంబు • నలరియుండె
ఆరె యేమిరా ! దీని ధైర్యంబువినయ
సంపదయును సౌందర్యంబుఁ • జతురతయును.
మదనమాలిని—స్వామీ! యేమో యోచన నభినయించి నామనవిని
బొత్తిగ చిత్తగించుటలేదు.
మూన—నీమనవేమి ?
మదనమాలిని—
శా॥ స్వామీ ? మిమ్ములఁజూడ నాహృదికెదో • సంతోషము న్సంశయం
బేమో విభ్రమమే మొఱ్ఱ మఱియిం • కేమో మహాభక్తి యిం
కేమో మీరొనరించు కార్యమును దర్శింపంగ గోపంబునుం
బ్రామున్ గారణమేమొ? మీరలు నిజ • బ్రహ్మాంశసంభూతులే?
మూన—శా॥ ఏమీ ? నీహృదినిట్టి శంశయభవం బేహేతుచేఁగల్గెన్?
మదనమాలిని. స్వామీ? యాప్రభునంగుళీయకమదేసం హేతుభూతంబునై
యీమీవ్రేల సమస్తభంగులఁ బ్రకాశింపన్ దోడంగెన్ కనన్
మూన. భామా ? యాప్రభుదత్తమయ్యె నిది చెప్పన్లేదనేఁదొల్తనే.
మదనమాలిని.—
ఉ॥ ఐనను వారియంగుళము • నందిదిరొప్పిదమాట సిద్ధమే

కాని తదన్యమానవని • కాయమునం దిదియేరికైననుఁ
మానుగ నిట్టు లొప్పెసినె • మానవనాథుఁడ వీవెకాక యా
మానవనాథు సత్కళలె • బాగుగ మీయెడ నొప్పుచుండెడిన్.

ఇంకను సంశయంబేల? ప్రభూ!

ఉ॥ ఏలభవాదృశుల్ యిటుల • నెంతయు భద్రమువేళ ధారులై
యీ లలినేగుడెంచు టొక్కొ! • యేర్పడఁ జెప్పుడు దీననుఁ భవ
ల్లాలితమిత్రుఁ బత్నిని వి • లాసమనస్క భవద్విలాసముఁ
లాలసఁ గల్గిచూడమది • లాగెడు దాన నిజంబు భూవరా!

మాన—(ఆశ్చర్యముగ దనలో) ఏమీ చిత్రము?

గీ॥ ఎట్లు గ్రహియించె నన్ను మ • న్నె మెఱుంగు
నెంత ప్రౌఢరా యీకాంతు • బంతి జగతి
నంతియేగాక నాయందు • నధిక మోహ
చిత్తయైనట్లు చూపెట్టు • చేష్టనొప్పు.

మదనమాలిని—స్వామీ!

గీ॥ చల్ల కేతెంచి ముంత దాఁ • చంగనేల
యనెడు లోకోక్తి నెపుడైన, వినరొ పోని
యిపుడు వచ్చున్నలై మీర • లిచటకిట్టు
లేగుదెంచ న కారణం • బేమొ చెపుడు.

మాన—(తనలో) ఆహాహా! ఏమీ! దీని సంభాషణమంతయు నొకవిపరీ
తా మునే సూచించుచున్నది.

మదనమాలిని—(దిగ్గున లేచి దిక్కులు తిలకించి) ఇదేమి యింత మంద
మతినైతి. స్వామీ!

చ॥ సరసులటంచు మీయెడల • సద్గఁ దలంపక నందు మీఁ దమి
రయఁగ నామనోధవుని • యాత్మహితాధికులంచు డోఁచగా
జపితి నింతకాలమిక • సాగదువేగమె పొందు నేను మీ
సరసనిదే విధంబు నెక • సక్కెములాడగ బాడిగాదికన్.

లెండు? లేవరేమి?

మాన—(కించిత్కోపముతో బరిహాసముగ) ఎట్లు?

మదనమాలిని — నిండుతడవగుచున్నది. (ఘముగ లేచి పోందు.

మాన — నేనేల లేచిపోవలె.

మదనమాలిని — (మెల్లగ) స్వామీ! ఎవరైన చూచుటకు దురూహల కవకాశముండు.

మాన — (సాక్షేపముగ) ఆహాహా! ఎంత బాగున్నది. నీకట్టిభయ మేయున్న నీవే నీయింటికి చనుము.

మదనమాలిని — మీరిచటనుండగనే వెళ్లుటకు నాకు కాళ్ళాడుట లేదు. పోయెదరా లేదా?

మాన — భళి యీనుడువింకను సొగసుగనున్నది. ఇదిగో

మ॥ తరుణీ! యెంతటి టక్కులాడి తనమున్ • దార్కొన్న నాకేమి నీ
పరుషం బెంత భవిష్యమెంత. నను నీ • వా యాజ్ఞలో బర్చ్యకో
తెరువుం జూచెదు చాలు చాలికను నీ • దివో పలబ్ధి న్మహా
సరసతంబె కసంగనయ్యో నిదెకా • సాధ్వీమ వృత్తిలన్

మదనమాలిని — ఏమీ! నాసాధ్వీత్వము నే యాక్షేపించెదరా?

మాన — లేకున్న నాతో నీకి వివాద మేల?

మదనమాలిని — ఔనౌను. నిజముగా నాదియే బుద్ధిలోపము.

చం॥ పరిమళమాత్రహృద తను • బాల్కొను చూతఫలంబుమాడ్కినుం
దరతరరూపమాత్రము • దార్కొను తావకపై విలాసమున్
బొరపడి సద్విలాసమని • పొంగుచు నంతకు నంతమిమ్ము లన్
సరసులటంచు నెంచితిని • సారకశూన్యులటంచు నెంచ నన్.

మాన — తనలో) ఇది నిజముగ న్ను మోహించినదా! లేనిచో నీ వైఖ మి? కానిమ్ము. దీని స్పష్టార్థ మొకవిధంబుగ విస్పష్టపరచుకొందుంగాక. (ప్ర)

మ॥ రమణీ! సన్నికనాడ బోకిటుల నీ • ప్రస్తావమందొప్పు న
ర్థము నాకేమియు బోధగాకిటుల మం • దప్రజ్ఞనై యుంటి నిం
క యదిన్ స్థైర్యము నొందియుందు నిట బా • గా నీవు నాసీనవై
స్థిమితంబొప్పగ దేని నేనడుగు సం • దేహింప కేమాత్రమున్.
రమ్ము కూర్చొనుము.

(అనుచు దా గూర్చున్న వేదికపై లము జూపును.)

మదనమాల—(ఈషత్ సూచిక మందస్మిత వదనముతో) ఏమీ నన్ను
సైత్రము మీరాస సన నాసీనగమ్మనిదరా! ఎంతబాగు.

చం॥ లలితధరణీరుహంబుగని • లాలసుడయ్యెడి పాంథుకై వసిక
లలి దమరస్లై నాయెడను • లాలసులైన విధంబుదోఁచెడిఁక
బలువిషవహ్నిజాలములఁ • బక్కన గ్రక్కుచు దాన సర్పముం
బలె బహు జాగ్రత స్థలిగి • మత్పతి నన్నును బొంచియుండడే.

మాన—(సాక్షేపముగ) ఆహాహా! నీకు నిజముగ నీపతిభయమున్నదా?
మదనమాలిని—పతిభయము మెండుగనే యున్నది.
మాన—ఇంకేమైన నున్నదా?
మదనమాలిని—ఉన్నది.
మాన—అదేమి?
మదనమాలిని—లోకభయము.
మాన—నాయందలి కామమో?
మదనమాలిని—దాని మీరే గ్రహించుకొనుడు?
మాన—(నిట్టూర్పు నిగుడ్చి) సరే ఇపుడేమి నిశ్చయించుకొంటివి?
మదనమాలిని—మీరిటనెంత శీఘ్రముగ నిష్క్రమించిన యంత మేలని.
మాన—నీకిపుడిదియే మేలనితోచినదా?
మదనమాలిని—ఔను.
మాన—ఐనచో నెట్లు?
మదనమాలిని—ఏమి?
మాన—నాయందు నీకును మిక్కిలి కామమున్నట్లు విస్పష్టమగుచుండ
ని నీకామమేమి చేసుకుందువు?
మదనమాలిని—ఇంకనుండి బంధించుకొనుదు?
మాన—అదినీకుశక్యమే?
మదనమాలిని—కాకున్న చేయునదేమి?
మాన—(తనలో) ఇంకను దీనిహృద్గతి బరీక్షించియే పోయెదఁగాక.
(ప్ర) పిచ్చిదానా! పుట్టినబుద్ధి మంచిగాని చెడుగాని దాని నను
ర్తించుటయే మానవ ధర్మరహస్యము. అదియే నీతి. దాని మీ
ఱుచో లేశమైన సుఖమున్నదా?

గీ॥ ఆత్మబుద్ధిస్సుఖంబను • న వొఱిగి
యుండవో యేమొ • నేఁ జెప్పుచుంటి వినుమ
యెదిమనంబున కిష్టమై • యొసగఁబడునొ
యదియె సరఁసౌఖ్యప్రద • మై రహించు.

మదనమాలిని—ఆహాహా ఇట్టి యధర్మకార్యాచరణంబునకును నీతి శాస్త్రమే కారికయా? ఎంత బాగున్నది స్వామీ?

మానవ—పిచ్చిదానా! సర్వధర్మములకును నీతిశాస్త్రమే కారికయై విరాజిల్లుచున్నది. అందులోనిది ముఖ్యమగు గ్రామ్యధర్మము. ఈగ్రామధర్మము పిపీలికాది బ్రహ్మ పర్యంతము నత్యాదరణీయమను విషయము తెలియంగవా?

మదనమాలిని—ఏమేమి? గ్రామ్యధర మంతటి గొప్పధర్మమా?

శా॥ ఓ బాపండ? యిదేమిధర్మమి యే • యొప్పైన కార్యంబు పో!
యీబుద్ధిన్ద్విజ రియింప వీలెటులు? నూ! • యేనొక్కయిల్లాలుగా
నే! బంధింపఁడె యట్టిచీల్పఁడె! • ప్రియుండే దీనిఁగన్పట్టు చో
"స్త్రీబుద్ధిః ప్రళయాంతకం" బనుట యే • సిద్ధించదేనాయెడన్.

మానవ—ప్రియుండనఁగా భర్తయని యానీయర్థము?

మదనమాలిని—ఔను.

మానవ—నేనో?

మదనమాలిని—ఇప్పుడు మీరును బ్రియులే

మానవ—అట్టిచో నాప్రియుఁడెఱుఁగకుండ నీనూతన ప్రియునందుఁగల యీ ప్రియమును బ్రదర్శించుకొను వీలు లేదా?

మదనమాలిని—ఉన్ననూ ఆస్వేచ్ఛ కలుఁగదు.

మానవ—ఆ స్వేచ్ఛయేమి?

మదనమాలిని—అది నిర్భయప్రియప్రదర్శనము.

మానవ—అటులైన నాయందనుందువా?

మదనమాలిని—దేనికి?

మానవ—అట్లై నీప్రియమును నిర్భయముగఁ బ్రదర్శించుకొన నిచ్చెద.

మదనమాలిని. మీకట్టిసామర్థ్య ముండిన నుండుఁగాక. నేనుమాత్రమగ్నిసాక్షికముగ వివాహమాడిన వాని నన్యాయము సేయఁజాల.

మాన—ఐనచో నీజనించిన ప్రియమేమి కావలె?

మదనమాలిని—దీనిని యెట్లో సమర్థించుకొనవలె.

మాన—ఎట్లు సమ ంచుకుందువు?

మదనమాలిని—నేఁ జెప్పునది లోకవిషయము.

మాన—నీకా సామ ర్థ్యములేదా?

మదనమాలిని—ఒ కమునం దేస్త్రీతన ప్రియమును ప్రదర్శించుకొను సామర్థ్యము లేక యుండు?

మాన—నాకు లోకవిషయమనవసరము.

మదనమాలిని—లోకవిరుద్ధముగ నెవ్వరు జనింపరు.

మాన—నీవిషయమేమి?

మదనమాలిని—నేను నట్టిదాననే.

మాన—ఐనచో మాయిర్వురను సమర్థించుకొనఁగలవా?

మదనమాలిని—(జనాంతికముగ, మందస్మిత వదనయై) నీవు నిజముగ వెర్రిబాపనివలె నున్నావు.

చం. వెలఁదులకెల్ల వేదములు • వేదములొక్కటె కాక శాస్త్రముల్
కలసిసతిత్వమంచు నొక • కట్టడిఁ జేసెనుగాని లేనిచో
వెలఁదులు రోజురోజుఁబడి • వేలకుమించిన పూరుషావళుల్
కలసిరమింపఁజూచినను • గాదనియందురె! కామ్యధామలై.

మాన—(శిరముఁ బంకించి) ఐనచో నిప్పుడేమి నిశ్చయించుకుంటివి?

మదనమాలిని—ఏమి నిశ్చయించుకొనుటకును సతీధర్మమే బాధించుచున్నది.

మాన—(సంతసము తో లేచుచు) మంచిది. నీవింతకుమున్నే రీతి వర్ణించినను, నిన్నా సతీధర్మమావహించుట నాకిప్పుడెను మిక్కిలిసంతోషమైనది. కాని, దేనికో సతీధర్మము బాధించుచున్నదను విచారమును సూచించితివి. ఆవిచారముకూడదు. ఆసతిధర్మము నిన్ను బాధించునది కాదు.

గీ॥ స్త్రీలకెల్లప్పుడును నూ? స • తీత్వమనఁగ
నేమిగానెంచితో! స • నిముడు సర్వ

పుణ్యఫలములఁ బడపడి • ముక్తిపథము
భవ్యమారోగ్యసదశః • ప్రాభవములు.

అందుచే నీకదే శ్రేయఃప్రదమని భావింపుము? దానినే యను వర్తించి సద్వర్తనవగుము? ఇంతకంటె నేఁజెప్పదగు విశేషములేదు. నేనిదే పోవుచుంటి. (అనుచు నిష్క్రమింపఁబోఁగా)

మదనమాలిని—అదిగో యేమో శ్రీరంగనీతులాడి పోఁబోవుచున్నారు. నా సంపూర్ణ మనోహరుఁడవగు నన్నిటులఁబోనిచ్చి నేనిట మనఁగలనా? అదిగో! పోనేపోవుచున్నారు. కాని యెంతమాత్రముఁ బోనీయను.

(అనుచు నాకస్మికము నాతనిపైఁబడి కౌగలించునంతలో అవని కదిగును.)

(అవనికలేవగా. శయ్యాగృహము)
(మానపాలుఁడు బ్రాహ్మణవేషమునే ఆశయ్యయం దాసీనుఁడై యుండును)

మాన—(సంతోషాశ్చర్యములతో తనలో) ఔరా? ఏమీచిత్రము?

ఉ. పౌరులమంచిచెడ్డలను • వారని బాళిరహించు బుద్ధినై
యూరయఁబూనిరానిచట • నారె? యిదేమిటి? నోద మీవణి
క్సారసపత్రనేత్ర నను • గౌఁగిలిఁ జేర్చినయంత ని ·లే
తారసిలంగనయ్యెనహ! • దైవమునోగతి నెన్నశక్యమే?

మదనమాలిని—(అంతలో వెనుకగాఁ బ్రవేశించి యాతనికనులుమూయును)

మాన—(ఉలుకుపాటునదాని హస్తములు స్పృశించి తనలో) ఇదిగో కామాంధకారమను వస్తువు ప్రత్యక్షాకారనిర్దిష్టమై చివుకుకన నాకనులఁ గప్పుచున్నది. (రెండు చేతులతో దవుడుకొనుచు) ఓహో! ఒక్కటేకాదు. ఇవిరెండు. ఈరెండుఁ గరములా? మోహనాకార నవపల్లవా కరములా? ఇందేమున్నది? అగమ్యగోచరమై వెనుకనేమో స్పర్శమాత్ర విషయానందము విరాజిల్లుచున్నది. అదేదో ని యించి వర్ణించుకొనుటకు నోరాడుట లేదు.

(ప్రకాశముగ దేవీ! ఇంకనేనీ శృంగారము భరింపలేను. వదలుము. ముందీ కనులపైఁ గరములు వదలుము.

గీ॥ స్పర్శమాత్రంబునే యెడల్ • జలదరింపఁ
జేష్టలుడిఁ నీసేవయుఁ • జేయునంటి.
నట్టి నన్నేలనింకఁగా • మాంధకార
మందుముంచఁగంగ నిబ్బంగి • నొందుదీవు.

వదలుము. వదలుము. (అనుచుఁ దానెతీయఁబోఁగా)

మదనమాలిని—(ఇంకను అదిమిపెట్టి) నేనెవరనో తెలుసుకొనఁజాలనఁగాని వదలను.

మాన—ఓసి పిచ్చిదానా?

గీ॥ గంధవహుని స్పర్శను భుజం • గంబదెట్లు
తెలుసుకొనఁజాలునో యట్లె • దివ్యపుష్ప
గంధవహవైన నిన్ను నేఁ • గరము నీ భు
జంగునైయేల తెలుసుకోఁ • జాలఁజెపుమ?

(అంతలో నేపథ్యంబున మణిమంతుఁడు)

ఏమే?

మదనమాలిని—(తుళ్ళిపడి చేతులు విడఁదీయును)

మాన—(విస్మయమున మెల్లగ) ఎవరాపిల్చునది?

మదనమాలిని—(మెల్లఁగ) నా పాణిగృహీత.

మాన—వ్యాపారలముపీసి యిపుడు దేనికివచ్చెను?

మదనమాలిని—ఏమో?

(నేపథ్యంబున)

ఏమే! ఏమిచేయుచున్నావు తలుపుఁదీయుము?

మాన—(భీభత్సముతో సంజ్ఞాసూచకముగ) ఇపుడెట్లు?

మదనమాలిని—(మానపాలుని బట్టుకుని మంచము ఒద్దఁ బ్రవేశపెట్టి గాళినఁ గప్పుచుండును)

(మఱల నేపథ్యంబున నెలుగెత్తి)

ఏమే తలుపుఁ దీయవేమి?

మదనమాలిని—ఇదిగో ? వచ్చుచున్నాను. (అనుచుఁ జప్పున నావలకుఁ బోయి మణిమంతునితోఁ బ్రవేశించుచు నాతని ముఖము నిరీక్షించి) నేఁడేలకో విచారముగ నున్నారు గతంబేమి ?

మణి—(దాని బుజముపై చేయివైచి) ప్రేయసీ యేమి చేయుదును ?

చం॥ జనకునియొద్దనుండి కడుఁ • జయ్యన నిన్నునునన్నుఁ గూడ ర
మ్మని యొక యుత్తరంబిపుడు • మార్గణతుల్యత వచ్చెనే కతం
బునో తెలియంగరా దదటు • పోనియుమిప్పుడె పైనమౌదు మై
నను నిపుడొక్క సంగతిఁగ • నంగను మిక్కిలి చింతకల్గెడున్.

మదనమాలిని—ఉత్తరముకంటె యంతచింత్యమగు నాసంగతి యేమై యుండు.

మణి—ఏమై యుండిన లాభమేమి ?

గీ॥ సర్వవిధములఁ దన ప్రాపు • సంఘటించి
చెల్మియొనరించి నా దగుఁ • గల్మిఁ బ్రోఁచు
మానపాల మహీపాలు • నాసతిఁగొన
కేటులఁబోవుదు ననుచుఁ జిం • తించుచుంటి.

మదనమాలిని—శ్రీ వారి యాసతిఁ గొని పోవుట కభ్యంతరమేమి ?

మాన—శ్రీ వారు ప్రచ్ఛన్నులై యీ నగరమున నెచ్చటనో వర్తించుచుండిరఁట. ఇప్పటికి పదిదినములైనను జాడ తెలియుట లేదు. ఇంక నందుకై విచారించి ఫలము లేదు. జనకాజ్ఞ మీరరాదు. ఇప్పు ప్రయాణము కావలె.

మదనమాలిని—(నాశ్చర్యముగ) ఇప్పుడే.

మాన—ఔను.

మదనమాలిని—మఱి ప్రొద్దేది ?

మణి—లేకున్నను బ్రయాణముకావల నదే.

మదనమాలిని—ఈ రాత్రమంతయుఁ బ్రయాణముఁ జేయుటకే నిశ్చయించుకుంటిరా ?

మణి—లేదు. ఈ రాత్రమ తయు నీ న రబాహ్యారామమునఁ గడపి రేపకడ బయలువెడలి పోవుదము ?

మదనమాలిని—సరే మీయిష్టము.

మణి—యింక నాలస్యముకూడదు నేనిప్పుడే పోయి సర్వసిద్ధమై వచ్చెద నీవును జాగొనర్పక సంసిద్ధవై యుండుము? (అని చని నిష్క్రమించును)

మదనమాలిని—(వెంటనంటి తలుపు బిగించివచ్చి మంచపుగోళిని నత్తిమానసపాలునితో) మనోహరా?

మాన—మెల్లఁగ నీ భర్తను బంపితివా?

మదనమాలిని—పంపి మఱలఁ దల్పుఁ బిగించివచ్చితి.

మాన—(నిట్టూర్పున బైటకుఁ జేరుచుఁ దనలో) ఔరౌరా!

ఉ॥ దేవ మహోసుఖంబు జగ • తిన్ రహిఁజెందునో సర్వభంగులన్
దానఁజెలంగఁ గష్టమును • దద్విధివింకను సంశయంబె? యె
ద్దానిని రత్నపుంగనుల • తావని యెన్నికసేయుచుందుమో
దానిని సత్తిగుల్లలకుఁ • దావని చెప్పకెట్లైనఁ దప్పునే?

శా॥ ఔరా! యన్యకులాంగనారతిని యె • ప్పానందమెప్డు న్సుధా
వారాశింబడి యోలలాడుటయె వా • హ్వారే? యటంచెందఱో
దూరాలోచనచేయ మిన్నడెదరే • దుస్సాధ దుర్మార్గ దు
ర్వార ప్రాభవహీనమాన తలనే • భారారగాంచనో.

ఉ॥ ఛీ యెవఁడైనఁ గాముక (• జెందిన స్త్రీయధనంబు సర్వముం
బాయని రోగముందవిలి • పక్కనఁజావని స్వేచ్ఛకల్లు వే
శ్యాయత భోగమే యతని • కారయభోగ్యముకాని యన గృ
హ్యాయత్తమైన దాని రతి • యంతటి నింద్యము దేవ నున్నదే?

సీ॥ ఈమూల నెవరు లే • రామూల నెవరు లే
రని నిశ్చయించి ము • ద్దాడ భయము
వీరు విన్నను నేమి • వారు విన్నను నేమి
యని స్థైర్యమున ముచ్చ • టాడభయము
నెవరు పొంచుండిన • నెవరు యెదురైన
నేమని బిగి • విడఁగభయము
ధైర్యంబుకలదని • దర్పంబుకలదని
యెబ్భంగి స్వేచ్ఛ వ • ర్తింపభయము

గీ॥ నన్ని విధముల గడగడ • లాడుచుండి
భయముఁ జెందంగవలె నన్య • భామరతిని
దైవమా! యిందు సుఖమెంత • దనుకనున్న
వలదు పగవానికిఁ బర • భామపొందు.

స॥ అదిగో! మత్ప్రతివచ్చుచుండె నన న • త్యంతాను కంపంబుతో
యెదిరొమాములను ముండగాఁ జటుకుమం • చే సౌఖ్య వారాశిలో
మది యోలాడెనుఁ బట్టునైన నదిత • ప్పన్నేసి డాఁగన్వలెఁ
హృదయావేదన కల్గఁగా నెవఁడుఁగా • నేత్మోవరుండైనఁగాఁ.

ఛీ ఛీ యీ పరభామారతియంతటి నింద్యవృత్తి యెందునుం గన్పించదు.

మదనమాలిని—(వినయముగ స్వామీ! మీరేమో విచారము సూచించుచున్నారు. మీచారవిషయము నాకు గ్రాహ్యమైనది కాని యేమిచేయుదు? క్షమించుఁడు?

మాన—ఐనచో నేఁడే మీప్రయాణము నిశ్చయమా?

మదనమాలిని—మీరును వినుచునే యుంటిరికఁదా? ఏమిచేయుదు!

గీ॥ జారుఁడెపుడు స్వామి • సముఁడని యెఱుఁగుదు
జారుపొందు సౌఖ్య • సాగరంబ
టంచు నెఱుఁగుదైన • నవనిలో మగనాండ్ర
నస్వతంత్రలట్లు • నల్వ వ్రాసె

మాన—రమణి! నీవు నాకు విశేషించి చెప్పనక్కరలేదు. నీవిషయము నేను బాగుగ నెఱుంగుదు.

ఉ॥ ముద్దవుకావునీవు కడు • ముద్దుగఁ గేళినిఁ దార్చుప్రౌఢవుగా
బద్దుగ నుండుదానవు ని • బద్ధిగ నుదవు నుద్దులాడివై
యొద్దనె యుండుదానవు న • ముద్ద ఁ జేరిన దానవట్టె నీ
యొద్దను నేనుఁ బొందు సుఖ • మొప్పక దుర్విధి దవాఁ జేసెడిఁ.

అందుకు నీవేమి చేయుదువు. కాని నీయందొండుకు నాకు మిక్కిలి యాశ్చర్యము కల్గుచున్నది.

మదనమాలిని—అదేమి?

ద్వైతమతమెంతమాత్రము నాకు నచ్చుటలేదు. ఆహాహా! అద్వైత మెంత యది తీయానందసంధాయకము దాని యందంతయు నొక్కటే, ఫలము నొక్కటే, పాపపుణ్యము లనలేలేవు. కష్టసుఖము లంతకు మున్నే లేవు. అయ్యో! లేకపోవు టేమి! కృత్యములందు పాపపుణ్యనిర్ణయము లేకున్నను అనుభవమునందు కష్టసుఖములు ప్రపంచంబునకు గన్పట్టక పోవు. అందుననే ప్రకృతికంతకును ద్వైతమతమే సిద్ధమగుమతము. దీనికి కృత్యమును అనుభవమును ప్రమాణము. ఔరా! నిక్కముగ.

గీ॥ పాపమనునది యెందుసం • భవము దాని
యందుఁ బ్రతిపాదితానంద • మతిశయిల్లు
దేనియందు నాశమో • దానియందు
సంభవమనివార్యముగ నొందు • శలభముగతి.

ఇది ప్రకృతిసిద్ధమగు ప్రవృత్తి. ఇట్టి జ్ఞానము ంకయు నాహా!

ఉ॥ ఎప్పగిదేవి రాగమున • నెందున నొప్పితిఁ దొల్లతొల్లటో
నప్పగిదంత రాగమున • నందున నిప్పుడు నిందు నెంచునే
నొప్పగనయె "లోకమను • నుతన ద్దనశాలన హా!
యెప్పటి కేది ంభవము • యొప్ప దెఱుంగుసమర్థుఁ డెవ్వఁడో
ఛీ? ంకనీవిషయమున చింతించుట దోషము

గీ॥ స్ఫటిక ఖచితమైనట్టి ద • ర్పణమునందు
బ్రకృతి సర్వంబు నెబ్భంగి • ప్రతిఫలించు
నటుల నిర్మలంబగు హృద • యంబునందు
సర్వకర్మఫలంబులు ంఘటించు.

నా హృదయము నైతమట్టిదాటచే నేమైనదో యైనది. ఇంక నే నావిషయంబు లన్నిటిమఱచి నా దేవియగు మదనమాలిని యేమి చేయు చున్నదో యరసెదగాక. (అనుచు నాలుగడుగులువైచి యాఁగి) నాకెంత కును లోని కేతెంచుటకు గాళులాడుట లేదే.

మ॥ అపరాధం బొసరించినట్టి మనుజుం • డత్యంత భీతిన్ ధరా
ధిపు సాన్నిధ్యముఁ జేర సంశయిలు రీ • తిన్ నాకి దేమోయొకో
విపరీతంబుగ జంకునొందనయె నా • వేరొందు సాంగత్య దో

నవు మాహాత్మ్యమొ యేమొకాక మఱియా • సంకోచమిం కేటికా?
నిజముగ నే నంతదుష్టుడ?

( మత్తకోకిల. )

పాపమీరమణీమణిన్నృపా • బంధఁ జేసితిఁ గట్టి? యే
పాపమెఱుగని బేల యీసతి • భర్తృమాన సవర్తియా
నీపయోజవిశాలనేత్రఁ బ • రేంగితాంగన సంగతిన్
బాపమంచుఁ దలంప కేదరిఁ • బాసితిన్ దశరాత్రముల్.

ఔరౌర!

ఉ॥ ఏదినముం బదేపదిగ • నెన్నియొ సారులు వచ్చి దీని ప్రే
మాదరణామృతప్రవము • లానక యున్న తపించుచుండు నే
యీదశరాత్రముంతనెటు • లీదెనొ మద్వియోగమహాంబుధిన్ గటా!
యీదినమైన దీనియెడ • నెంతయొ ప్రేమరసంబుఁ గుప్పుదున్.

(అనుచుఁ బ్రవేశించి మదనమాలిని యెందును లేకుండమి మహా శ్వేతమున) ఏదీ? ఈయంతఃపురమున నెందును గన్పించదే! ప్రేయసీ! (కొంచెము నిదానించి) ఏమీనిశ్శబ్దము? (మఱలఁ గొంచెము నిదానించి) ఆఁ ఏమీ చిత్రము? (చక్కఁగఁ బరిశీలించుచు) ప్రేయసీ! (ప్రేయసీ! (మరల కొంచెము నిదానించి) ఏమీయద్భుతము! ఇదేమొ యిదియు బోధపడుటలేదే?

చం॥ పదిదినసంబులో దనుక • మద్వరదర్శనమందకుండమిన్
మదవిసిఁగంత నేయుసుటుఁ • బాసెనొ? పాయుక యున్న నన్నుఁ దాఁ
బెదటిఁ జేయు డాఁగెనో? ని • మేషమునన్నెడఁ బాయలేని యీ
సదమల మానసింకమది • స్థైర్యతఁ జెందుచు డాఁగఁగల్గునే?

డాఁగిన నింకెచ్చోటడాఁగు ? (సాలోచనముగ) మీమాయ? అరే! యీ చలికత్తెయు నేమయ్యె? ఇదేమైన నెట్టి పన్నుగడయోమై యుండునా? (కనులుమూసుకొనుచు) ఏమి పన్నుగడయై యుండు? హృదయమా! వృథాతర్కములఁ బొల్పక యీ మహాసమస్యా మేమో చక్కఁగఁ ద్వరగా గ్రహింపుము? (అనుచు నట్లే దీర్ఘాలోచనమున క్రిందఁబడునట్లుండును.)

మదనమాలిని— (భూగర్భమునుండి ప్రవేశించి మానపాలుని జూచుచు) ఓహో! ఇప్పుడు మహావిభ్రమ మనస్సముద్రంబున మునుంగుచున్నాఁడు? అదిగో! యేమో దీర్ఘాలోచనముతో, నిశ్చయించి సోలుచున్నాఁడు. అట్లే గ్రిందఁబడునా? యేమి? (చేతులు పిసుకుకొనుచు) ఎట్లు? ఇపుడేమి చేయుదు? (అనుచుఁ జప్పున శయ్యాదాపున కేగు చుండును)

మాన— (దీనస్వరంబున) హృదయమా? నీవిఁకను స్ఫురించుటలేదా! లేదా? ఏ—తమును స్ఫురించుటలేదా? హా! (అనుచుఁ గ్రిందఁ పడఁబోవునంతలో)

మదనమాలిని— (చప్పునశయ్యపైని తల్పమును గైకొనివచ్చి) యాతఁడు పడఁబోవు లమునందుఁ బఱచుచుండును)

మాన— (అంతలో నాతల్పముపైఁ బడును)

మదనమాలిని— (బెదఱున యీవలకువచ్చి), మఱల నాతనికడకేఁ జేరుచు (మనలో) ఔరా? నిజముగనే నిప్పుడీ పని చే చేయుచున్నచో నా మూలముగ, నాయీనాధునకెంత మోసము వాటిల్లెడిది? (అతని పరికించి చూచుచు) నాధా?

ఉ. నీనిజమైననాయెడలి • నిక్కపుఁబ్రేమరసార్ద్ర మానసం
బేనిమిషంబునందయిన • నెట్టివ ధంగ్ గృహియించ నట్టిదౌ
మానవనాధ? యమల • మా నమందున నాయుకాన్యసం
ధానరహస్యవంచనము • తాల్కొనిదార్ఢ్య తఁ గోలుపుచ్చెఁగా?

(జనాంతికముగ) నిజముగ నానాధునకింతవంతఁ జెందించినది నా వంచకత్వమే? ఛీ! ఛీ! యెంత దుష్పథను? (అతనిమోముఁగాంచి యులుకుపాటున) అయ్యో యిదేమి? నామనోహరుని దేహమందంతటను నీద బిందు ప్రవాహంబు పొంగిపొరలుచున్నదే, నాధా? నీహృదయంబున కెంత విచార వా యామంబుఁగూర్చి తినోకఁదా? (కన్నులుమూసుకొనుచు) దైవమా! నా పాపమును శమింపఁజేసెదవుగాక, (మఱలకనులుమూయుచు నాధా? నీకెంత విచారము గల్పించితి! (అనుచుదనపైట చెఱఁగుల వానికి మెల్లఁగ విసరుచు మహావిచారముగ)

శా॥ ఏమో యిక్కథలోకులందఱికి సం • ఖ్యేయార్థమై సత్యని
త్యామోదాయతమైననీతి కదుల • భ్యంబౌనటంచెంచితే.
ఛీ! దుశ్చారిత్రమిాగతిం బరిణమిం • చెఁగాదె యిప్పట్టు. నిం
కేమో! ముందెటులుండఁ బోనో! విధి వా • లెట్లుండెనో! నాయెడన్.

(అంతలో మానపాలుఁడు నిట్టూర్పు డఁగా నులికిపడి యీవలకు వచ్చివానిఁ జూచుచు) ఇఁక తొందఱలేదు, అదిగో మొదటమొదటఁ దాండవంబాడిన స్వేదబిందుతండంబంతయు శమించినది. మైమఱపు వదలుచున్నది. ముఖము నూత్నవికాస జనితంబగుచున్నది. నారచించు నీ కపటనాటకమందు నాయకీనాయక పాత్రత్వరసంబు భంగంబగు ననుకొంటిఁగాని, మఱియు నిందునిది యొుంతు మెఱుఁగునే యిడినది. అదిగో! కనులు మూయుచుఁ దెఱచుచున్నాఁడు. ఇంక నాయుద్యమంబున నే నుండవలెఁగాక, (చాటున కేగి ప్రకాశముగ)

శ్లో॥ భర్తాయదపి కామశాస్త్ర నిపుణో విద్వాన్కులీనో యువా
దాతా కర్ణ మపి ప్రసిద్ధవిభవ శ్శృంగారదీక్షాగురుః.
స్వప్రాణాధిక కల్పితా ప్రియతమా స్నేహేన సంవర్ధితా
తం కాంతం పశువద్విధాయ తరుణీ జారంపతిం వాంఛతి,

మాన—(ఆలకించుట నభినయించి లేచుచు విస్మితముగ) ఆఁ, ఎచ్చటనో నా దేవికంఠస్వరము వినవచ్చుచున్న దే? (దిగువనున్న పఱుపు జూచి) ఇదేమి! ఈతల్పమెచ్చటిది? దీనినిట నెవరుంచిరి? ఇస్సీ! ఎంతమంద ప్రజ్ఞుఁడ? నారాజ్ఞి యీయంతఃపురముననే యెచ్చటనో డాఁగి యీ చిత్రము సేయుచున్నది. అది తెలుసుకొనలేక యెంతలో దానికౌపహాస్యాస్పదుఁడనైతి. దిక్కులు పరికించుచు మఱల నెచ్చటనోడాఁగినది. ఇంక నేఁ దెలుసుకొనలే కుందునా తెలుసుకొనెదఁగాక. (అనుచు నొకవైపు నన్వేషించుచుండఁగా)

మదనమాలిని—(వెనుకఁగ ప్రవేశించి) ఇఁక నిచ్చట నీతల్పముండ రాదు. (అనుచు దాని నెత్తుకొని జాగ్రతగ శయ్యాతలమందుఁ బఱచి మఱొకవైపున డాఁగును)

మాన—(అంతట నన్వేషించుచు నచట తల్పము లేకుండుటజూచి మఱింత విస్మితుఁడై) అరె! ఇంతలో నీతల్ప మేమయ్యె! (శయ్యవంక

దృష్టిమఱల్చి) అప్పుడే ఆశయ్యయుండె పరమర్చిరి! ఇదంతయూ డఁగ నాకేమో మతి విభ్రమము వాటిల్లినట్లున్నది. ఇంతకు ముడున్న వినవైన శబ్దస్వారమొకరికింత స్వరమో అదియును విస్ప ముగ స్ఫురించుటలేదు. ఆస్వరము. నా రాణి దేయగునా కాదా యని మఱల సందేహము గల్గుచున్నది. దృష్టిదృష్టమైన యిచటి తల్పమే మహామాయము కాఁగా. శ్రవణదృష్టమైన శ మేమని నిర్ణయింపనగు? కాని ఆశబ్దా మమూతి మిప్పుడు కొంచెము కొంచెముగ స్ఫురణకు వచ్చు న్నది. మరి? "జారంపతింవాం ఛతి" అనఁగా? జారుఁడగుఁ బతిని గోరుచున్నది ఎవరు? "తరుణీ" ఓహో! సరె! ఎప్పుడు? ఎందుచే? అందుకు సమాధానము లేదు. కాని, దీనికి పూర్వపదము "తంకాంతం పశ్యవద్విధాయ" అని వినవయ్యె. అనఁగా? "తంకాంతం" అతనిగని, పతిగని; అప్ర మనవసరము. ఇంతకుఁ దరుణముగలదియంటేది యొకతె నిప్పుడు నను, తనమగఁడగువానిఁ బశుప్రాయునిఁ జేసిఁ కంతునిగ కోరుచున్న దని ముఖ్యమగు భావము. ఇవి వాక్యంబులు ప్రసంగములెడ స్త్రీల కిల్లలంబులు. అట్టిచో నిసి నా రాణినోట నెట్లు వెలువడు? అది యసంబద్ధము. చూడంబూడ నిది యంతయు నా మనోగతియే. ఇది నిశ్చితామే కాని వ్యర్థమనోగతి కాదు. వశీకృతి సమావేశ మునకుఁ బూర్వమా యుద్యానవనంబున నీచవాగ్గుంభితయగుచు నన్ను సమీపించిన స్త్రీయే నా దేవి నెచ్చెలి. ఆవశీకృతియని భావింపఁబడునదే మ. త్రి, ఇఁక నిందు సంశయము లేదు. కనులు మూసుకొనుచు) పాపము శమించుఁగాక. (కనులు తెఱచి) మహా తీవ్రతారత్నమగు నాదేవియం దపోహ మారోపించుకొను చుంటి (సాలోచనముగ) ఏమీ! అహోహా! ఎట్లు? ఔను. ఏలకాదు?

సీ॥ ఆనాఁడు నాముందు • సంతసిల్ సూపిసి
యట్టె యంత్యమున వా • దాడు టొకటి
మగువ యెంచిన యొట్టి • మగనైన వంచించు
నరనిముసంబులో • ననుట యొకటి

యన్నివిధంబులన్ • దన్నుఁగోలిన యొండు
సతియుండెనను భ్రమ • సలుపు టొకటి
యేదో కార్యార్థనై • యేగ నావనమున
దమి వృద్ధిఁజేసి నన్ • దార్చు టొకటి
గీ॥ యిప్పు డది యా గృహమ్ముఁ బాసి • యేగుదినమె
యిటుల బంధింపఁబడిన యీ • యింటియందు
నిదియు లేకుండు టొకటి యి • ట్లైనన్నె మదికి
దీని పన్నుగడనియె తా • ర్కాణమయెడు.

ఇంకను ఇందు సంశయమా? నిజముగ.

చ॥ అగుసగు నీ గవాక్షముల • కే నిబంధన లేమిచేయమిన్
జగవగు సేవకాళి నటు • దార్చుచు వారల కెట్టి యాశయో
వగఫునఁగూర్చి వార్లఁ దన • వశు లఁజేసుక బైటకేగఁగా
నగు విధమేదో పన్నుకొని • య వ్వణిజున్ రమియించుచుండెడిన్.

లేనిచో సర్వవిధములు నొకరికొక రెనయగు టెట్లు? అది పోని అది లేనిదినమే యిది లేకుండు టేమి? నిస్సంశయముగ నదియే యిది. ఇదియే యగు. కాని యెంత సాహసురాలు! నాస్థైర్యత్వ మంతయు నణగార్చి, నాకనులకు కామాంధకార మనెడు కారముఁగొట్టి, నిజనాథుం డనగు నన్నే జారున కుపజారునిగఁ జేసుకొని, సర్వోపభోగముల ననుభ వించుచు నన్ననుభవింపఁజేసి, నేఁ జూచుచుండఁగనే వణిజుండగు మణి మంతుని స్వంతసొమ్ముగ నాతని వెంబడించి పోఁజాలినది. అందు కెంత మెచ్చవచ్చు? ఛీ! అందు కింక సిగులేక మెచ్చుకొనవలె.

గీ॥ బాహ్యమందొండు నడప • మనసునందు
నొండు నడపఁగల్గి జా • రోపజార
సంగతి రహించునట్టి స్త్రీ • జాతియందు
దేని మెచ్చంగఁగూడ దజ్ఞానబుద్ధి.

నిజముగఁ జూడ,

చ॥ సతి యననొప్పు స్త్రీయొకటి • త్రుళ్ళిలినుండునో లేదో? యందఱున్
సతత పరాభిలాషహృది • సంగత ఢ గితవ చేతసల్

వితత వివాదతత్పరలు • వేధవచస్కలుఁ జిత్తచంచలుల్
సుతహిత భర్తృబంధు భయ • శూన్యల పూజ్య లనూయమానసల్.

ఇదియెల్ల నిక్కము. అట్టిచో నిట్టి స్త్రీ లుండు నేమి? మగ[illegible] యునేమి? ఏమంటివి? ఛీఛీ! దీ నొక్కదాని గుఱించి స్త్రీలనందఱ నిందించుట నాకొంట్ల కెట్టిపాడి? పాడియో బాడియో నా డ వదలినది నా కదియే పదివేలు చాలు. ఆఁ మఱల నేమనుచుంటివి? అట్లని మిన్నకుందునా?

ఉ॥ నాథు ననాథుగాఁదలఁచి • స్వైచ తఁగాంచి స్వవిద్యకంతకున్
సాధక మన్యనాథురతి • సంభ్రమ ంగతి యుంచు మించి వై
శ్యాధము వెంటనంటి చను • నాకులట వ్యధియింప కే యొటుల్
సాధువుగాఁ జెఱంగుదును! • సత్వరమే నిదె వెంటనంటుదున్.

(అనుచుఁ బండ్లు పట పట లాడించుచు నిష్క్రమించును)

మదనమాలిని—[ప్రవేశించుచు]

మ॥ పతి యెంతో మది నన్ను మాయ సతిగా • భావించి రౌద్రార్భటిన్
సతియా నన్ను వధింపఁబూని చనియెన్ • సందేహ మింకేల? యీ
గ గాఁ బోవుట యింక మంచిదెసుమీ? • కానిమ్ము దే యేను నీ
గతిగాఁబోయి మఱొంతు చిత్రమును దాఁగాంచగఁ జేయన్వలెన్.

(అనుచు భూగర్భమునుండి నిష్క్రమించుచుండఁగ యవనిక జాఱును)

(అవనిక లేవఁగా)

దేశము—నగరబాహ్యారామము.

మదనవతి మణిమంత నే పథ ంబువీడి స్వస్వరూపమున శయ్యపై
విచార మభినయి చి కూర్చొనియుండును]

మదనమాలిని—(భూగర్భద్వారమునుండి బైలెడలి మదనవతిని జూచి విస్మితయై దాని ప్రక్కఁజేరుచు) మదనవ యిదేమి?

మదనవతి—(మదనమాలినిఁ జూచి (త్రుళ్ళిపడి) నీ విటకువచ్చి యెంత సేపైనది?

మదనమాలిని—ఇప్పుడే కాని నీవెందుకు విచారమున నుంటివి?

మదనవతి—అచట విశేషమేమి?

మదనమాలిని—మన మనుకున్నదానికి భంగమేమియు లేదు. కాని నీ విచారమేమి?

మదనవతి—మన మనుకున్న విషయంబులన్నియు నిర్విఘ్నముగ సాగునా యనియే.

మదనమాలిని—(మందస్మితముగ) ఓసి బేలా!

గీ॥ నారచించు నీ కపటంపు • నాటకంబు
దైవకృప సమస్తంబుఁ బ్ర • దర్శనంబు

మదనవతి—(వారించి)
కాఁగలదు గాని దైవసం • కల్ప మన్య
మైనచో నిష్టనాథుచే • హానియొదవు.

మదనమాలిని—ఏమిహాని యొదవు?

మదనవతి—ప్రాణహాని.

మదనమాలిని—మన యదృష్టవశంబున నదియే యొదవుచో నింకఁ గావలసిన దేమి? కాని యట్లు జఱుగదు. ఒకవేళ నట్లుజఱిగిన నేమి?

గీ॥ పతియె తన సతిప్రాణంబుఁ • బాపఁదలఁప
నంతకన్నను సతికేమి • యవసరంబు?
సర్వపాప విముక్తయై • శాశ్వతముగఁ
బరమపదమందు సుఖయింపఁ • బడునుగాదె?

మదనవతి—ఔఁగాక. ఐన నిది సాంతమగులోపల నెన్నియో యనృతములాడవలెఁగదా?

మదనమాలిని—

గీ॥ అనృతంబౌండెయేమి? ప • త్యనుసరణము
నందు జారత్వమొండె చౌ • ర్యంబునొండె
యాత్మహత్యయు బ్రహ్మహ • త్యాది వివిధ
హత్యలొండె జూదంబొండె • యఘము లేదు.

మదనవతి—అదిసరె! ఇది య దేలయగు!

మదనమాలిని—నీయభిప్రాయమెట్టిదని?

మదనవతి—ఈకృత్యంబుచేఁ బతిస్వాంతమిప్పు డెట్లులరుచున్నది?

మదనమాలిని—ఎట్లులరుచున్నది?

మదనవతి — పటుతరంబగుఁ గష్టమున నలరుచున్నదనినా యభిప్రాయము,
మదనమాలిని — కానున్గో ?

కం॥ ఎంతగ మనచేనాథుని,
సాంతంబున గల్గుచుండెఁ • బటుతరకష్టం
బం తు నింకఁబడంతేలు,
సంతోషమె పతికిచెందు • సత్యము మనచే.

మదనవతి — ఎప్పటికది సంభవము ?
మదనమాలిని — ఎప్పటికో యననేల ?

కం॥ ఎప్పుడు మనకథసర్వము,
జెప్పుచు బతిపాదయుగళిఁ • జేరుచువినయం
బొప్పు క్షమార్పణ గోరుదు,
మప్పుడె యీ కపట నాట • కాంతము శుభముల్.

మదనవతి — సోదరీ ! యీకృత్య మొనర్చుట కాలస్యమేల ?
మదనమాలిని — ఇప్పుడేమైన నపాయము రానున్నచో నీకృత్యమిప్పు
చేయక తప్పదు. లేనిచో నీకృత్య మప్పుడే చేయుట లెస్స.
మదనవతి — (సంతసముతో) కానాను. నిజముగా నావట్టునందే లెస్సగ
నుండు.

సోదరీ? గీ॥ గ్రన్నసమనముప్డి • కర్పూర హారతుల్
మనదు కపటనటన • మునకు స్వస్తి
జెప్పుభంగిఁ గొనుచు • జప్పునఁ బతిఁజేరి
యతని దయను పొంది • యులరవచ్చు.

మదనమాలిని — మఱి నేనదేకదా చెప్పునది ? కాని వారు వచ్చు సమ
యమగుచున్నదిఁక పరుండుము ? (అనుచు లేచును)
మదనవతి — (దీనస్వరంబున) నీ విచ్చట కేగెదవో నాకిపుడేమో భయ
ముగనున్నది.
మదనమాలిని — ఏమాత్రము భయపడకుము ? నిన్ను కాచుకొని యీ
సమీపమునే యుందును. కాని నేజెప్పిన విషయంబు లేమఱక
మిక్కిలి జాగరూకతను మాత్రము మెలంగుచుండుము ? పరుం
డుము ? .(అనుచు నిష్క్రమించును)

మదనవతి —(శయనించును)

మాన—(చౌర్యనేపథ్యంబునఁ బ్రవేశించుచు దివలో)

గీ॥ కాలమను రోఁడి నయంధ • కారగర్భ
మునను లోకంబులను పిల్ల • లను విరతుల
నలుపుకై దాఁచుకోఁగ వై • చను మొంది
గుద్దుకొని యవెల్లయుఁ జావఁ • గూడునదియొ.

మ॥ అటులే యన్యకులాంగనారతిని యొ • ప్పావైశ్య వంశాధమున్
బటురోషంబునఁ బట్టి చీల్పఁగ బలే • పట్టయ్యొ నీరేయి, నె
వ్వటికి ల్లాఁ బగవానిఁ ద్రుంచుకొఱకై • పాల్పడ్డచో భూమిన్
దిటవౌ కీర్తిఁ గలాని కెప్పు డిదియే • దివ్యంపు మార్గంబగున్.

గీ॥ కాని యీ వణిజుండు నా • కాంత మ్రుచ్చి,
లించినటులతోఁ పదు మ్రుచ్చి • లించియున్న
యింకనెట్టి స్థైర్యంబొంది • యీమదీయ,
నగరబాహ్య వనంబు నే • నెగడఁగలఁడు ?

శా॥ ఏమోతే యితఁడెట్టి పన్నుగడతో • నిచ్చోటనే యున్నచో
నేమంబంచుఁ దలంచెనో ? యెఱుఁగమే! • జిత్తుల్ సమస్తంబునీ
భూమిన్ జంబుక రాశికిన్ మఱివణి • క్సూభృతాళికిన్ సొమ్మగున్
వేమారుల్ తరువంగ నేల నిదియే • విస్పష్టమిప్పట్టునన్.

కాని యితఁడింత నిర్భయంబుగ నిచ్చటనే యుండుటకుగాఁ బన్నిన జిత్తేమియుండు ? (యోచన నభినయించి) ఓసి. యింతేనా?

గీ॥ ఈవనంబునందె • యీరేయి నుండుచో
ద్రోహి కాడితఁడు • నిర్దోషియనుచు
ద్రోషియగుఁడునట్లె • దూఱమేగఁడెయుంచు
నెంచిరానటంచు • నిచటె నిలచె.

ఇదియే వీఁడు పన్నినజిత్తు. ఈజిత్తు నేగ్రహింపలేని నాబుద్ధి నత్తు వేల? (పండ్లు పటపట లాడించుచు) వీనినింతమాత్రమునే విడతునా? ఇంక నిపడకెక్కడో యరసెదఁగాక (అరయుచుమదనవతిపరున్నశయ్యఁజూచి)

యిటనుంచెత్తుకపోయి నా గృహములో • నిష్టానుసారంబుగా
విటనారీమణియైన దీని నిజమా • న్మత్తిక్ విచారించుదున్.
(అనుచు నెమ్మదిగ దాని భుజముపై నిడుకొని నిష్క్రమించుచు)

మ॥ ఇఁక నెవ్వండును నడ్డురాని యొకచో • యేటుగా జగంబంత చ
క్రిక నేతెంచి రణోన్ముఖంబుగ నగున్ • గాని! భయంబేమి! యి
ష్టాకనిన్ లక్ష్యము సేయుదో? చటుల ద • ర్పోద్దీప్తునై యున్ భయా
నక రూపంబునఁ జిక్కఁ జేచనియుదున్ • దాష్టీకగన్యాయతన్.

(అనుచు నిష్క్రమించును)

మదనమాలిని — (సంతసముగఁ బ్రవేశించుచు ఆహా! నా కపటనాటకం
బున నెన్నిరంగంబు లమరుచుండెటో. అన్ని రంగంబులును నే
ననుకున్న దానికంటె వేయిరెట్లు రసవంతములై సమగ్రముగ
నే రమణీయంబుగఁ బ్రదర్శింపఁబడుచున్నవి, గాని యొక్కటియు
న్వ్య మగుటలేదు. నామనోహరుండిపు డిట కేతెంచి తానెవ్వరినెత్తు
పోవుచుండెనో తానెఱుంగఁడు. ఆ యెత్తుకొని పోఁబడు వ
నేనేనని యాతని యభిప్రాయము. ఇదియే నా కపటనాటక ము
శృంగారము. ఇప్పుడిచట నేమి విచిత్రము జరిగెనో ఇంకముందేమి
చిత్రము జఱుగఁబోనో నాకుతప్ప నా నాథునకే మెఱుక? మొ
దట మణిమంతాభిధమునసుండి యిపుడు నామాటుగా భావింపఁ
బడి నా నాథుచే ప్రముచ్చిలింపఁబడిపోవు నా చెల్లెలగు మదనవతి
యిఁకమీఁద చేయఁబోవు శృంగారమే పరమ నర్మశృంగారము
యింక నేనును సత్వరముగనే పోవలయును. (భూమిపై దృష్టిని)
ఆహా! తగునంత ధనమున్నచోఁ దలఁచునంతపని యేల కాఁ
గదు? నగరాభ్యంతరవనమునుండి యీ నగరబాహ్య వనంబునకు
సైతము నొక్క వేయిరత్నంబులు మనవి కాదనుకున్నంతనే యెం
తో చమత్కృతి నొప్పి యీ భూగర్భగహన ద్వారమేర్పడిన.
ఈమార్గంబున నొక నిముసంబులో నచ్చట చేరఁగలను. ఇంక
దేనికాలస్యము? (అనుచు నచటిభూగర్భద్వారమునుండి నిష్క్ర
మించుచుండఁగా నవనిక జాఱును).

(మదనమాలినీ కేళీగృహము.)

(మానపాలుడు తాఁ గౌఁగిలించి తెచ్చిన మదనవతిని శయ్యపై నిడి)

మాన—(దానిని బరికించుచుఁ దనలో) ఇదేమి! ఇది శృంగారవతీ దేవియు మదనమాలినీ దేవియుఁగాక మఱొకవింత రామ యుకం స వొందుచున్నదే! ఏమీ యాశ్చర్యము. (ఆలోచన నభినయించి) ఇందుకై యాశ్చర్యపడ నవసరము లేదు. యౌవనమునుండు ప్రతి స్త్రీయు నిట్లొక్కొక్కతఱి మార్పుగా గన్పించుట సహజసిద్ధము.

॥ ఒక్కతఱి జగన్మోహిని • యొక్కొ! యనగ
నొక్కతఱి బరిచారిక • యొక్కొ! యనగ
నొక్కతఱి వారకామిని • యొక్కొ! యనగ
నొక్కతఱి గులకాంతన • నొప్పు యువతి.

అందుచే నిది ఆయిరువురిలో నేదో యొక్కతె కాకపోదు. లేక మదనమాలిని శృంగారదేవియు ఖ్యాలగు కులటవ్యక్తులుగాక వేఱుగానిది శ్రీమంతుని నిజధర్మపత్నిగ నైయుండునా! (చక్కగా దాని బరికించుచు) పోలనుకున్నను భేదమంతయెక్కుడుగా గన్పించుట లేదు. అదుగో కొంచెముగాఁ గదలుచున్నది, ఈసమయముననే దీని బాగుగా మేల్కొల్పి డాఁగితో దీని కలవరింపు టాలాపంబులచే నిజానిజములు బయల్పడగలవు. చేసెదఁగాక. (అనుచు దానిని బాగుగా గదలించుచుండును.)

నవతి—(విసుగునభినయించి) అబ్బా! ఏమిటండీ? మీకెప్పు డొకటే పిచ్చి.

మాన—(తనలో) ఆహా! (ఇపుడు బాగుగా మెలకువునకు వచ్చుచున్నది ఇంకను గదలించి డాఁగెదగాక. (మఱల దానిని బాగుగా గదలించి డాఁగును.)

మదనవతి—(వెనుకకు చేయిటోసిచ్చి అబ్బా! చాలు లెండు. ప్రయాణము సమయములో సైతము నిదేపి ప్రయా! ఇప్పుడేకదా నేఁగను లుమూసినది. ఇంతలోనే మఱల లేపెదరేమి. (చిఱునగవున వెనుకకు మఱలుచు మీకు నిదురపట్టుట లేదా! (తన కెక్కడెవరుఁగనిపించకుండుట విస్మితమభినయించి) సరె సరె! ఇంతలోనే నామీద కోపమా? (లేచి కూర్చుని నలుదిక్కులు బరికించుచు

విభ్రమముగ) ఏరీ? (మంచమునుండిదిగి మహావిభ్రమముగ) ఓసి నా తెలివి తెల్లవార. నానాథుడు చల్లగాలికై యెప్పుడోపోయి బైట పరుండగా నాయీమతివిభ్రమేమి? ఛీ! రోజునైన పాడలవాటు చేత నిట్లు కలవరించుచుంటి. ఇది నానాథుని పిచ్చి కాదు. నా పిచ్చి. ఇంక నోరు మూసికొని పరుండెద. (మఱల పండుకొని వెంటనే లేచి ఇంకేమి నిదురపట్టును. అబ్బ! ఎంతమంచి నిదుర చెడి ది. అంతనిద్రయు నొక్క కలవరింపుతో నెటోమాయమై నదె? కాని . (శయ్య నంతయు దవిడిక్రింద బరికించి విస్మితముగా) ఇచ్చ నాపుత్రిక మేమెనది! ఈశయ్యాతలమింత పెదిగా నున్నదేమి! ఏమీ చిత్రము! (నలుదిక్కులు బరికించుచు అరె! ఈహర్మ్య మెచ్చటిది?

ఉ॥ ఏమిపుడొక్కతోటను ప • సించి పరుంటిమి కాదె యట్టి చో
నేమి విచిత్ర మిద్ది! నిది • యెక్కడి సౌధ మిదేమి శయ్య! యే
మీమతివిభ్రమం బిటుల • నేర్పడి యుండుట ఎవ్వడైన మే
మేమరియుండ నన్ను దమి • నివ్విధి ముచ్చిలియుండ బోడుగా.

కాకున్న స్వప్నమా?

ఆ॥ గీ॥ స్వప్నమెట్టులగును • బాగుగా గనుదోయి
విప్పిచూచుచుంటి • వెఱ్రివరిది
నేమిచోద మార? • యింక జోద్యంబేమి
యెవడొ న్నుదొంగి • లించియుండు

ఆ నిజముగా నంతపనియే జరిగినదా? జరుగుటయం దాశ్చర్యమేమున్నది? ఛీ! భగవంతుడు నాకొసంగిన యీ పాడు సౌందర్యమునకెవడో మోహించి యిట్లొనర్చియుండు. మఱియు నీతడెట్టిమేటిబలశాలియో కాకున్న ఇంత నిర్భయముగ మానపాల మహీపాలున కత్యంత మిత్రుండగు నంతవాని భార్యనగు నన్ను ముచ్చిలించి తేసాహసించునా! దైవమా? నాకెట్టిగతి ప్రాప్తింపజేసితివి? నేనెట్టి దుష్పథముననైనను వర్తించి యుంటినా? విధికృతముచే మానపాల మహీపాలుని మాతము ప్రేమించితి అంతమాత్రమునకే నాకిట్టి శిక్షవిధింపనెంచితో? చేసిన దేమో చేసితి. ఇంకను జేయుదుననుకొంటివా? ఆయల్పమగు నేరము

స్సైతము నీవొనగూర్చిన నావయోపిశాచమే యొనర్చెఁగాని నాము నఃపూర్తిగ నేనొనర్చలేదు. అట్టినాయందు నీకింతకసియేల? అటులైన నీ కలుషాపాదితమగుఁ బాడు సౌందర్యదేహ మిదేవదలుచుంటి. ఇంకనీ బొందితో నిల్వజాలఁ.చాలను. ఈనన్నుఁ బ్రముచ్చిలితెచ్చిన యాదుర్మా కామి యెవఁడో వాఁడువచ్చి స్పృశింపనున్న యీశరీరమున నెంతమాత్ర మును నిలువఁజాల. నిలువజాల. దైవమా! ఇకెంతమాత్రము నిలువఁజాల. హా! హా! దైవమా! దైవమా? హా దైవమా! (అనుచు మూర్ఛిలి క్రిందఁ బడును)

మాన—(ప్రవేశించుచుఁ దనలో) ఇపుడు దీనిని నా మదనమాలిని యను టకు వీలు లేదు. నిస్సంశయముగ నావణిగ్జాయ యగు శృంగార దేవియే. కాని ఇపుడు నాకు కర్తవ్యమేమి? లేనిపోని యను మాన పిశాచగ్రస్త చిత్తుఁడనై దీని కెంత వంతఁగూర్చితి! కాని మ్మ ? ముందు దీని నెట్లో సమాధానపరుపకున్న వీలు లేదు. (అనుచు దాని సమీపించి స్పృశించుచు) శృంగారదేవీ! (అని పిలుచును)

మదనవతి—(త్రుళ్లుపాటున లేఁచి రౌద్రంబున ఎవరు నీవు? దూరముగ నుండుము? (అనుచు నీవలకు వచ్చును

మాన—మనోహరీ! నన్నపుడే మఱచితివా? ఇదిగో! ఇటు నా వైపునకు దృష్టిమఱల్చి నే నెవ్వరనో ని న్నేయుద్దేశ్యముతో నిచ్చటకు దెచ్చుకుంటినో చక్కఁగా నూహించుము. ఇదిగో నే నెవ్వగనో యింకను దెలుసుకొనలేదా?

మదనవతి—ఏమో !

మ॥ తమ రెవ్వాఁరలో! యీగృహం బెవరిదో • తా మీ లంబంబు న న్దనిచౌర్యఁ యఁ జేర్చు టేలొకొ? భవ • త్తాత్పర్యమేమో? మదీ యమనోజ్యోతికి గోచరింపదు కదుర్ • హా! దైవమా? యంచు స త్యముగా నాదు మనంబు చింతిలెడు ను • ద్దండక్రియన్ నిన్గనన్.

మాన—ఓసీ! పిచ్చిదానా? నిన్నీ విధముగ దొంగిలించుటకుఁ గల కార ణము, సాహసము, సామర్థ్యము నాకుఁ గాఁక మఱేరికుండు?

మదనవతి—(బిత్తఱిచూపులతో భయ మభినయించును

మాన—ఇదుగో! దేని కిట్లు భయపడెదవు ?

శా॥ ఈభంగిన్ భయ మొందెదా తగునటే? • యీవైపుగాఁ జూడు! నీ
వే భూపాలు మనంబు దొంగిలితివో! • యే భోగముల్పొందితో
ఆ భూపాలుఁడ నిన్ను దొంగిలి తదీ • యంబైన భోగంబులన్
నే భోగింపఁగ నున్నవాఁడ మగుడన్ • నీయందె నిక్కంబుగన్.

ఇఁక నెంతమాత్ర మనుమానింపకుము. (అనుచు దాని నోదార్చుటకు దాని పీఁకపై, జేయివేయఁబోవును)

మదనవతి—(వానిని నెట్టుచుఁ గోపంబుగ)

ఉ॥ ఓలఘుబుద్ధి! తాళుమటు? • యూరకచూచుకొలంది నింకపై
వ్రాలఁగఁ జూచెదో ఖలుఁడ? • పైగ రవంతయుఁ లేక భూ
పాలునటంచు వచ్చెదవు • పాపియు దొంగయుఁగాక యెట్లు భూ
పాలుఁడు దొంగిలించుఁ బర • భామల నెంతటి మోహముండినన్.

మాన—ఓహో! నే నీప్రచ్ఛన్నమున నుండుటచే గుర్తింపఁజాలకుంటివి. కాని నిజముగా నీ మనోపాలుఁ డగు మానపాలుఁ డను మహీపాలు నగుదునో కాదో యిపుడే చూడఁగలవు. (అనుచు నిష్క్రమించును)

మదనవతి—(చెలువగవున పెదవి గొఱుకుకొనుచుఁ దనలో) సరే రానిమ్ము.

మాన—(చోర నేపథ్యముఁ దీసివైచి స్వస్వరూపమునఁ బ్రవేశించుచు) ఇదుగో ఇప్పుడైనను నే నెవ్వరనో గుర్తించుము?

మదనవతి—(ఆశ్చర్యముతో జూచుచుండును)

మాన—ఇఁక నెంతమాత్రమును జాగొనరింపక శీఘ్రముగ నీ బిగికౌఁగిటిం జేర్చుము. (అనుచు దాని చేయిఁ బట్టుకుని) రమ్ము.

మదనవతి—(చేయివిదల్చుకొనుచు)

ఉ॥ చాలునుచాలులెండిఁకను • క్ష్మావరులన్న ఘనంబదేమి పో!
స్త్రీ లతిచంచలాత్మలని • చెప్పుటలగ్గగుఁగాని యిట్టి భూ
పాలురు నిశ్చలంపుహృదిఁ • బాయుచు నన సతిన్ దలంచుచో
గేలిరొనర్పరే బుధులు • కీర్తితొలంగదె ముప్పుఁగల్గదే.

ఏదెట్లున్నను అయ్యో! ఇంకేమున్నది? ఆనగర బాహ్యారామమున నా నాథుం డీరేయియే యెట్లయినను నేనిట్లు ప్రచ్ఛిలింపఁబడుట గుర్తించు. వెంటనే సేవకుల నలుదెసలకు నన్వేషింపఁబంపు. అప్పుడితరఁబుగ నెట్టి జాడలుఁ జిక్కకుండుటచే అసలు నాభర్త దొడ్డ యనుమానపురుషుఁడు. పదంపడి మిగులనేవలమారివాఁడు. అట్టిఁడీ నాజాడ నెట్లయిన గుర్తించకుండునా? గుర్తించి యే రాజన్యుల సహాయము ననో మగుడ వచ్చి నీ మీఁదికి దండెత్తకుండునా? పిదప జయాపజయము లెవ్వరివైనను నాకళంకము దేశదేశముల వాపించదా? అయ్యో! అయ్యో! రత్నవర్తకమణిమంతుఁడనియు మహాపండిత మణిమంతుఁడనియు దానకర్ణమణిమంతుఁడనియుఁ బలువిధంబులుగాఁ బేర్కొనఁబడి దిగ్దేశములతన యశశ్చంద్రికల వ్యాపింపఁజేసిన యంతవాని భార్యయగు శృంగారసౌందర్యమాలినియనునది యొక భూపాలునితో నున్నదన యెంత యపతిష్ట? పహాస్యముగా నెట్టిదుష్పథమున వర్తించుచున్నను శృంగారవతి స శృంగారవతియనియీ చెబిరుదువహించి పితృభర్తృవంశంబులకంతకును ప్రఖ్యాతిఁ దెచ్చిన నేను నిజముగా నింక జీవింపఁగలనా? భూవరా! ఇదేమి ఘనకార్యమని యెంచితివి? మఱల కొలఁది దినములలోనే వచ్చి యొరుల కింతమాత్రమును దెలియకుండునట్లు తమ ప్రేమసుధారసంబును దృష్టికరంబుగఁ గ్రోలుదునను నడియాసతో నుంటిని గాని యింతలోనే నీవింత కట్టడితనంబున కొడిఁగట్టుదువని కలనైన దలంచలేదుకఁదా? ఇంతలోనే యేమి మునిగిపోయినదని యిట్లొనరిఁతివి రాజా! నీకును నన్నుమించు సౌందర్యవతియగు భార్యయేకలదు కదా! ఇదేమింత నీచకృత్యమునకుఁ బాలుపడితివి? రాజా! రాజా! నీవు నిజమగురాజువే? నీవేమిరాజువో నాకు బోధపడుటలేదు. ఛీ ఛీ! (కనులుమూసి క్రిందఁ బడఁబోవును)

మాన—(వారించి పట్టుకొని తనలో) దీని దీనాలాపంబులు వినుచో నా గుండె జలదరించుచున్నది. ఏమిచేయుదు? నే ననుకున్నదొకటి యైనదొకటి (దానిని బుజ్జగించుచు)

మ॥ అబలా! బాలవిధంబుగా నిటుల న • న్నాడంగ నాయంబె నీ
సొబగున్ముద్దుల మాటలొల్కు మొగము•న్నొంపైన వాక్యామృతం

బుబలాటంబుగ వెల్లడించినను మో • హాద్దీపితుఁజేసినం
త, బలప్రౌఢవు నీవకావ ! కసనా • తప్పేమి చూపెట్టమీ.

మదనవతి—(కనులు తెఱచి యాతని చెక్కిళులుదువ్వుచు) మనోహరా! నిజముగా నీ తప్పేమియులేదు. కాని ఇఁక భావి కర్తవ్యమేమో నిర్ణయింపుము.

మదనమాల—(భూగర్భమునుండి చప్పుడు గాకుండ ప్రవేశించి యొక మూలడాఁగును)

మాన—మనోరంజనీ! (అనుచు దాని గడ్డముఁబట్టి)

ఉ॥ ఆర్యకులావతంసుఁడగు • నాత్మసమానుని భార్యవైన నీ
చర్య సువాగ్మనోనుతము • సర్వజగైక విభాసితాంగ సౌం
దర్యముఁ బ్రేమఁబంపదము • నైజము నీకల నట్టి నిన్ను దు
ష్కార్యము చేసి ఖేదమున • గాసిలఁజేసితి నెంత దుష్టుఁడన్.

రమణీ! ఇంక గతించినదానికి చింతించిన ఫలమేమి? కొంచెము తడవాశయ్యాపై విశ్రమించుదము రమ్మా? (అనుచుఁదాబట్టుకొనియే శయ్యాతలము సమీపించుచుండును)

మదనమాలిని—(ప్రవేశించుచు) (తనలో) నారచించివి ప్రదర్శించెడు నీక పటనాటకమునందు కథానాయిక పాత్రము నెంతగాఁ దనకు తెలియకుండా తనకిడినను మిక్కిలి రసవంతముగనే రంగమును • శోభించుచున్నాఁడు నిజముగ నానాధుఁ డెంతటిసరసగుణాని తుఁడు? కానిము? ఇంక నాకృత్యముననే (ప్రవేశించెద) (ప్ర॥ (ఆ మదనమాలి కేళీసౌధ మందెంత పని జరుఁగుచున్నది?
(శృంగారదేవి మానపాలురు త్రుళ్ళిపాటున నభిముఖులై విభ్రాంతముగనఁ జూఁచుచుందురు)

మదనమాల—

గీ॥ ఎవఁడు తన మనోహరు డాఁచు నెసగుచుండు
నతఁడు మఱియొక్క దాని సంగతిని జేర
నోరఁజాలునె? యేమంచియు విదమైనఁ
బుం లీవృత్తిఁ జరియించుఁ బొలఁతియైన.

(క్రమముగాఁ గోపము నభినయించుచు) అట్టిచోఁ హీనకులజాత యగుదీనిని, ఈవగలాఁడిని మహారాణినగు నాయంతఃపురమునఁ జేర్చి నాశయ్యపై నానాథుఁడే స్వయముగా నలంకరించుచుండగాఁ నేనెట్లు సహింపఁగల్గుదు?

గీ॥ అగ్నిఁ గాలిన ఛేదితంబైన నొంఅపు
వలన బాధితంబైనను స్వ మెపుడు
దుఃఖ మొందదు గురిగింజతో సమముగఁ
దూఁగుటను నదిఘటియింప దుఃఖమొందు.

ఆగతియేనాకు సంభవించినది. ఇంక నేనీ యవమాన జనితదుఃఖ మెట్లు భరింతు? నాకిఁక గతియెయ్యది? విధీ! నాకింక నన్యశరణ్యమేమి? సర్వవిధంబులను నానాథునిచేతనే నేనవమానితనైతి. ఎట్టి యనూయఁ గూర్చకనే పరదారా సంగమాభిలాషుండగుఁ జతిఁ గలదాననైతి అట్టి పతిహృదయమునకే యసతిగా భావింపఁబడితి. తుదకీ సతీయంతఃపురమే యసతీ విలాసపురమయ్యె. ఛీ! ఇంక నేనీ ప్రపంచమున దేనికుండవలయు. మహారాజ్ఞినగు నేనేయిట్టి కట్టడితనంబుఁ గనులారఁ గాంచుచు నోర్వఁ గలనా? హా విధీ? ఇంకనాకుగతియెయ్యది?

మ॥ మనసారన్వరియించి యేనిసతినై మార్గంబు వోనాఁడియె
వ్వని ప్రాంతంబునఁ బ్రౌఢవోలె నెప్డు • వ్వరించియుంటిక • మఱె
వ్వనిపాదద్వయిసేవయే స్వతరణోపాయంబుగా నెంచితా
ఘనుఁడే, నాకుఖలుండుగాఁగ గత, యూ • జూ తప్పవేయున్నదే?

(నేలపైపునకు దృష్టిమఱ యొంగి చేతులఁలోగ్గుచు) హేజగ్మ జననీ.

చం॥ సకలచరాచరంబులకు స్థానముపై తి కారణంబవై
వికలత లేక స్థాయియగుఁ బెంపుడు త్లగ సర్వజీవకో
టికిఁ గతిగూర్చునిన్నుకడు • డెందమునందు స్మరించితమ్మరో
యిఁకమదిసంశయింపకఁ ద్వ • దీయసదోదరమందుఁ జేర్చకో?

తల్లీ! జగజ్జననీ? నీవేనాకుగతి. దే నీగర్భమున జొచ్చుటకు నిశ్చయించితి. మా మిమ్ము? భర్తనాదరణ జనితదుఃఖితనగు నన్ను

నీగర్భమున దాఁచుకొనుము? ఆహా హా మార్గ మొసంగితివా? ఇదేవచ్చుచున్నాను. ధన్యోస్మిధన్యోస్మి. (అనుచు భూగర్భమునఁజొచ్చును.)

మాన—(విభ్రాంతితో మదనవతినిజూచి) ఏ మీ చిత్రము ?

మదనవతి—(నిట్టూర్పు నిగుడ్చుచు) చిత్ర మేమున్నది ? అప్రతిష్ఠాసూచకమగు నాభావి జీవనమున కుత్కృష్ట మార్గమిదియని చూపిపోవచ్చిన ప్రతిష్ఠా దేవతయోయన నొక మహాద్భుత ప్రదర్శనముఁ జూడఁ గల్గితి. నాకు నిదియే మా ము. (మదనమాలినివలె) హా త్మోమాతా ? ఇదేనే సైతము. గర్భమున జొచ్చుచున్నాను. మదనమాలినీ దేవిని దాఁచుకొనినచోటనే నన్నుగూడా దాఁచుకొనుము ? ఇదే నీగర్భమున జొచ్చుచున్నాను (అనుచు నట్లే భూగర్భమున నంతర్ధానమగును)

మాన—(నిట్టూర్పు నిగుడ్చుచు క్రిందనుండియే కొంతవరకు క పైన వాలి తనలో) ఏమిది ? ఇదంతయు నింద్రజాలమువలె ను న్నదే! (కనులుమూసుకొని మఱలతెఱచి ఏకదృష్టితో) ఆనందా? నీవాక్యములన్నియు వేదవాక్యములు గదోయి ? స్వరూప మాత్రాబలలగు మాత్రమునే స్త్రీలను నిర్లక్ష్యముగాఁ జూడఁదగదు. స్త్రీయనఁగాసరఁసమ యగుప్రకృతి స రూపయనియెఱుంగుము? మూనుచో నెం దిట్టనట్టెట్టు చేయఁ ల శక్తిగలట్టిదాఁడుది, ప్రేమించుచో నెట్టివిరాగు ననురాగు నొనర్చి సరాగములాఁడఁగలట్టి దాఁడుది. ఇపుడైననీమదనమాలిని యీవిధంబుగా బేలయై ప్రా ంచునప్పుడే యీమె ప్రా న మంగీకరించి జాలివహింపుము? ఈమె యిష్టాను వర్తిత్వమే నీ శ్రేయఃప్రదము, లేనిచోఁ జెడిదవు, అనుచు నింకేమో నాకు తో ల్తనే బోధించితివి. ఆత్మసమానుఁడవగు నీయట్టివాక్యములన్నియు నప్పుడే త్రోసిపు తిని అదే మొదలు నీక్షణమువర నేఁగాంచుచున్నవన్నియు విచిత్ర ప్రదర్శనములె. అన్నియు నాశ్చర్యాంశములే. నేనేవిషయమున నాదినము నామదనమాలినిని గృహంబున నునిచి, కవాటబంధన మొనర్చి లాతఱాముద్రనమర్చుచు నీక్షణమువరకట్టి పనినే శ్రద్ధ వహించి చేయుచుంటినో ఆవిషయముననే నేనట్టి పరిలనములో

నున్నట్లుఁ గన్పించదు. చూడంజూడ నిదేమో అయోమయ
ముగానున్నది. నాగుండె బండవారినది. నా త్వధంబున నీవు
తప్ప మతేమియుఁ గన్పించుటలేదు. ఆనందా పరమా త్మ్వ
ప్రకాశకానందా? నీనిశ్చల మనోతత్త్వోప దేశార్థమ తయు,
నిప్పుడు బాగుగా స్ఫురణకు వచ్చుచున్నదోయి? యానందా?
(మరల కనులుమూయుచు) ఆనందా? ఇప్పుడొక్కసారి నాయొ
ద్దకు రాఁగలవా? ఆనందా, ఆనందా?

ఆనం—(అకస్మికముగఁ బ్రవేశించి) సచివాగ్రగణ్యా? ఏమిది! యిట్లుం
టివి!

మాన—(త్రుళ్లిపాటున లేచి) ఎవరునీవు.

ఆనం—ఆనందుఁడను.

మాన—(విభ్రమమున నలుదిక్కులుఁ బరికించుచు) ఈయంతఃపురము
న కెట్లు రాఁగల్గితివి?

ఆనం—(ఆశ్చర్యమున తనలో) నిజముగా నేనిచ్చట కెట్లురాగల్గితి?

మాన—చెప్పవేమోయి?

ఆనం—ఏమని చెప్పుదును? నాకిది స్వప్నమాయని యోచించుకొను
చుంటి.

మాన—(నిట్టూర్పుతో జనాంతికముగా ఇదొకచిత్రమా!

ఆనం—ఏమీ? యిదివరకొక చిత్రముఁ గంటివా?

మాన—ఒకటేయున నేల నేఁగాంచుచున్నవన్నియు జిత్రములే!

ఆనం—ఏమేమి చిత్రములో చెప్పగలవా?

మాన—ఇంక నీయొద్ద రహస్యము దేనికి చెప్పెద వినుము.

ఆనం—చెప్పుము?

మాన—(తల విసరుచు) ఊఁ హూ! చెప్పజాలను.

ఆనం—అదేమి?

మాన—సంగ్రహముగా నైనను జెప్ప దలంచితిగాని, సంగ్రహముగా
గాదు సరికదా! యేమాత్రమును జెప్పజాలను.

ఆనంద—ఎందుచే?

మాన — అవి నాసంసారసంబంధముగుటచే జెప్పజాలను. నన్ను క్షమించి కొంచె మూరకున్నచో నాహృదయమునకు విశ్రాంతి దెచ్చుకొనెద. ఇక నన్ను పల్కరించకుము. (అనుచు మొదటివలెనె రొంటి త్రిగిలును.)

అనం — (జనాంతికముగా దనలో) ఈతనికి నిజముగా దన సంసారము నందు మహాద్భుత చిత్రనాటక మొండు జరుగుచున ట్లు సూచింపబడుచున్నది. ఈమహాద్భుతంబున మునింగి తెరుఎమియు గాంచక చింతిలుచున్నాడు. నిజముగా నీతడు సరసుడే యైనచో నీ సంసారమందలి సుఖదుఃఖంబుల నేల లక్ష్యపెట్టు?

చం॥ సరసుడు చూడ నెన్నడును • సంసృతియందు లభించు దుఃఖముం
బొరయక సౌఖ్యముం గనక • బొల్పుగ నే నొకసాక్షి భూతుడై
బరువడి నాకు నంసృతికి • బంధము లేదది తన్ను వొందుచో
గురుదృఢబంధమై మఱిగతి • గూలుచునంచు దలంచి ముక్తుడౌ.

అట్టి మార్గమితడవలంబింపలేదు. కాని అతనులభమగు మామమాత్ర మీాతనికి లభించినది. ఈతని కీసంసారమందలి చిక్కులవలన యీాతని హృదయ మిప్పు డీవిధముగా రవసియున్నది. ఇదియే నిశ్చలమనము, ఈ నిశ్చల మనోదృష్టిచేతనే న్నుస్మరించిచూచి యుండవచ్చును. లేనిచో నేనిప్పు డిచ్చట కెట్లు రాగలను. నా యీరాకకుగల కారణమీాతని నిశ్చలమనోదృష్టిప్రభావమే. ఆహా! ఏమీ నిశ్చల మనోదృష్టి ప్రభావము. దీనియందెంత మహాద్భుతపు నాకర్షణశక్తియున్నది. ఔరా! దీనినేకదా యోగారులు బండగుండెయనికూడా చెప్పుదురు. ఇది కలవాడు దేని తలంచిన సఫలీకృతుడు కానేరడు? ఈతత్త్వమునే నాదికాలమునందే గ్రహించితి. గ్రహించి యొకరికి బోధించుటేకాని నేను మాత్రమవలంబింపలేదు. ఛీ నాదియు నొకజన్మమే. ఒకరితో నాకు పనేమి? నామార్గమునే జూచుకొనవలయు. నైనను నాజన్మము పరోపకారచింతనముననే ముక్తినొందవలయు. నాపరోపకారచింతన మీావిధంబుగ జేసెదగాక.

ఉ॥ ధారుణి మూఢమానవుడు • తత్త్వమెఱుంగక భార్యనాది సం
సారము నాది నాది పశు • జాలము బిడ్డలు నాదు బిడ్డలౌ

నారయఁ గష్టముఁ సుఖము • నంతయుఁ బొందెను వాఁడ నేనటం
చారయఁ బోఁడు ముక్తి పథ • మటి జడాత్ముఁడు జ్ఞానికావునన్.

ఇదియే నా పరోపకారచింతనము. ఇఁక నాయాత్మ చింతనమిది.

చం॥ నిజమగు నాత్మచింతనము • నెట్టనఁ జేసెడు వాఁడ నేని నే
నిజముగ సర్వమానవుల • నెమ్మనె యెంచెడువాఁడ నేని నే
నిజముగ నైక్యపెట్టి చెడు • నేస్తత దుష్కృతనైనఁగాని నా
నిజపథమెల్ల నాకిపుడె • నిండుగఁ బొల్పడని ముక్తికల్గుతన్.

ఈ చింతనమునే నిశ్చలమనముచేఁ జేయుచో నాకేల ముక్తికలు ...దు? కలిగినది. ఇప్పుడే నాకు ముక్తికలిగినది నాకిచ్చట నేమియు లేదు. ...చ్చటనే యేమి? ఎచ్చటను నేమియును లేదు. (కనులు మూసుకొని) ...ంతయు శూన్యము గాఢాంధకారబంధురంబగు నీ మహాప్రకృతియందు ...దుగో సర్వవ్యాప్తమగు నొక మహాద్భుత తేజము వెడలి తాండవం ...డుచున్న. ఆహా? సమస్తమును తేజోమయమే! ఈ తేజముతప్ప ...తేమియు లేదు. అనుకో లేదనునంతలో నది మాయుచున్నది. ఉన్నది, ...న్నది. ఆ సర్వవ్యాపక తేజము మహోద్దీపమై విరాజిల్లుచున్నది. ఆహా ... అదియే నిత్యమగుఁ బరమాత్మ యందే లీనము కావలయు. కావలయు ...అగుచున్నాను. ఇదే స్వస్వరూపమున లీనమగుచుంటి. (అనుచు నొక మహాతేజమున నదృశ్యుఁడు కాఁగా నా తేజము శమించును.

మాన—(కనులు తెఱచుచు, ఆనందా? ఆనందా? (అని లచికనడ కుండుటచే తనలో) ఏఁడీ యానందుఁడు? (లేచి నలుదిక్కులుఁ బరికించి) ఈతఁడసలు రానే లేదు. ఇదొకచిత్రము? చూడఁజూడ నాకిదేమో యొక మహాద్భుతపు స్వప్నావస్థవలె నున్నది. లేనిచో మహాపతివ్రతారత్నములందుఁ జేరిన నా మదనమాలిని భూగర్భమునఁ జొచ్చుటనునది పూర్వీయులఁ జరిత్రలఁబట్టి నమ్మఁదగిన నమ్మఁదగుఁగాక. పుంశ్చలీ శిరోమణియనఁదగు నీ వనోత్పత్తి భూగర్భమునఁ జొచ్చఁగల్గుటెట్లు? ఛీ! మదనమాలిని ... తము మహాపతివ్రతలలోఁ జేరుటెట్లు? పతియొనర్చు కృత్యంబు స...ంపలేని దొక సతియా? కాకపోవుఁగాక. ప్రకృతమున మాత్రము

దానిఁ దలంచుచో నా హృదయమునకు మిక్కిలావేదనమే కలుఁగుచున్నది. ఏల కలుఁగరాదు ?

ఉ॥ ఎన్ని విధాలకుఁ దనకు • నెంతయు నెంజిలిఁ గూర్చునట్టి వి
చ్ఛిన్నపు బంధితక్రియకుఁ • జెద్దముడుంగక సర్వకాల సం
ఛన్న మహాముదప్రథిత • సంభృతయై ప్రతియోగమూనకే
యున్న మహాపతివ్రత క • యూరటఁ గూర్చితి స్వప్రబుద్ధినై.

ఒక్క దీనికేయేమి ? ఛీ ఛీ ఛీ !

ఉ॥ ఛీ ! యినుమంతలజ్జయును • జెందక నీచ పథానువర్తినై
నేయమునన్ రహిన్ జెలఁగు • నీతివిశారదుఁడైన యావణి
గ్జాయను ప్రముచ్చిలించి కడుఁ • గష్టము లాతని పాలొనర్చి
బాయని మిత్రఘాతుకపుఁ • బాపము కే యొడిఁగట్టి తక్కటా ?

ఓరౌరా ! యీ మిత్రఘాతుక మహాపాతకంబెట్లు పాయుదు ? ఇంకఁ బ్రజల మొగమే నెట్లు కాంచుదు ?

గీ॥ పుడమి నే పాపమునకైన • ముక్తి కలదు
గాని యెప్పట్టు నెవ్విధి • నైన మిత్రు
నెడల నపకారమొనరించు • జడుని పాప
మెప్పు డెవ్విధినైన క • మింపఁగలదె ?

ఆ శమించు టెటులున్నను బాల్యమునుండియు నా వర్తించిన వర్తనమెట్టిది ? ఇప్పుడీ పరిణమించిన పరిణామమెట్టిది ?

ఆ. గీ. తొలుతతొలుత నెంత • దుర్మార్గుఁడై యున్న
మీఁదమీఁదనొండు • మిగుల మంచి
కార్యమందుఁ జెలఁగ • ఘనవంతుఁడతఁడంచు
సర్వజనులు వాని • సంస్మరింత్రు.

అటులే

ఆ. గీ. తొలుతతొలుత నెంత • తోరంపుసత్కీర్తిఁ
గ్రాలియున్న నొండు • కలుషకృత్య
మాచరించు నేని • యతిదుష్టుఁడని వాని
నిలను సర్వజనులు • నేవగింత్రు.

అట్టి యేవగింపుఁ బ్రతుకు బ్రతుకుఁగంటె జీవములఁ బాయుచో మేలుగదా! (యొడినుండి ఖడ్గముదూసి) ఖడ్గమా! (అనుచు దాని సాలో చనముగ దువ్వుచున్నంతలో)

(భూ గ ర్భ ము న)

మ॥ పతియే దైవమటంచు నెంచుసతి స • ద్భావంబు సర్వంబునుం
బతినే మోసము చేసుఁగాదగిన దు • ర్భావంబుగా మార్చి యా
పతినెంతో కడు విభ్రమత్వమునముం • పంజేయు వ్రాలా! యిదే
సతియౌనన్నటఁజేర్చి శీఘ్రముగ సు • స్వాంతుల్ బతిన్ జేయుమా!

(ఆలకించి ఎచ్చట దీధ్వని? యీధ ని మదనమాలినీ కంఠధ్వనియే హృదయమా? యిట్లు విభ్రమపడుచుంటి? ఈధ్వని యీభూగర్భము నుండియే వచ్చుచున్నది. నిజముగ నీయువిద లిచ్చరను ఈ భూదేవియే తనగర్భమునఁ దాఁచుకొనినదగుచో, నాప్రాణముసైతమంగీకరించి మగడవారల నాకనులకేలచూపదు? అదియంతియు నిజమేయగుచో నిది యు నిజమేయగు. (మోకాళ్లుపైఁ గూర్చొని భూమిపై కేల్మోయిమోడ్చి) జననీ! (అనునంతలో భూగర ద్వారము దెఱువఁబడఁగవిస్మితుడై) ఇదేమి? ఇచ్చట నవ్వుడే ద్వారమేర్ప నదేమి? ఇచ్చటనేఁడే లోకోభూదేవి పిలువ కనే పలుకుచున్నది. పిలచినంతనే నోఱు తెఱచుచున్నది. ఆఁ అనునంతలోఁ నిరు ర్క్రమింగినది. ఇఁక నన్నుసైతము (అంతలోఁ గర్భారహారతులఁగొని భూ ర్భమునుండి మదనమాలినీ మదనవతులు ప్రవేశించుచుందురు.)

మాన—(మదనమాలినీ మదనవతులఁజూచి చివుక్కున నీవలకువచ్చి విస్మ యమువహించి తనలో) ఇదేమి?

మదనమాలిని —నాథా! ఏమట్లు విస్మయపడిచూచెదరు? (చిఱునగవున) నే నెవ్వరని తలంచితిరి? (మదనవతిని దగ్గరకుఁ జేర్చుకొనుచు ఈ వ్యక్తి యెవరో యెఱుంగుదురా? ఆబాలవిదితంబుగ నీ నగ మందు మణిమంతుఁ డను పేరుతో రత్నవర్తక మొనరించుచు సకల దిగ్దంతరాళముల ననేకవిధంబులగు యశశ్చంద్రికలఁ గాంచిన వ్యక్తి యీవ్యక్తి. పదంపడి తమ యనుగ్రహమువడసి యీకోట యందే గృహము నిర్మించుకొనిన వ్యక్తి యీవ క్తి. తా నిర్మిం చుకొనిన గృహమునుండి యీ నా యంతఃపుమునకే విధిగా

విస్మయజనకమగు నీ భూగర్భ రహస్య ద్వార మేర్పఱచిన వ్యక్తి యీవ్యక్తి. మణిమంతుఁడను నామధేయమునను్న యీవ్యక్తి భార్యగా సంచరించి శృంగారవతియనియు, శృంగారదేవియనియు సౌందర్యమాలిని యనియు నామములఁ జెలఁవొంది మీ మెప్పు వడసి సతీశృంగారవతి యను బిరుదువహించిన వ్యక్తి మీధర్మపత్ని నగు నేను, నా సోదరి యగు మదనవతియే యీవ్యక్తి. మీచే నేనుగా భావింపఁబడి, మీచే ప్రుచ్ఛిలింపఁబడి, మీ... నీ కపటనటన జనాంశంబుల నిస్సంశయుఁ జేయునంత చాతుర్యము నెట్టి యనుభవము లేకయు, రసవంతముగ నీరేయి యింతకు ముందు మీయెడఁ బ్రదర్శించిన వ్యక్తి యీవ్యక్తి. ఈ వ్యక్తి సర్వావస్థలయందును మీప్రేమ సుధారసంబును నాతో సమముగ ననుభవింప నిశ్చయముఁ జేసుకొనియు, సోదరీ వాత్సల్యముఁ జూపఁదలఁచియు, నిట్టి కపటవర్తనమునకుఁ గడంగినది. ఈ పటవర్తనమంతయు నా మనోనువర్తిత్వమున జరుఁగుచున్నది. నా మనస్సు కపటము ననువర్తించుటకుఁ గల కారణము మీరే యూహింపఁగలరు. తెలిసియో తెలియకనో చేసిన మా యీ స్వల్పమగు నేరము సహించి మమ్ముల ననుగ్రహించుటకు కోరుచున్నాము. నా సోదరియగు నీ కన్యకామణి త్రికరణశుద్ధిగ మిమ్ములనే వరించియున్నది. అందుకై నేనే మిమ్ములఁ ద్రికరణశుద్ధిగఁ బ్రార్థించుచుంటి. మేము మీయందొనగూర్చిన కృత్యమునందలి దోషాదోషములు పాటింపక మా భావమెఱిం మమ్ముల క్షమించుఁడు. మీదయకు పాత్రులము. (అనుచు నిర్వురు నాతని పదములపై వ్రాలుదురు)

మాన—(తనలో) నిజముగ నీ కథయంతయు సత్యమైయుండునా? ఐనను గాకున్నను వీరల నిర్వుర నింక నింతతో విడువరాదు.

(నే పథ్యంబున గంట మ్రోగును)

అదిగో తొలిజాము గంట మ్రోగుచున్నది. ఈ తెల్లవాఱులోపల నింక నెన్ని చిత్రములు జఱుఁగనున్నవో? ఎన్ని జఱుఁగనున్నను వీరల నింక విడువకుండ ప్రయత్నముసేయుదు. ఉన్నను వీరల నింక న

టట్లు? నన్నింక నెట్టిమోసముచేసి యదృశ్యలగుదురో! ఐన కానిమ్ము? కాకయున్నచో తేహృదయము స్వ చిత్తుఁడనై వీరియందలి నిజానిజములు విమర్శించి యుక్తాయుక్తముల నిర్ణయించుకొందు. (ప్ర) రా ! యిఁక లెమ్ము? (అనుచు మదనమాలినిని స్పృశించి లేవనెత్తి మదనవతిని స్పృశింపఁబోయి సంశయించి యది విరమించుకొనును)

మదనమాలిని — నాథా! ఏల సంశయించెదరు ?

మాన — (చిఱునగవున) నీ యాజ్ఞకొఱకు.

మదనమాలిని — (చిఱునగవున) మీ రొనరించు కృత్యంబులన్నియు నా యానుసారముగనే జఱుఁగుచున్నవా? లేకున్నను మీదయను కోటి మమ్ము మీ పదములందు వ్రాలనిచ్చుటయే మదాజ్ఞ.

మాన — ఔరా! అంతకు నంతకు నెంత జాణవైతివే? ఈ నీ సోదరి పేరేమి? మదనవతియా?

మదనమాలిని — ఔను.

మాన — మదనవతీ లెమ్ము? (అనుచు దాని స్పృశించి లేవనెత్తి యిర్వుర బుజములపై చేయివైచి మదనమాలినితో) రాజ్ఞీ! ఈ రాత్రమంతయు నిదుర లేకుండుటచే నాహృదయ మస్వస్థముగనున్నది. కొంచెము సేపు వవ్వాళించినగాని నా హృదయము స్థిరపడదు.

మదనమాలిని — (చిఱునగవున) చిత్తము.

మాన — (మదనవతితోఁ జఱునగవున) ఏమి మదనవతీ?

మదనవతి — (సిగ్గిలి తలవంచును.)

మాన — (మదనమాలినితో) దీని కిపుడు సిగ్గిలుచున్నది ?

మదనమాలిని — నాథా! అవివాహిత యగుఁ జిన్నదానికి సిగ్గుకాదా ?

మాన — (సాక్షేపముగ) ఆహాహా! మీ స్త్రీలలో సిగ్గునకుఁ జిన్న పెద్ద తారతమ్యంబులున్నవా ? మీ కెప్పుడు నిట్టి సిగ్గే భూషణము. ఈ సిగ్గవరెఱుంగని సిగ్గు? నాకు తెలియకున్నను మీసిగు స్వరూప మెట్టిదియో సంపూర్ణముగ మీరే నాకు చూపెట్టిరిగఁదా? ఇంక నెందుకు రమ్ము. (మదనవతితో) మదనవతీ! రమ్ము (అనుచు నిర్వురతో శయ్యదాపున కేగుచు మదనమాలినితో) వినచో నిజ

ము గా మీచే నిర్మింపఁబడి యొక రహస్యద్వార మీ లమ దున్నదా ?

మదనమాలిని—నాథా ! ఆమర్మము లన్నియుఁ బ్రత్యక్షముగనే చూపుదు రండు.

మాన— సరే పద.

మదనమాలిని—(భూగర్భద్వారము సమీపించి) ఇటుచూచితిరా ? ఇదియే ద్వారము. ఈ గదియెల్లయు నెట్లు స్ఫటిక శిలాఖచితమై యున్నదో ఈ ద్వారములు సైతమట్లే భేదవిహీతంబుగ టిక శిలాఖచితమై యొరులెఱుంగలేని పనితనంబున నిర్మింపఁబడినవి. పదంపడి లోన ప్రవేశించునంతనే వానికై యవి మూసుకపోవు కీలుయంత్రము సైతము నిందు లోభాగమున నమర్పఁబడి యున్నది. చూచెదరు రండు. (అనుచు నారహస్యద్వారమున నిష్క్రమించుచుండఁగా మదనవతితో మానపాలుఁడు నాశ్చర్యమభినయించుచు నట్లే నిష్క్రమించుచుండగా నవనిక జారును)

( అవనిక లేవఁగా )

( ఉద్యానవనము )

[ మానపాలుఁడు మదనవతీ మదనమాలినులతో ప్రవేశించుచు ]

మాన—ఆహా ! మదనమాలినీ! నిజముగా నీవెంతయుఁ జాతుర్యసీమవు ఈ మదనవతి సైతము నీకంటెఁ బదిరెట్లు మిన్నయని చెప్పవచ్చును. కాని, ఇంత నిపుణత్వ వంచకలగు మిమ్ము మఱల నెట్లు ప్రేమించుచో అనుచు సందేహ మభినయించును)

మదనమాలిని—(అర్ధోక్తిలో) నాథా ! ఇంకను మీసందేహము నివృత్తి కాలేదా ? నాఁడా తొలినగర బాహ్యారామ సమావేశకాలమందు మీ చిరకాలమిత్రులగు నానంద పండిత వేదాంతి బోధించిన సాంసారిక తత్వమైనను స్మృతికి వచ్చుటలేదా ?

మాన—(ఆలోచించి) మనోహారీ నిజము. ఆ యానందపండితుని వాక్యంబులన్నియుఁ బరమానంద ప్రదంబులు, సకలానుభవ వేద్యంబులు లేనిచో

కం॥ స్త్రీయే సుఖముం గూర్చును,
స్త్రీయే దుఃఖంబుఁగూర్చు • స్త్రీయే యధిక
శ్రేయః శ్రేయంబుల నిడు
స్త్రీయే ంస్మృతినిమును్చ • స్త్రీయె తేల్చుక్.

అని చెప్పియుండెను. అది యెల్లయు వరుసగా జతేఁగియేతీరినది. ందుచే

గీ॥ ధర్మపత్నిం గ్రహించి సం • తతినివడసి
యజ్ఞయాగాది కృత్యంబు • లాచరించి
సర్వఋణ ము క్తుఁడై మును • కుంబుఁగోర
నగును లేకున్న భ్రష్టుఁడెం • కైన నరుఁడు.

అని యాతఁడు నుడివిన వాక్యంబులన్నియు నవశ్యాచరణీయం బులు. కాని మదనవతిని సైతము.

దనమాలిని—(అర్ధోక్తిలో) నాథా! మఱల మదనవతియనియు మదన మాలినియనియు వృథాసందేహములకు పాల్గొనక నిష్కళంక మగుఁ బ్రేమతో మా యిర్వుర నేలుటయే మీ కఖిలా దాయ కము. మా జననీజనకులకు జనించిన కుమారికలము ‾ మిర్వు రము. అట్టి మమ్మిర్వురను విధు క్త వివాహితలఁజేయు నోము నోచకపోయితిమే యను విచా మఃన మున్ను మా జననీజనకుల నెట్లో సమాధానపఱచి యింత కార్యక్రమము నకు గడంగుట యెల్లయు లోకోపకారమునకై గాని మా తెలివితేటలఁ బ్రదర్శిం చుటకై కాదు. దయచేసి మ ర్వుర నను గ్రహించి నిష్ప్రతూ జక చింతావివర్జితులై నిష్కళం త ప్రేమార్ద్ర స్వాంతులై సక లా ంబుల ననుభవించుట కిదే ప్రార్థించుచున్నాను. (అనుచు నా ని పదములపైఁ బడును)

నన—(గుచ్ఛియెత్తి) ప్రేయసీ! మీ చరిత్ర మంతయు నిష్కళంకమని మీ యీ కపటనాటకమే చెప్పక చెప్పుచున్నది. ఐనను సర్వ స్త్రీజనంబులు నిట్లే భర్తృమానసవర్తినులై, సకల విద్యాచతు రిణులై, సౌందర పుంగనులై యున్నచో పురుషుల కిదే స్వర్గము. కాని నిజముగ పురుషుఁడగు వాఁడు లేనిపోని పరీక్షలకుఁబూని

భార్యను చెఱఁబెట్టుటయు, పరస్త్రీ ధర్మనాశకుండగుటయు, నిరంతర దుఃఖభాజనంబని యిందు నా చరిత్రము చెప్పుచున్నది. నిజముగ పురుషుం డిట్టి విషయంబులం జేరుచో నెంత పరిశుద్ధాత్ముండైనను సర్వభ్రష్టుండగుటలో సంశయమున్నదా? (మదనవతినిజూచి) మాదనవల! నీవెవరవో తెలియకయున్న నిన్ను నా భుజములపై నలంకరించుకొంటి. ఇంకనుండి గంగావరమేశ్వ న్యాయంబున నిన్ను పాలించుదు. (మదనమాలినిజూచి) రా! ముమ్మారులకు నీకిది యంగీకారమేనా?

మదనమాలిని—నా యంగీకారము లేనిదే మీ రంగీకరించుట కవకాశముకలుగ లేదని గ్రహింపుడు.

మాన—(చిఱునగవున) మదనవతీ! నీ సోదరియగు నీ మదనమాలినికి నాయం దెట్టి పదవియున్నదో నీకు నట్టి పదవి నిప్పుడే యొసంగితి. కాని ఇపుడు నాయొక యభిప్రాయంబునకు మీ రిర్వురుఁ గలసి శ్రేయో వృద్ధిని గోరవలె.

మదనవతి—చిత్తము. (అనుచుఁ దలవంచును)

మాన—(మదనమాలినితో) ప్రేయసీ!

గీ॥ అఖిల పురుషులు నిష్కళం • కాత్ములౌచు
ధర్మబద్ధులై నిగమోక్త • కరతులయి
చెలఁగుచుందురు గావుత • ...జనంబుఁ
గరమునన్లోమె విఖ్యాతిఁ • గాంచుగాత.

మదనమాలిని—
మదనవతి— (శిరములు వంచుచు) శుభం. శుభం. శుభం.

(అవనిక జారును)

శ్రీ పరమేశ్వరార్పణమస్తు.

సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



# తప్పొప్పుల పట్టి

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 29 | గూడునే | కూడునే |
| 4 | 23 | మానగు | మానుగ |
| 5 | 12 | పర్తి | పరి |
| 6 | 12 | వడయు | వరలుఁ |
| ,, | 17 | సఫలతొందలేదు | సఫలుఁడెందుఁగాఁడు |
| 8 | 15 | ్రనిష్క | నిష్క్ర |
| ,, | 21 | అనుచు్రనిష్క | అనుచుఁ గిరీటము సింహాసనముపైనుంచి నిష్క్ర |
| 13 | 5 | అనుచు. | (అనుచు, |
| ,, | 21 | చెంగ | చెలంగ |
| 15 | 14 | యతి | వతి |
| ,, | 21 | కోట | కోనుట |
| 16 | 1 | ఐనచో | ముందు |
| 17 | 23 | రించదేనికి! | రింపనేటికి |
| 18 | 21 | వ్యక్తైవ | క్తియేవ |
| | | ఈవిషయంబున సంకట శ్లో గ్రహించునది. | |
| 21 | 11 | మనోసార | మనోనుసార |
| 22 | 5 | విజయ-మంచిది | విజయ-(ఆలోచించి) మంచిది. |
| 27 | 10 | (ఉ, "వ"కు విరతి "స"గా సరిచేయునది.) | |
| 29 | 18 | పంబుకంత | పంబునంత |
| ,, | 14 | ముగుదుల | ముఁగుదల |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 28 | 3 | పించెదవా! | పించుచున్నావు. |
| 32 | 8 | హారముల | ఈహారముల |
| 33 | 8 | తనమెడలో | (తనమెడలో |
| 36 | 3 | మాత్రముచేయున దేమున్నది. | చేయునదిమాత్ర మేమున్నది. |
| ,, | 5 | వాఁడైనను | వాఁడైన |
| 40 | 25 | శ్రీల | స్త్రీల |
| 45 | 9 | మనభర్తన్గా | మున భర్తన్గా |
| 46 | 21 | వర్యో | వమెన్వి |
| 47 | 2 | భర్త్య | భర్త |
| ,, | 3 | కూడనా! | కూడునా! |
| 48 | 11 | బట్టు | బట్టుఁ |
| 51 | 21 | ఃపుద్ధగా | ఃపురబద్ధగా |
| 54 | 9 | గులుకుతో(మాఘ్ను,) | జెలువుతో |
| 54 | 27 | సర్వాశృతి | సర్వాశృతి |
| 56 | 8 | ముగుదుగా | ముగుదగా |
| 58 | 2 | డేమిం | డేం |
| 59 | 7 | పోతే | ఐతే |
| 63 | 13 | మణిమణి | మణి |
| 70 | 16 | నిశ్చయము. | నిశ్చయము! |
| 71 | 5 | నేవరి | నెవరి |
| 75 | 22 | య్యైనవి | య్యైనది |
| 76 | 4 | అనుచు | (అనుచు |
| ,, | 18 | నగునెమద | నగు, నేమద |
| ,, | 19 | దానినే మహా | దాని?నే మహా |
| ,, | ,, | యిష్టంబు | యిష్టంబగు |
| 78 | 7 | తనలో | (తనలో) |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ,, | 13 | యెవ్వతో | యెవ్వతో |
| ,, | 14 | మద | ముగ్ధ |
| ,, | 25 | నా రము | నాక రము |
| , | 28 | రా ఞ | రాజ్ఞి |
| 7 | 14 | వేరు | వేఱు |
| ,, | 26 | దత్కృతి | దుష్కృతిఁ |
| 84 | 13 | చోర్యాది | చోరాది |
| 85 | 5 | గర్భమ | గర్భము |
| 86 | 5 | వానిదైనవన | వానిదైన, వన |
| 89 | 11 | సంతన | సంతస |
| ,, | 12 | వద | పద |
| 91 | 12 | అఁ | ఆఁ |
| 92 | 7 | ఆయింక | ంకా |
| 97 | 27 | ప్రదర్శించు | పదర్శించు |
| 98 | 16 | సతిత్వ | సతీత్వ |
| ,, | 19 | ఒనచో | ఐనచో |
| 99 | 7 | ~ టుల | నిన్నటుల |
| ,, | 20 | హా | హో |
| 104 | 26 | త సకి | తొాంఁకి |
| 114 | 17 | గాంచగ | గాంచంగ |
| 118 | 13 | గూరు | గూర్పు |
| 119 | 3 | నేనిటుల | నే ఇటుల |
| 122 | 3 | విభ్ర మేమి | విభ్రమమేమి |
| 126 | 1 | డించినను | డించి; నను |
| 128 | 1 | నూనుచో | పంతమూనుచో |
| ,, | 2 | చెడి | చెడె |
| 131 | 6 | దుష్కృతే | దుష |

